దిక్కుమాలిన పురుషులీ స్త్రీసంఘముచే నిట్లింతకాలమీ విధముగా సేవచేయించుకొని పీల్చి పిప్పిచేసెదరో చూచెదనుగాక. వారుపురుషులఁట! సర్వారాధ్యులఁట! స్త్రీలు వారికి బానిసలఁట! రాత్రిందివములు వారి పాదసేవచేయవలయునఁట! అది స్త్రీలకు విహితకృత్యమఁట! అందువలన స్త్రీలకుఁ బాతివ్రత్యమహిమ యబ్బునఁట! పూర్వము స్త్రీలు తమపాతివ్రత్యమహిమచేఁ ద్రిలోకములను గడగడలాడించిరఁట! ఒకతె సూర్యగమనము నరికట్టెనఁట! మఱియొకతె త్రిమూర్తులను బసిపిల్లలనుగాఁ జేసినదఁట! ఆహా! పురుషులెంతటి కుటిలులు? అమాయికలగు స్త్రీలను వంచించుట కెట్టిపుక్కిటిగాథలను గల్పించినారు? ఇవి యన్నియు నెందులకు? ఆడువారి కెరచూపి వారిచే సేవచేయించుకొనుటకు? పతిసేవవలన గొప్పమహిమ గలుగునన్నచో స్త్రీలందుల కపేక్షించి రాత్రిందివములు, ఊఁ, అనక, ఆఁ, అనక తమ్ము సేవింతురుగదా యని పురుషులయుద్దేశము.

పురుషులందులకుఁ దగినట్లుగా ధర్మశాస్త్రముల నిబంధించిరి. పుక్కిటిపురాణములు కల్పించిరి. ఈయత్నమంతయు స్త్రీలను వంచించుటకే కాని వేఱుకాదు. ధర్మశాస్త్రరచయిత లందఱును బురుషులే కావున వారియాటలు సాగుచున్నవి. స్త్రీలే ధర్మశాస్త్రకర్తృలైనచో నింత పక్షపాతముండునా? దైవసృష్టిలో స్త్రీపురుషులు సమానులు. ఒకరి కెక్కువయు నొకరికిఁ దక్కువయులేదు. బండికి రెండు చక్రములును సమముగా నుండవలయును. అప్పుడే బండి యెట్టి ప్రదేశములందైనను సరిగా సుఖముగా నడచును. అట్లే సంసారశకటమునకు స్త్రీపురుషులు చక్రములు. సర్వవిధములచేతను, అవి సమములైయున్నపుడే మానవజీవితములకు సుఖమబ్బును. పురుషులది గ్రహింపక స్వార్థ

పరులై స్త్రీసంఘము నిట్లవమానపఱుపఁ దొడఁగిరి. నిజమాలోచింప స్త్రీలకంటెఁ బురుషుల గొప్పయేమి? వారివలెనే స్త్రీలు తల్లికడుపునఁ బుట్టలేదా? పురుషు లమానుషశక్తులతో దివినుండి యవతరించినారా యేమి? స్త్రీలకంటెఁ బురుషులెందులో నధికులు? విద్యయందా? బుద్ధియందా? సామర్థ్యమందా? కార్యశూరతయందా? ఎందునులేదు. స్వార్థపరత్వమునందు మాత్ర మధికులు. పతియింటికి రాఁగానె భార్య వాని నెదుర్కొని పాదములు గడిగి తజ్జలము నెత్తిపై జల్లుకొనవలెనఁట! అది పాతివ్రత్యమునకు మొదటి మెట్టఁట! పాపము—పురుషులింటికి వచ్చి యేమియుఁ గోరకముందే "అమ్మా! నీ మగఁడు వచ్చినాఁడు! చూడు. స్నానమునకు నీళ్లందిమ్మా. మేడపైనున్న పట్టుపంచె తెచ్చి యిమ్మా. ఇదిగో వేసవి మండిపోవుచున్నది. భుజించునప్పుడు విసనకఱ్ఱ దీసికొని చక్కఁగా విసురమ" ని ముదుసలిముండ లాజ్ఞాపించుచు నిలువనీయరు.

పురుషు లింద్రియలోలురు. పెద్దలైనపిమ్మటఁ గన్యకలను బెండ్లియాడినచో వారు తమయిష్టప్రకారము నడువరని ముక్కుపచ్చలాఱని పసిపిల్లలను దాము వివాహము గావించుకొని నయభయములచే వారిని లొంగఁదీసికొని సేవచేయించుకొనుచుఁ, బిల్లలను గనుయంత్రములుగాఁ జేసి వారల యాయురారోగ్యవిద్యావిజ్ఞానముల నధోగతి పాలు గావించుచున్నారు. "ధర్మశాస్త్రనిబంధములన్నిటి మాటకేమి? కాని "నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి" యను వచనము నన్ను నఖశిఖపర్యంతమును మండింపఁజేయుచున్నది. ఆ వచనమును వ్రాసిన యసూయాపరుఁడు నా కంటఁబడినచోఁ దగినశిక్షచేసి విడిచిపెట్టుదును. దివ్యజ్ఞానసమాజమువారు స్త్రీపక్షమవలంబించి పనిచేయుటం బట్టి స్త్రీసంఘమున కీపాటియైనను నామరూపములు గల్గినవి కాని లేనిచో వీరు యావజ్జీవమును వంటయింటిమూలలలోఁ బడి చావవలసినదే? ఆహా! ఏమి

యక్రమము? ఏమియధర్మము” అని రమారమి ముప్పదివత్సరముల ప్రాయముగల యువతియొకతె విశాఖపట్టణమునఁ జేరి శాస్త్రిగారి కచ్చేరీచావడిలో నొకకుర్చీలోఁ గూర్చుండి తలపోయుచుండెను.

సాయంకాలమయ్యెను. చీఁకటులింకను లోకమును దట్టముగా వ్యాపింపలేదు. ఇంతలో నొకపురుషవ్యక్తి యచ్చటఁ బ్రవేశించెను. అతఁడు కలెక్టరుకచ్చేరీలోఁ జిన్నగుమాస్తాపని చేయుచుండెను. నాలు గైదు వీశల బరువుగలకాగితముల దస్త్రమును గక్షభాగమున నిడికొని బుట్టంతపాగా శిరమునవెలయుచుండఁ గచ్చేరీనుండి నడిచివచ్చుట వలనఁ బొడమిన చెమ్మట లాతనిని సచేలస్నానము చేయించుచుండ మెల్లమెల్లగాఁ జావడిలోనికివచ్చెను. అతఁడు “బ్రతుకుజీవుఁడా” యని యాకాగితములకట్టను బల్లపైఁ బడవైచి నిలువఁబడెను. కమల యాంబ యావచ్చినవాఁడు తనభర్తయని తెలియునుగాని యతఁడింటికి వచ్చినప్పుడు లేచి ప్రత్యుత్థానాదికము చేయుట, నిశ్చయించుకొనలేకపోయెను. పతి సమీపమునకువచ్చినప్పుడు లేచి నిలువఁబడుట యలవాటు. ఆయలవాటుచొప్పున లేచి నిలువఁబడవలెననియున్నది. “అన్నివిధములచేతను బురుషులతో సమానమగు స్వాతంత్ర్యము స్త్రీలకుండవలయు” నన్న తీర్మానము మహిళాసభలోఁబెట్టినదామెయె. స్త్రీలువచ్చినప్పుడు పురుషులు లేచి నిలువఁబడుచున్నారా? లేదు. పురుషులులేచి స్త్రీలను గౌరవింపనపుడు స్త్రీలుమాత్రము పురుషుల నేలగౌరవింపవలెనని పట్టుదలగలదగుటచే లేచి నిలువఁబడుటకును నిష్టములేదు. కమల వర్షారంభసమయమునఁ మేఘపంక్తులచే స్తంభీభూతమగు నాకాశమువలె నిస్తబ్ధయై నీరవయై క్రిందుచూచుచుండెను. గోవిందరావు భార్య నైమనస్యమునుగాంచి తనలో “ఇది యీదినము దివ్యజ్ఞానసమాజమువారిసభకుఁ బోయియుండును. వారియుపన్యాస విష మీమెతలకు బాగానెక్కియుండవచ్చునని తలంచుచు లోనికరిగి

దుస్తులను మార్చుకొనివచ్చి కాగితములకట్టను సడలించి సవరించుచు భార్యనుజూచి "ఏమి. కమలా! నేడు పరాధీనచిత్తురాలవయి యున్నావు. దివ్యజ్ఞానసమాజమువారి విషము తలకెక్కినదా? యేమి!" యని పలికెను.

అదివఱకుఁ బురుషసంఘముపై నత్యంతకోపము వహించి దండ తాడితమై బుసకొట్టుచున్న నల్లత్రాచుపామువలెనున్న కమల పరిహాస గర్భములగు పతివాక్యములు చెవులకు శూలఘాతములుకాగా, ప్రభంజన ప్రసారసముత్తుంగతరంగపరిక్షుబ్ధమగు నబ్ధి వడువున డెందము విపరీత భావసంకులితమైయుండఁ బలికినేమియుఁ బ్రత్యుత్తరమీలేక యట్లే యుండెను.

ఆసమయమున నఱువదేండ్ల ప్రాయముగల ముసలివితంతువొకతె పట్టిన గ్రుక్కవిడువక విలవిలదన్నుకొనుచు నేడ్చుచున్న సంవత్సర ప్రాయముగల యొకబాలునొకని నెత్తుకొని చావడిలోనికివచ్చుచు, "ఓసీ! కమలా! ఇచ్చటనా? కూర్చుంటివి. నీవు సభకుఁబోవునప్పుడీ పిల్లవానినిగొనిపొమ్మని యెంతచెప్పినను విన్నావుకావు. ఈదినమున వీడేడ్చినయేడ్పునకు హద్దులేదు. వీనిని బట్టలేకపోవుచున్నాము. దీని కేమి? ఏదోసభకువెళ్లి వచ్చినావు. సాయంకాలమైనది. పిల్లలందఱు నన్నము దినుచున్నారు. నీపెద్దకొడుకు సామాన్యుడుకాఁడు. వాఁడెందు చేతనో యలిగి నల్వురతో నన్నముకురాక పెరటివరండాలో నేడ్చుచు నేలదొరలుచున్నాఁడు. నేను మడిగట్టుకొంటిని. చల్దియన్నముదిన్నవిస్సి గాని నెట్లుముట్టుకోఁగలను? పిల్లలకు వేళకన్నమైనను బెట్టకపోయిన నెట్లు? రెండుగంటలు కొట్టకమునుపే సభకుఁబోయితివి, ఇప్పుడువచ్చి తివి. ఇంతకాలమీపిల్లలనెవ్వరుపట్టగలరు? ఇవి యెక్కడిదిక్కుమాలిన పాడుసభలోఁగాని పండువంటి స్త్రీసంఘమును బాడుచేయుచున్నవి.

ఇట్టివింత సభలు మాచిన్నతనములో లేవమ్మా!” యని గొనుగుచుఁ బిల్లవానిని గమలయొడిలోఁ గూర్చుండఁబెట్టి రా, వచ్చి మడిగట్టికొని విస్సిగాని కన్నమ్ము పెట్టుమనిచెప్పి వెడలిపోయెను.

హిందూసంఘధర్మముల విషయమై యదివఱకే కుపితయై పరిత పించుచున్న కమల మఱింత మండిపడి “ఈ దిక్కుమాలిన పీనుఁగున కెప్పుడును పాలే” యని బాలుని వీపుపై నొక్కటిచఱచి క్రిందఁగూ ర్చుండఁబెట్టెను. బాలుఁడు విలవిల దన్నుకొని యేడ్చుచుండెను.

నాఁటి కమల చర్యచూడఁగా గోవిందరావు ప్రాణములు మీఁది కెగిరిపోయినట్లయ్యెను. ఆకాశము విఱిగి మీఁదఁబడినట్లయ్యెను.

అతఁడు చేయునదిలేక బాలకుని మంచిమాటలతో నోదార్చుచు, బుజముపై బండుకొనిఁబెట్టి మెల్లగాఁ జేతితోఁ దట్టుచుఁ జల్లగాలిలో నిట్టటు పచారుచేయసాగెను. అది వఱకే దుఃఖించి యలసటఁజెందు టచే బాలుఁడేడ్పుమాని నిద్రించెను. గోవిందరావు మెల్లమెల్లగా భార్యను సమీపించి “కమలా! నేఁడింత కుపితవై యున్నావు. కారణ మేమ” ని యడిగెను.

క—కారణమా? ఏమున్నది. మీరు చేయుపనులే.

గో—(ఆశ్చర్యపడుచు) అదేమి? కమలా! అట్లందువు నేను నీ కేమి యపకార మొనర్చితిని? స్వప్నమందైనను నీ కపకృతిచేయలేదని నా నమ్మకము.

క—మీరనఁగా, బురుషులని నా యభిప్రాయము.

గో—(కొంత నెమ్మదిపడి) పురుషసంఘము స్త్రీసంఘమున కప కృతి యొనర్చెనని నీ తలంపు (ఆలోచన మభినయించుచు) ఏమి యప కార మొనర్చినారు కమలా?

క—ఎవరిదోషములు వారి కగపడవు.

గో—అందుచేతనే యడుగుచున్నాను. చెప్పుము.

క—ఒకటియా? రెండా! వేనవేలపకారములు. ఎక్కుడఁ జెప్పఁ గలను.

గో—స్త్రీల కపకారము లొనర్చుటే పురుషుల పనియని తేలుచున్నది.

క—కాకేమి? స్త్రీసంఘము నేవిధముగా మట్టుపెట్టవలెనన్న విషయమే మున్నాటయఱువది గడియలును బురుషుల యాలోచనము.

గో—ఇది దివ్యజ్ఞానసమాజమువారి పాఠము. తు, చ, తప్పకుండ నప్పగించుచున్నావు. కాని నీకు వివేచనశక్తి లేదు.

క—(భర్తను నిదానించి చూచి) అవును. మీ కెల్లప్పుడు సేవ చేయుచున్నచో వివేచనశక్తి యుండును. కాదండీ.

గో—వినఁదగు నెవ్వరుచెప్పిన, వినినంతనె వేగపడక వివరింపఁ దగున్.

క—అది కాదని యెవరన్నారు?

గో—ఎవ్వరు ననలేదు. కాని యది క్రియావిషయమునఁ జూపవలెను. కోపమువిడిచి నాకు సమాధానము చెప్పుము. మీ సమాజము వారి వాదమెంత దుర్బలమో నీకు బోధపడును.

క—ఏదీ! అడుగుడు.

గో—పురుషులు స్త్రీసంఘమున కొనర్చినవన్న యపకృతులను గూర్చి ముందుగా విమర్శింతము.

క—తప్పక.

ఇంతలో గోవిందరావు బుజముపై పండుకొనిన బాలుఁడు గుక్కపట్టి యేడ్వనారంభించెను.

ఆసమయమున పేరిశాస్త్రి, "ఎవరురా! అక్కడ? రామస్వామీ, రామస్వామీ! ఏమిరా? మాటాడవు. పిల్లవాఁడంతగా నేడ్చుచుండ నూరకున్నారేమిరా? చీఁకటిపడినది. దీపమింకను బెట్టనే లేదా?" అని కేకలు వేయుచుఁ జావడిలోనికి వచ్చుచుండెను. కమల అదిగో, మామగారు వచ్చుచున్నారు. పిల్లవాని నిటుతెండి! ఈవిషయమై మఱియొకప్పుడు ప్రసంగింతమని బాలు నెత్తుకొని లోనికరిగెను.

గోవిందరావు ప్రక్కగదిలోనున్న దీపమునుగొని యెదురుగాఁ బోయి తండ్రి నెదుర్కొని "రామస్వామివచ్చి కాగితములను బల్లపైఁ బెట్టి వెళ్లినాఁడని చెప్పెను.

పేరిశాస్త్రిగారు గదిలోనికి వెళ్లి తనదుస్తులను మార్చుకొని వచ్చి కుర్చీపైఁ గూర్చుండి "అబ్బాయీ! నీవిక్కడ నుండగనే పిల్లవాఁ డంతగా నేడ్చుచున్నాఁడేమి? అని యడిగెను.

గోవిందరావు "మీకోడలు దివ్యజ్ఞానసమాజమువారి సభకరిగి యిప్పుడే వచ్చినది. పిల్లవాఁ డాఁకఁటిచే నేడ్చుచున్నాఁడు. అన్నము దినిపించుటకు లోనికిఁ దీసుకొని వెళ్లినది" అని చెప్పెను.

పేరిశాస్త్రి "ఓహో! సభలు జరుగుచున్నవా! వారముపదిరోజు లిదియొక పెద్దసందడి, కానిమ్ము. హిందూ, వచ్చినదేమో తెమ్ము." అనెను. గోవిందరావు దీపమునుబెట్టి పత్రికదెచ్చి యిచ్చెను. పేరిశాస్త్రి గారు చదువుచుండెను. గోవిందరావు లోనికరిగెను.

పేరిశాస్త్రి హిందూపత్రికను జదువుచున్న స్వల్పకాలములోనే తొమ్మంటను కనకభూషణములు, శింజానములు సల్పుచుండఁ జేతనొక యుత్తరము పట్టుకొని యతనిభార్య మంగమ్మ ముసిముసి నగవుతో వచ్చి భర్తచెంత యొక కుర్చీపై గూర్చుండెను. పేరిశాస్త్రి చదువుచున్న పత్రికను బల్లపైనుంచి "ఏమి విశేషము" లని భార్య నడిగెను.

మం—(చిఱునవ్వుతో) మనము పెండ్లివారమైతిమి.

పే—అదెట్లు ?

మం—మీ మేనగోడలికిఁ బెండ్లి కుదిరినదఁట ? పంచమినాఁడు లగ్నమఁట! కొన్నిదినములు ముందుగానే రమ్మని వ్రాసినారు. అని యుత్తరమిచ్చెను.

పే—చదివికొని, నేను వచ్చుటకు వీలులేదు.

మం—మీరు రాకపోయిన నింక వెళ్లెడివా రెవ్వరు ?

పే—మీరు వెళ్లినఁ జాలదా ? నాకు సెలవులేదు. ఏమిచేయుదును.

మం—మన పెద్దబ్బాయికిని, సెలవు లేదఁట !

పే—నీవు వెళ్లుము.

మం—నేనొకతెను వెళ్లిన బాగుండదు.

పే—మాయమ్మకూడ వచ్చును.

మం—పెద్దది. ఆమె రాకుండ నెట్లు ?

పే—వాసును, రాజును గొనిపొమ్ము.

మం—వాసునకుఁ బరీక్షలఁట, రాఁడు. రాజును దీసికొని వెళ్లెదను.

పే—కమలనుగూడ దీసికొని వెళ్లుము.

మం—మే మందఱమును వెళ్లిన మనయింటిమాట యేమి ? మీకు భోజనాదిసౌకర్యములు కుదురునో, కుదరవో.

పే—ఎందుకుఁ గుదరవు. వాసు, పెద్దవాఁడుగూడ నుండురుగదా! వండుటకు వంటలక్క యుండనే యున్నది.

మం—సరియే. రేపు మెయిలుబండికే వెళ్లెదము.

పే—సరియే, మాతోఁబుట్టువునకు, బావకును దగిన బట్టలు గొని పొమ్ము. పెండ్లికూతురున కెట్టిబట్టలు గావలెనో తెప్పింపుము.

మం—మంచిది. అట్లే చేసెదను. కాని మనరాజుతోడి వారికిని, అంతకంటెఁ జిన్నవారికిని బెండ్లిండ్లవుచున్నవి. మనరాజున కెప్పుడగునో!

పే—నేను మాఅమ్మయి నెంతచెప్పినను వినక ఆనర్సు చదివి యుత్తీర్ణురాలగువఱకును పెండ్లి వలదన్నదానవు నీవేకాదా?

మం—అవునండీ! రాజు మిక్కిలి బుద్ధిమతి. చదువునందధికాసక్తి. పూర్తిచదువు చదివింపవలెనని పట్టుపట్టితిని. చదువీయేటితోఁ బూర్తి యైనది కాదా?

పే—ఈ మాఘాది పంచకములోఁ దప్పక చేయుదము. బాబు పరీక్ష గూడ నయినది. సంబంధము సిద్ధముగానేయున్నది కదా!

మం—ఏమో? ఏమిసిద్ధముగా నున్నదో కాని కార్యమగువఱకును నాకు నమ్మకములేదు. అంతకట్నము మనమిచ్చుకొనఁగలమా!

పే—ఎంత?

మం—మీచెల్లికిఁ బీకలేదు. ఆమె కెంతదాహమో చూడుఁడు.

పే—(నవ్వుచు) పీకగల మీయన్నగారు దగ్గింపఁ గూడదా?

మం—అమ్మయ్యో! ఆమె కెదురుచెప్పు వారెవ్వరు.

పే—వారి కోర్కియేమి?

మం—ఐదువేలు నగదుకట్న మీయవలెనఁట.

పే—మఱి.

మం—వరుఁ డింగ్లండువెళ్లి చదువుకొని వచ్చునఁట. దానికగు ధనమంతయు మనమియ్యవలెనఁట,

పే—మఱి యేమి ?

మం—వియ్యపురాలికిని, ఆడుపడుచులకును బదునైదువందలు లాంఛనములఁట.

పే—సరి-సరి.

మం—ఇంతటితో నైనదా ! బావింగ్లండులోఁ జదువునప్పుడు సైకిలుపైఁ బోవుట నీచమట. అందుచేనతనికి మోటారు సైకిలు గావలెనఁట ?

పే—కట్నములకు, లాంచనములకు ఏ మహారాజునో యప్పగింపవలెను. అంతియకాని మనమిచ్చుకోఁగలమా ! నాస్వార్జితము పిత్రార్జితముగూడఁ బూర్తిగా నమ్మివేసినతోఁ బదివేలయినను వచ్చునో రావో.

మం—అందుచేతనే మఱియొక సంబంధముకూడ, జూచుకొనియుంచుట మంచిదని నేఁజెప్పుచున్నాను.

పే—మాయమ్మకూడ నక్కడికి వచ్చును. కాన బావతోను మాచెల్లెలితోనుజెప్పి అయిదువేలకు మించకుండఁ జేయుండి.

మం—ప్రయత్నించెదము. ఈదినము పత్రికా విశేషములేమి ?

పే—ఏమున్నది. శారదాచట్టమును శాసనసభవా రంగీకరించినారు.

మం—అది ప్రజావాతకరమైనది. ఎవ్వ రంగీకరింపరు ?

పే—అట్లని చెప్పఁగలమా ? ప్రజావాతకరములైనవన్నియు వా రంగీకరించుచున్నారా ?

మం—తక్కినవాని మాట నాకుఁదెలియదు. కాని స్త్రీసంఘమునకు స్వాతంత్ర్యమొసంగు నీ చట్టము మంచిదనుటకు సందియములేదు. అందుచేతనే మహిళాసంఘమువారు శారదాగారుగారి కభినందనపత్రములు పంపినారు.

వే—మీ మహిళాసంఘమువారికి దూరాలోచనము చాలదు. ఆ శాసనము సంఘమునకు మంచిదో చెడ్డదో యని యాలోచించుట లేదు. స్థూలదృష్టియే కాని మీకు సూక్ష్మదృష్టి లేదు.

మం—శారదాశాసనము సంఘమునకుఁ జెడ్డదని మీ యభిప్రాయ మా యేమి ?

వే—(ఆలోచించుచు) ఒకవిధమున మంచిదైనను నది యొకవిధ మున హానికరము గూడ నగునని నా తలంపు.

మం—ఎట్లు ?

వే—పెండ్లివిషయమున నాడుపిల్లలకు స్వాతంత్ర్య మలవడీనదనీ మీ రూరక గెంతుచున్నారు. కాని యందువలన పెద్దనష్టమున్నది.

వే—మన దేశముగాని, సంఘముకాని యింకను సంస్కరణముల కభిముఖము కాలేదు. అట్టిసమయమునఁ బిల్లలకు వరాన్వేషణమున స్వాతంత్ర్యమిచ్చినచో వారు యితరకులజుని గోరికొనవచ్చును. లేక యితరదేశీయునిఁ గోరికొనవచ్చును. మనమేమి చేయఁగలము ?

మం—పోనిండు. దానియిష్టము వచ్చినట్లు నడవనిండు. మనకేమి ?

వే—అట్లనరాదు. ఒకపిల్ల, ఒక మహమ్మదీయుని గాని యైరోపీ యుని గాని పెండ్లియాడినదని యనుకొమ్ము. మనమా పిల్లను విడిచి పెట్టుకొనవలెనే కాని మనమందఱ మాపిల్లతో స్వమతసంప్రదాయ ములను విడిచి పరసంఘములోఁ జేరలేము. లేనప్పుడా పిల్ల జీవించినను మనకు లేనిదే కదా ? ఇంతకాలము పెంచిన పిల్లను వృథాగా వదలు కొనవలెను.

మం—పిల్లలట్లెందులకుఁ జేయుదురు ? అట్లు పెడదారిని బోవు చున్నప్పుడు, మనము చెప్పమా ! వారు వినరా ?

వే—మన యిష్టప్రకారమే వారు నడచినచో వారికి స్వాతంత్ర్య మేది ?

మం—మీరేదో యనుచున్నారు. కాని యట్లెప్పుడును జరుగదు.

పే—జరుగవని యనకుము. జరిగినవి. జరుగుచున్నవి. పద్మజాతి నాయకజాతి వారనఁగా నాభిజాత్యమున మిక్కిలి ప్రసిద్ధిగన్నవారు. అట్టి యభిజాతయగు పిల్ల యొకతురుష్కుని వరించినది. ఈ నడుమ బెజవాడలో నొక బ్రాహ్మణకన్యక మహమ్మదీయుని బెండ్లియాడినది. మఱియొక విప్రయువతి యొక నాయని వరించినది. వారికిస్వాతంత్ర్య మియ్యని యంతసేపే కాని పిమ్మట మనమేమి చేయఁగలము? ఈరీతిగా సంఘము సంకరమై నానాటికి నశించును.

మం—అట్లయిన బాల్యవివాహములే మంచివందురా యేమి?

పే—అట్లని నేఁ జెప్పను. కాని వివాహభారము తల్లిదండ్రుల యందే యుండవలెను గాని కన్యలయం దుండరాదు.

మం—వారికి స్వాతంత్ర్యము లేదన్నమాట!

పే—లేదని కాదు. ఆ బాలిక యభిప్రాయమును గూడ ముఖ్యముగా మనము కనుగొనవలయును. మఱియొకటి వినుము. లోకములోఁ దల్లిదండ్రులవంటి యాప్తులు వేఱొక రుండరు. తల్లిదండ్రులు సర్వదా తమపిల్లల శ్రేయస్సును గోరియే పనిచేయుచుందురు. వరుఁడన్నివిధములచే నుత్తముఁడు గావలయుననియే కోరుదురు. తల్లిదండ్రులకు నచ్చినవరుఁడు బాలికకుఁ గూడ నచ్చినచో నది సర్వముదావహము. సౌఖ్యకరము. ఒకవేళ బాలికకు నచ్చకపోయినను అనుభవజ్ఞాతలగు జననీజనకులకు నచ్చుటచే బాలిక గొన్నిదినములలోఁ దన తప్పును దెలిసికొని వర్తింపఁగలదు. లేక యప్పుడే తలిదండ్రులకుఁ దెలియని లోపములున్నచోఁ జెప్పి మఱియొక సంబంధమునకై ప్రయత్నింపవచ్చును. ఎట్లుచూచినను జననీజనకుల యభిప్రాయము తెలిసికొనకుండ బాలికలు వివాహమాడు స్వాతంత్ర్యము వహింపగూడదని నా తలంపు.

మం——మీా రెండుచే నట్లనుచున్నారో, కాని నా కది నచ్చలేదు, మొన్న మా మహిళాసభలోఁ గూడ నిది యేకగ్రీవముగా నంగీకరింపఁ బడినది.

పే——సరియే. ఇప్పుడు స్త్రీలది యధికారము. వారు చెప్పినట్లు చేయవలెనే కాని యదియేమి? ఇదియేమి? అని ప్రశ్నింపరాదు. పోనిమ్ము. నల్లేరుతో పాటు నారాయణ యని యందురు. కాని రాజుపెండ్లి స్థిరపఱుచుకొని రండు. ఇంతకు నేమి, రాజు బాబును బెండ్లాడుట కిష్టమున్నదో లేదో, ఎప్పుడైన నడిగితివా?

మం——అడుగలేదు. కాని బాబులో లోపమెక్కడ? చంద్రుని యందైనను మచ్చయున్నది కాని యతనియందు లోపములేదు. యుక్తవయస్కుఁడు. ధనసంపన్నుఁడు, విద్వాంసుఁడు. స్ఫురద్రూపి. వేవిధముల ప్రయత్నించినను రాజంతకంటె మంచివరుని వరింపఁ గలదా? ఏమి!

పే——అయినను నేదో మిషపెట్టి యామె యభిప్రాయము తెలిసికొనుట మంచిది. యీనాళ్లు వెళ్లువఱకు నుండక, వెంటనే వచ్చివేయుదు. మా అమ్మ కొన్నిదినము లుండఁదలచినచో నామెనుంచి మీారురండు.

మం——అట్లే చేసెదను.

పే——రాజుపెండ్లికి వచ్చెద ననుచున్నదియా!

మం——మొదట నది యంగీకరింపలేదు. కాని నేను మీా యమ్మగారు మిక్కిలి బోధింప నంగీకరించినది.

పే——(వాచిచూచి) ఎనిమిది గంటలయినది. వంటకాలేదా!

మం——కాకేమి! లెండి స్నానమునకురండి.

పేరిశాస్త్రిలేచి స్నానమునకు వెళ్లెను.

# 3

(ఏలూరు-నరసింగరావుగారి వంటయిల్లు)

నరసింగరావు తల్లి ముసలమ్మ పిల్లల కన్నము పెట్టుచు—ఓసీ! రాజూ! ఎంతచెప్పినను అన్నమునకు రావేమీ?

రాజ్యలక్ష్మి—దగ్గరగావచ్చి, ఏదీ! అమ్మమ్మా నాకు అన్న మెక్కడఁ బెట్టితివి.

ము—అదిగో, బావ వెండికంచములోఁ బెట్టితిని.

రా—ఆ యెంగిలికంచములో నేను దినను.

ము—బావ కంచములోఁ దినుట తప్పటే!

రా—అవును. తప్పే! బావనైనను సరియే, బ్రహ్మదేవునినైనను సరియె, ఆ యెంగిలికంచములోఁ దినను.

ము—(నవ్వుచు) వెఱ్ఱిదానా! మగనికంచములోఁ బెండ్లము తినదఁటే!

రా—బావనాకు మగఁడా యేమి?

నరసింగరావు భార్య యదివిని "కాదత్తా! బావకిదియే మగఁడు లాగున నున్నది." అని మందహాసము చేయుచు, "వదినెగారు మహిళా సంఘమున కధ్యక్షురాలఁట! కాదా? కూతురట్లు మాట్లాడవలదా?" అని పలికెను.

ఆమాటలు మంగమ్మవిని దగ్గరగావచ్చుచు వదినెగా రిప్పటినుండియు గోడలిమీదను! నామీదను గోపము చూపుచున్నా రనుచు వంట యింటిలోనికి వచ్చెను.

రా—లేదు వదినే! రాజు నన్నము దినుమన్నఁ దినక యమ్మమ్మ కేదో యసందర్భముగాఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నది.

మం—(సమీపించి కూతుతో) రాజూ! ఏమిటే?

రా—ఏమియు లేదమ్మా! ఎంగిలికంచములో దిననని చెప్పు చున్నాను.

మం—వదినే! దీనికి మొదటినుండియు నిట్టి పట్టుదలగలదు. ఒక విస్తరి వేయుము తల్లీ!

ము—'దగ్గరగావచ్చి,' ఏమే మంగా! బావ వెండికంచములోఁ బెట్టితిని. తిన్నచో నేమితప్పు? మగని కంచములోఁ బెండ్లము తినదా? యేమి.

మం—రాజూ! అమ్మమ్మ మాటవిను. నీవు బావకంచములో దిన్నచో దానికి సంతోషము. అయినను బావ పెఱవాఁడు కాఁడు.

ము—బావ మగఁడే కాఁడఁటే! పెఱవాడేమిటి.

రా—బావ నామగఁడఁట! విన్నావా, అమ్మా!

ము—కాక మఱేమి యనుకొనుచున్నావు? అంతయు నిశ్చితమై నది. బాబు పరీక్షాసమయము గనుకఁ బెండ్లి నిలువుచేసితిమి.

రా—పెండ్లియాడితి ననుకో! అతని యెంగిలి తినవలెనా యేమి?

ము—అవును. తప్పక.

రా—నేను—తినను.

ము—పూర్వమర్యాద నతిక్రమింతువా? నేను దినలేదా? మీాయ మ్మదినుచుండ లేదా? అంతకంటె నెక్కువదానవా యేమి?

రా—ఎక్కువదాననే. తెలివితక్కువ దద్దమ్మలు మీారు దినుట యందఱకును శాసనమా యేమి?

ము—ముందఱకువచ్చి "అమ్మా? మంగా! చూచితివా! దీని పెడసరపు మాటలు. నీవు, నీమగఁడు దీని కింతలేసి కొమ్ములిచ్చినారు. లేకపోయిన నిట్లుగా మాటాడునా! ఈపాటికిఁ బెండ్లిచేసినచో దీని మగఁడు పేపబెత్తెము చేతఁబట్టి నిలిచినచో కిక్కురుమనకుండఁ దినును. ఇట్టి వాండ్రకు మనకు లొంగుదురా?"

రా—అమ్మమ్మా! దెబ్బలకు భయపడి తినుటకిది మీకాలము కాదు. బతిమాలి తినిపించుకొను కాలమిది.

మం—రాజూ! పెద్దదానితో నీకు వాదమా? దాని యిష్టప్రకారము మనమందఱము వర్తింపవలెను.

రా—అమ్మమ్మా! నీమనుమనిఁ పెండ్లాడినచో నేనెంతయు మంచి దానను కాదా? అని నవ్వెను.

ముదుసలి—(కోపముతో) ఓసీ! లంజకానా? ఎంత మురియు చున్నావే! బావనిన్నుఁ బెండ్లాడనే యాడఁడు.

రా—నేనంతకంటె బావను బెండ్లాడను.

ము—ఓసీ! వెఱ్ఱిదానా! వాఁడిష్టపడలేనే లేదు. సంబంధము కలిసినదనియు, మంచిదనియు మేమందఱము పట్టుపట్టి మెడలు త్రిప్పు చున్నాము. బావ నీకంత చులకనా?

రా—బావనన్నుఁ బెండ్లాడ నిష్టపడలేదు. నేను బావను బెండ్లాడ నిష్టపడలేదు. ఇట్లుండ మా వివాహమెట్లు నిర్ణీతమైనది? అమ్మమ్మా!

ము—(కోపముతో) నీవంటిదాని కట్టివరుఁడు లభించుట మాటలా? నిజముగా లభించినచో నీవంశము వారందఱును తరింతురు.

రా—అమ్మమ్మా! నావంటి పిల్ల లభించినప్పు డతనివంశము వారెన్నితరములవారు తరింతురో!

మం—రాజూ! ఇంకను బ్రసంగమును మానవా? నీశ్రేయస్సును సర్వదా కోరుచున్నదగుటచే నట్లు చెప్పుచుండును. దానితోఁ బ్రతి ఘటించి మాటాడరాదు. అని పలికి రాజుతో వెడలిపోయెను.

"వేణూ, వేణూ, ఏమే? ఎంతచెప్పినను వినవే? స్నానముచేసి మడి గట్టుకొన్నాను. బియ్యము నిండుకొన్నవి. పొరుగువారి యింటికివెళ్లి తవ్వెడు బియ్యము బదులు తేవే? లేకపోయిన నెట్లు? నీ పుస్తకములు, నీ చదువు తప్ప నింటిపనియేమియుఁ జూడవ" ని నడిమిప్రాయపు వితంతువు తులసికి నీళ్లుపోయుచుఁ బిలిచెను.

అప్పుడు పదునెనిమిదేండ్ల ప్రాయముగల యొకయువతి చదువుకొనుచున్న పుస్తకమచటనిడి వాకిటిలోనికి వచ్చెను.

ఆయువతి సౌందర్యవతులలో మిన్నయని చెప్పుటకు సందియము లేదు. ఆమె యద్దకపు కద్దరుపరికిణీ కట్టుకొని బోడసరవుటంచులుగల కండువా వలెవాటు వేసికొనెను. సామాన్యముగా యువతు లలంకార ప్రియులు. అయినను నామె మెడలో మంగళసూత్రముతప్ప నితరాలంకారము లేవియునులేవు. అయినను బదాలువన్నె బంగారు శలాకవంటి దేహమును, జేరలమించి నిగనిగలాడుచున్న విశాలనేత్రములును పగడమువంటి యరుణాధరమును, జానువులవఱకును నల్లత్రాచుపామువలె వ్రేలాడు వాలుజడయు నామె యందమునకు వన్నెపెట్టుచుండెను. సహజ సౌందర్యవతికిఁ గృత్రిమ సౌందర్యమేల? అందును బాలికకు శోభావహములగు నలంకారములు లేకపోయినను సౌందర్య మేమాత్రమును లోపింపలేదు. ఆమెను జూచినవారికి "అనాఘ్రాతం పుష్పము" ను కాళిదాసుని శ్లోకము స్మృతిపథమునకు రాకమానదు.

పుష్పవేణి తల్లిని సమీపించి "ఏమమ్మా?" యని యడిగెను.

తల్లి—పొరుగింటివారి నడిగి బియ్యము బదులు తేవమ్మా?

పు—నేను, తేను,

త—అట్లందువేమే? నేను మడిగట్టికొన్నాను. మరల మయిల పడవలయును.

పు—బదులు నీవును, నేనును గూడఁ దేవలదు.

త—తిండిమాట యేమి?

పు—ఎంత యుండిన నంతే తిందము.

త—సోలెడు బియ్య మున్నవి. మన యిర్వురకు నెట్లు సరిపడును?

పు—గంజి చాలఁగ వార్పుము. ఉప్పు గల్పుకొని చెఱియింత ద్రాగుదము.

త—లోక మెఱుఁగనిదానవు గాన నీవట్లన్నావు కాని చాలియుఁ జాలని తిండి నీ కెట్లు పెట్టఁగలను తల్లీ! కన్న కూతునకు నగలు నాడె ములు చేయింపకపోయినఁ గడుపునిండ నన్నమయినను బెట్టవలదా?

పు—ఏమయినను సరియే. కాని బదులు తేవలదు. తీర్పలేని యప్పు చేయనేల?

ము—అదేమే? తవ్వెడు బియ్య మప్పు తీర్పలేమా?

పు—ఎట్లమ్మా! తీర్పనేలేము. ప్రతిదినము మన తిండికే చాల నప్పుడు బదులు తీర్చుట కెట్లు మిగుల్పఁగలమమ్మా!

ము—ధాన్యము రైతు నడిగితిని. రేపు తెచ్చి దంపించి తీర్చి వేయుదము.

పు—తల్లీ! నీవు పొరపడుచున్నావు. శిస్తులు మన కీయవలదని పెద్దనాన్న రైతునకు రిజిష్టరీనోటీసు పంపినాఁడఁట. రైతు మనకు ధాన్య మీయఁడు. ఉన్న నగలన్నియుఁ దాకట్టుపెట్టుకొని తినుటచే మెడలోని మంగళసూత్రము తప్ప మఱేమియు లేదు. అప్పెట్లు తీర్పఁ గలము? అప్పుచేసి యమృతమును ద్రావుటకంటె నింటిలోని గంజి త్రావుట మంచిదని పెద్దలు చెప్పుదురు. ఈ దినమున కేదో యయిన

దనుకొమ్ము. రేపటిమాట యేమి? అప్పుదెచ్చికొని యిల్లెంతకాలము తిని జీవింపఁగలము?

ఆ ముదుసలి కూతురు మాటలకుఁ బ్రత్యుత్తర మీయలేక యచ్చటనే కూలఁబడి యేడ్వ నారంభించెను.

ఈ కుటుంబమువారి చరిత్ర చదువరులకుఁ గొంచెము చెప్పవలసి యున్నది.

అనకాపల్లి కుత్తరముగా నాలుగుమైళ్ళ దూరమున శారదానదీతీరమందు రామవరమను నొక యగ్రహారము గలదు. అది విజయనగర సంస్థానమునకుఁ జెందినది. ఆ రాజకుటుంబములో విజయరామరాజు తన యాశ్రితుఁ డగు నొక విద్వాంసున కొక యగ్రహార మిచ్చి తన పేర రామవరమని పేరిడెను. ఆ విద్వాంసుని కుటుంబమునకుఁ జెందిన వారే యీ స్త్రీలు. అగ్రహారమును గొన్న పండితుని మూఁడవ తరమువాఁడు శంకరశాస్త్రి. అతఁడు బాగుగాఁ జదువుకొని సకల శాస్త్రపారంగతుఁ డయ్యెను. అతనికి మువ్వురుకొడుకులు. పెద్దవాఁడు సర్వావధాని వేదాధ్యయనముచేసి పండితుఁ డనిపించుకొనెను. రెండవ వాఁడు ముకుందరావు. ముకుందరావు కొంచె మింగ్లీషు చదివికొని బి. యన్. ఆర్ రైల్వేలో నొక యుద్యోగము సంపాదించుకొని యెక్కుడుగా ధన మార్జించెను. ఈ వితంతువు ముకుందరావు భార్య సుబ్బలక్ష్మి. పుష్పవేణి యీ దంపతుల కూతురు. ఆ బాలిక యొక్కతయే సంతాన మగుటచేఁ దండ్రియగు ముకుందరావునకును దల్లికిని నల్లారుముద్దుగాఁ బెరిగెను. పుష్పవేణి వివాహార్హప్రాయ యయ్యెను. పిల్లకుఁ దగిన సంబంధము చేయవలెనని తల్లిదండ్రులు పట్టుదలకలవారై యుండిరి. ముకుందరావునకుఁ బినతల్లి కూతురొకతె గలదు. ఆమె వారి కుటుంబములోఁ బెద్దదియగుటచేఁ బెద్దక్కయని

పిలుచుచుందురు. తల్లిదండ్రులు పెట్టిన పేరేమోకాని పెద్దక్కయనియే యందఱును బిలుతురు. ఆమె మిక్కిలి పొట్టిది యగుటయే కాక కురూపిణి. తగిన వరు లెవ్వరు నిష్టపడకపోవుటచే నామె యొక బీద వానికి భార్య కావలసి వచ్చినది. ఆమె కొక కుమారుఁడు గలిగెను. అతఁడు క్రమముగాఁ బెరిగి పెద్దయయ్యెను. నిర్ధనులగుటచే వానికిఁ దల్లిదండ్రులు చదువు చెప్పింపలేకపోయిరి. అతఁడు నిరక్షరకుక్షి యగుటయే కాక రూపమందువలెనే బుద్ధియందుఁ గూడ మిగుల వంకరమైనవాఁడు. కుత్సితగుణములందుఁ దల్లిని మించినవాఁడు. పెద్దక్క ముకుందరావు కూతును బుష్పవేణిని తన కొడుకునకుఁ బెండ్లి చేయ సంకల్పించుకొనెను. ఆమె ముకుందరావుగారి యింటనే నివసించి గ్రామములోని పలువురచేఁ జెప్పించియుఁ, జెప్పియుఁ, బలువిధములఁ బ్రయత్నము చేసియు సఫలమనోరథురాలు కాలేక తుదకు ముకుంద రావుతోను, సుబ్బలక్ష్మితోను గలహించి వెడలిపోయెను.

అనంతరము ముకుందరావు మగపెండ్లివారు కోరినకట్నమును, లాంఛనములను నిచ్చి విశాఖపురములో జడ్జిగారగు పేరిశాస్త్రిగారి రెండవకొడుకున కిచ్చి మహావైభవముతో వివాహము గావించెను. రూపమునందును, చదువునందును, బ్రాయమునందును సమానులగు వధూవరులనుగాంచి సంతసింపనివా రెక్కడను లేరు. కాని పెద్దక్క మాత్రము నలువురతోను కట్నములు కాని, లాంఛనములు కాని, యక్కఱలేకుండనే నాకొడుకున కియ్యక వృథా ధనవ్యయము గావించి రని నిందింపకపోలేదు. అంతియకాదు. తనకోర్కె విఫలముగావించి నందులకు ముకుందరావు కుటుంబమునం దెక్కుడు పగవహించి యుండెను. మఱియొక సంవత్సరములోనే కలరావలన గొడుకును, మగఁడును గాలధర్మమొందిరి. అట్లయ్యును బెద్దక్క పరితప్తురాలు

కాలేదు. ఆమె మనస్సు మెత్తదనమునకు రాలేదు. ఎండిన చవిటినేల వలె రానురాను నామె హృదయము గట్టివడి ముకుందరావు కుటుంబమునందుఁ దొంటిపగ సాధింపక విడువలేదు.

ఇట్లుండఁ గొంతకాలమునకు ముకుందరావు కాలధర్మమొందెను. అతఁడు రోగగ్రస్తుఁడై సెలవు పుచ్చుకొని యింటికివచ్చి రెండు నెలలయ్యెను. అతండు వచ్చునప్పుడు కొంతధనము తెచ్చి చచ్చిపోవుముందొక భూమి కొనెను. ఆభూమికిఁ దాను దెచ్చిన ధనము చాలకపోవుటచే భార్యనగలు విలువగలవి యమ్మవలసి వచ్చెను. ఈకారణమున నతఁడు మరణించుకాలమున కొక కాసైనను లేకపోవుటచే నతని యుత్తరక్రియలకై సుబ్బలక్ష్మి తననగలలో మఱికొన్ని విక్రయింపవలసి వచ్చెను.

సామాన్యుఁడయ్యు ముకుందరావు ధనసంపన్నుఁ డయ్యెనన్న దుఃఖము గ్రామస్థులకేకాక యతని యన్నయగు సర్వావధానికిని, దమ్ముఁడగు సోమప్పకునుగూడ లేకపోలేదు. సర్వావధాని పండితుఁడైనను పామరునికంటె నధమాధముఁడై పతివియోగదుఃఖాంబుధి మునిఁగియున్న మఱదలిని నామె కుమారిని బలువిధములగు బాధలను బెట్టనారంభించెను. పెక్కింటిభూములను ముకుందరావు తనస్వార్జితవిత్తముతోనే కొన్నను సర్వావధాని తమ్ముఁడు చనిపోయిన మఱునాఁడే, ఆభూములన్నియుఁ దమ పిత్రార్జితములనియు, దమ కుటుంబ మవిభక్తమనియు, మగసంతతి లేనిదగుటచేఁ దనతమ్ముని భార్య సుబ్బలక్ష్మికి భరణమునకు మాత్రమే హక్కు గలదనియు, నాయాభూముల సిస్తులు తమకిచ్చి క్రమమైన రసీదులను బుచ్చుకొనవలయుననియు, నట్లు కానిచో మరల ధనమును క్రమపద్ధతిని బుచ్చుకొందుమనియు రైతులకు రిజిస్టరునోటీసులు పంపెను. అందుచే సేపో,

మాంపో సిస్తులు తెచ్చి యిచ్చెదమని సుబ్బలక్ష్మిని నమ్మించిన రైతులు ధనమియ్య మానివేసిరి. పతి యుత్తరక్రియలకు ధనములేదు. అంతియ కాదు తన్ను జూడవచ్చిన నలువురు చుట్టములకుఁ దిండిపెట్టుటకైనను మార్గము కనఁబడలేదు. తన బావగారే తనకింతశత్రువై వర్తించుచున్నాఁ డని యెఱుఁగని యమాయికయగు సుబ్బలక్ష్మి యొకనాఁడు బావగారిని బిలిచి ధనవిషయమై రైతులుచేసిన మోసము నెఱిఁగించి సిస్తులు వసూలుచేసి యంతగాఁ బ్రదికిన తమ్ముని యుత్తరక్రియ లనుకూలముగా జరిపింపవలయుననియు, నీపది దినములు మీరును, మఱఁదిగారును కుటుంబములతోఁ దమయింటనే భుజింపవలయుననియు వచ్చిన బంధుగుల నాదరించి తమయింటికి కపకీర్తి రాకుండఁ జేయవలయుననియు గంటికిఁ గడివెడేడ్చుచు బతిమాలెను. కఠినహృదయుఁడగు సర్వావధాని మఱఁదలి దుఃఖమునకు జాలిపడక "పంటలు పోవుటచే రైతులు సిస్తు లీయఁజాలరనియు, నుత్తరక్రియలకు ధనమే ముఖ్యమనియు, బంగారు తాకట్టుపెట్టియో, యమ్మియో, ధనము తెచ్చినఁ గాని పని జరుగదనియు, బంగారమిమ్మనియుఁ గోరెను. సుబ్బలక్ష్మి చేయునది లేక కూఁతుచేత బంగారపు టొడ్డాణము తెప్పించి బావగారి కిప్పించెను. అతఁడు తన తమ్ముని సోమప్పను బిలిచి వస్తు వమ్ముకొని రమ్మని యనకాపల్లి పంపెను.

సోమప్ప యనకాపల్లి వెళ్లి యూసగను మూఁడువందల కమ్మి యొక వందరూపాయిలు తా నపహరించి యొక వందరూపాయిలతోఁ దండులాది సామగ్రికొని యొక నూఱురూపాయ లన్నగారి కిచ్చెను. సర్వావధాని యాసొమ్ములోఁ గొంత తా నపహరించి మిగిలినదానితో సంచయనాదికము చేయించెను. దశాహము వచ్చెను. నాఁడు ధనము కావలసియున్నది. సర్వావధాని మఱఁదలి దగ్గరకరిగి యతివైభవముతో నిన్నిదినములు గడచినవనియు, నూఱురూపాయలయిన నున్న

గాని దశాహము మొదలగునవి నెఱవేఱవనియు జెప్పెను. వెనుక యిచ్చిన వస్తువునుగూర్చి ప్రస్తావించిన బావగారికిఁ గోపమువచ్చు ననియు, వచ్చినచోఁ గార్యము చెడుననియు నాలోచించి బంగారు కంటె పదితులముల యెత్తుగలదని చెప్పి యిచ్చెను. ముండనాదికృత్యములు జరుగవలసి యుండుటచే దశాహము నిజముగా స్త్రీలపాలిటి యమదినము. సుబ్బలక్ష్మి దుఃఖితురాలై యున్నసమయమున సర్వావధాని భార్యవచ్చి యిఁక నొంట నగలుండరాదని చెప్పి తీసివైచి మూటగట్టి పుష్పవేణి చేతికిచ్చెను. పుష్పవేణి యానగలమూటను తన పెట్టెలోఁ బెట్టి తాళమువేసి దుఃఖితురాలయిన తన తల్లిచెంతఁ గూర్చుండెను. అది మొదలు సుబ్బలక్ష్మిగాని, కూతురుగాని నగల మూటను మరలఁ జూచుకొననే లేదు. పండ్రెండవదినము గూడ ముగిసెను. ముకుందరావు నుత్తరక్రియలు బాగుగానే జరిగినవని గ్రామములోని వారందఱును జెప్పుకొనసాగిరి. ఈమాట లొకటిరెండు సారులు సుబ్బలక్ష్మి చెవినిగూడఁ బడుటచే బావగారి సాయమే యందులకుఁ గారణమని బావగారి దయకు మిక్కిలి సంతసించెను. వచ్చిన చుట్టములందఱును వెడలిపోయిరి. వదినెగారిని జూడవచ్చిన పెద్దక్కగూడఁ దనయన్నగారి మృతికై తన దుఃఖమును వెల్లడించి యొకటి రెండు దినము లుండుమని సుబ్బలక్ష్మి యెంతపట్టుపట్టినను వినక వెడలిపోయెను. సుబ్బలక్ష్మి తోడికోడండ్రు, పిల్లలుగూడఁ దమతమ యిండ్లకరిగిరి. అందఱును వెడలిపోయిన పిమ్మట సుబ్బలక్ష్మి కూతును బిలిచి నగలమూట యేదని యడిగెను. పుష్పవేణి తన పెట్టెలోఁ బెట్టితినని చెప్పెను.

ఆ వస్తువులు చూచినఁ దన దుఃఖ మినుమడించునని సుబ్బలక్ష్మి వానిని దెమ్మనను లేదు. తనంత దాను తన పెట్టెలోఁ బెట్టి తాళము వేసియుండగ నగల కేమి భయమని పుష్పవేణి మరలఁ జూడనులేదు.

ఇంటిలోని సామగ్రి యంతయుఁ బదిదినములును జుట్టములు దిని పోవుటచే నాల్గయిదు కుంచముల బియ్యము మాత్రమే మిగిలినవి కాని మఱేమియు మిగులలేదు. తక్కిన వస్తుసామగ్రి కొనుటకుఁ జేత రొక్క ములేదు. అందుచే సుబ్బలక్ష్మి మఱియొక నగ నమ్మికొన్నఁగాని గడియదని కూతును బిలిచి నగలమూటను దెమ్మనెను. పుష్పవేణి పోయి యేడ్చుచు వచ్చి నగలమూట పెట్టెలో లేదని చెప్పెను. సుబ్బ లక్ష్మి దుఃఖమునకు మేరలేదు. ఆమె యెట్లో దుఃఖ మాచికొని తన కన్నెట నెక్కుడుగా నేడ్చుచున్న కూతు నోదార్చి నగల విషయమై మెల్ల మెల్లగా నడుగఁజొచ్చెను. పుష్పవేణి దొడ్డమ్మ తనచేతి కిచ్చిన మూటను దన పెట్టెలోఁ బెట్టితినని చెప్పెను. ఆ పెట్టెను పరిశీలింపగా మాఱుతాళములతో దీసినట్టుగాని బలాత్కారముగా దాళము ఎక్కగొట్టినట్టుగా గాని కనఁబడలేదు. అమాయికయగు తన కూతురు నిద్రించినప్పు డా తాళములు సంగ్రహించి యెవ్వరో యా నగ లపహ రించి యుందురని సుబ్బలక్ష్మి యనుకొనెను. పెట్టెలోని నగలు పోయి నట్లు తెలియఁగనే తోడికోడండ్రును బావయు మఱఁదియు గూడ వచ్చి పలువిధములఁ బ్రశ్నలు వేయఁ జొచ్చిరి కాని సుబ్బలక్ష్మి కాని కూతురుగాని యేమియుఁ బ్రత్యుత్తర మీయలేకపోయిరి. ఈవార్త గ్రామములో వ్యాపించినప్పుడు సుబ్బలక్ష్మి తోడికోడండ్రో వారి పిల్లలో యపహరించి యుందురని యనుకొనసాగిరి. అక్రమముగాఁ దమకు సంభవించిన జనాపవాదము తొలఁగించుకొనవలెనని సుబ్బ లక్ష్మి తోడికోడండ్రు మొదలగువా రందఱు ఒకచోఁ గూర్చుండి నగల విషయమై ప్రసంగింపసాగిరి. అప్పుడు సర్వావధాని కూతురు రత్నమ్మ పుష్పవేణిని జూచి "చెల్లీ! నీకు జ్ఞాపక మున్నదో లేదో కాని పదునొకండవనాఁడు నీవు పెరటిలో స్నానముచేసి నీ పెట్టెలోని చీర తెమ్మని తాళము నాచేతి కిచ్చితివి. అప్పుడు పెద్దక్క వచ్చి

అక్కడ మగవా రున్నారు. వారిని రాచికొనుచుఁ బోయి నీ పెట్టె తేఁగలవు. నేను బోయి తెచ్చెదనని నాచేతి తాళము పుచ్చుకొని చీర దెచ్చి యిచ్చినది కాదా!" అని యడిగెను.

పు—అవునని, బదులు చెప్పెను.

అది వినగానే "ఆముండయే యపహరించి యుండునని యొకరనిరి. అది నిజముగ దొంగముండ. ఇది దానిదెబ్బయే" యని మతొక రనిరి. "మా పెద్దబ్బాయి పెండ్లిలోఁ బెండ్లివారిపిల్ల మెడలోని నా నపహరించినది కాదా" యని పెద్ద దోడికోడలనెను.

"అవును. బెద్దక్క యట్టిదియె. మనలచ్చి పెండ్లిలో వెంకమ్మ నాగర మపహరించినది. నాలుగుదెబ్బలు తగులఁగానే యిచ్చివేసినది." అని చిన్నతోడి కోడలన్నది.

ఇరుగుపొరుగుఁవారు గూడఁ బెద్దక్కయే యపహరించియుండు నని నిశ్చయించిరి.

సుబ్బలక్ష్మి యదివిని "పోనిండమ్మా, పోయినదేదో పోయినది. ఏమో, ఎవ్వరెత్తుకొని పోయిరో, దైవమునకుఁ దెలియవలెను. సొమ్ము పోయినవాఁడు పాపమునఁ బోవునందురు. ఇట్టిదియే కదా? నామగని కంటె నీవస్తువులు నాకెక్కుడా" యని బదులుపలికెను.

"పెద్దక్క నాచేతితాళపుఁజెవి పుచ్చుకొనివెళ్లి నాపెట్టెలోనిచీర తెచ్చి నాకిచ్చినది. పిమ్మట నా పెట్టె నేను జూచుకొనలేద" ని పుష్ప వేణిచెప్పెను.

"నగల నపహరించినది పెద్దక్కయె. అది నిజముగా దొంగది. చాలచోట్ల దొంగిలించి తన్నులుగూడఁ దిన్నద" ని యచ్చటివారంద ఱును నిశ్చయించిరి.

సాయంకాల మగుటచే నందఱును దమ తమయిండ్ల కరిగిరి. ఇది జరిగిన మూఁడవనాఁటికిఁ బెద్దక్కవచ్చి సర్వావధానిగారి యింట బస చేసి ముకుందరావుగారి యింటికరిగి తనపై నిందమోపినందులకు సుబ్బలక్ష్మిని, బుచ్చివేణిని బలువిధముల దిట్టనారంభించెను.

"నీపై నిందమోపిన వారెవ్వరో కాని మాకుఁ దెలియదని సుబ్బలక్ష్మియు కూతురు నెంత బతిమాలికొన్నను వినక ప్రతిదినమదే ప్రకారము దిట్టనారంభించెను. పెద్దక్క తిట్లకు సుబ్బలక్ష్మి మొదలగువారే కాక యూరివారుకూడ మిక్కిలి యసహ్యించుకొనిరి. అప్పుడు సర్వావధాని పెద్దక్కను సమీపించి "దొంగముండ నీవిట్లుతిట్టుచో సహించువాఁడను కాను. నీనోట మాటవచ్చినచోఁ బండ్లూడగొట్టెదన" ని గట్టిగాఁ జెప్పుటచే నిఁకఁ బెద్దక్క యా యూరనుండలేక తనయూరు పోయెను. పోయినవస్తువులు దొరకలేదుకాని దీనివలన నిదివఱకే సుబ్బలక్ష్మిపై బగసాధించుకొనఁ దలచిన పెద్దక్క మఱింత కుపితురాలై వారికి హానిచేయుటకే యత్నింపసాగెను.

పతివియోగదుఃఖ మొకవంకను, నగలుపోయిన దుఃఖమొక వంకను బాధింపఁ గుటిలురాలగు పెద్దక్క యెట్టియిక్కట్టు కలిగించునో యని భయమునుగూడ సుబ్బలక్ష్మి పొందకపోలేదు.

ఇఁక వియ్యాలవారి సంగతి యోజింతము. ముకుందరావు చనిపోయినవార్త విన్నపుడు మంగమ్మయుఁ బేరిశాస్త్రియు, మిక్కిలి వగచిరి. కాని వారువచ్చి వియ్యపురాలిని బరామర్శింప నాచారము లేకపోవుటచేఁ బెద్దకుమారుని గోవిందరావును మాత్రము పంపిరి. అతఁడువచ్చినను సుబ్బలక్ష్మి కేమియు సహాయుఁడు కాలేదు. వేళపట్టున కాఫీ త్రావి వీధిలోనికరిగి లోకాభిరామాయణ మేదియో ప్రసంగించి భోజనసమయమునకు వచ్చుటయే కాని "ఇంట మగదిక్కు

లేదు. ఏమి కావలసివచ్చునో యన్న విచారమైన లేక వర్తింపసాగెను. అందుచే సుబ్బలక్ష్మికిఁ బెద్దవారితోఁ జుట్టఱికమున్నను నెట్టి లాభమును లేకపోయెను. తమజ్ఞాతులు తమ ధనమపహరించుచున్నట్లు తెలిసినను సుబ్బలక్ష్మి తుదకు వారిసాయమే యపేక్షింపవలసియుండుటచేఁ జేయునదిలేక యన్నియును సహించియుండెను.

ఇది యిట్లుండఁ బుష్పవేణి రెండేండ్లకు ముందే ఋతుమతియయ్యెను. ముకుందరావు పేరిశాస్త్రిగారికి శుభలేఖ పంపించెను. వారు పునస్సంధానమును జరిగించిరి. కాని తరువాత వచ్చి కోడలిని దీసికొని వెళ్లలేదు. వియ్యాలవారువచ్చి పిల్లనుదీసికొని వెళ్లినచో సారె యెక్కుడుగాఁ బెట్టవలెనని ముకుందరావు నిశ్చయించియుండెను. కాని వారూరకున్నప్పుడు తానేమి చేయఁగలఁడు? తనంతటఁ దాను గూఁతు నత్తవారి యింటికి దిగబెట్టలేఁడు కదా? ఇంతేకాక వియ్యపురాలు మంగమ్మ "తమ హోదాకుఁ దగిన సంబంధముకాద"ని యెవ్వరితోనో యన్నట్లు ముకుందరావు జెవినిబడెను. అందుచే నతఁడేమియు చేయఁజాలకపోయెను. ఇప్పుడతఁడు మరణించుటచేఁ బిల్లదాని నత్తింటికిఁ బంపుభారముకూడ సుబ్బలక్ష్మియే వహింపవలసివచ్చెను.

అక్కటా! ఎంతకష్టము! దోసిళ్లకొలఁది ధనము తెచ్చెడి మగఁడు మరణించెను, అదివఱకుఁ గొన్నభూములు గాని సిస్తులుగాని తనకు వశము కాకుండ బావగారు పనిచేయుచున్నారు. పతి యుత్తరక్రియలకుఁ గొన్ని నగలమ్ముకొనవలసి వచ్చెను. మిగిలిననగలు పెద్దక్కయుపహరించెను. చేతిలో నొక కాసైననులేదు. ఈడువచ్చిన కూఁతురు రెండేండ్లనుండియుఁ దమయింటనే యున్నది. తాను వార్త పంపినచో

వారు సమాధానమియ్యరు. వారువచ్చి పిల్లనుతీసికొని వెళ్ళిరు. పోనిమ్ము కూతురును దాను నుండి కాలము వెళ్లఁబుచ్చుదమన్నఁ దిన నన్నము లేదు. పతి యుత్తరక్రియలకుఁ దెచ్చిన బియ్యముండుటచే నట్టులో వండుకొని తిని కాలము గడుపుచుండిరి. ఇఁక బియ్యముకూడ లేవు. కుమారి చేతియుంగర మమ్మఁగాఁ బదిరూపాయిలు వచ్చినవి. అవి యన్నియుఁగూడ ఖర్చుపడఁగా నొక్కరూపాయి మిగిలినది. ఇంట సోలెడు బియ్యము మాత్రమున్నవి. సుబ్బలక్ష్మి యేడ్చుట తప్ప నిఁక నేమిచేయఁగలదు ?

పుష్పవేణి యేడ్చుచున్న తల్లి చెంతకువచ్చి తల్లీ! ఇదేమమ్మా! ఇట్లేడ్చెదవు? ఏడ్చుచున్న నిన్ను నేనోదార్చుదాననా? కష్టములు వచ్చినప్పుడు పరితపించుట పామరులపని. కష్టములు కాపురముండవు. మంచిదినములు రాఁగానే యీ కష్టములన్నియు మంచువిడిచియునట్లు విడిసిపోవును. ధైర్యము వహింపుము. నీవు దుఃఖమువిడిచిన నన్నత్తింటికిఁ బంపివేసినచోఁ గొంతభారము తగ్గును. తేపేమంచిదని పురోహితుఁడు చెప్పినాఁడు. ప్రయాణమెట్లయినను సాగింపుము తల్లీ!" అని పలికెను.

సుబ్బలక్ష్మి మొత్తుకొని యేడ్చుచు "అయ్యో! నిన్నుఁగూడ విడిచి నేనెట్లు బ్రదుకుదునే తల్లీ!" అని పలికెను.

పు—నీవట్లనఁదగదు. నేనెప్పుడైనను బరులయింటికిఁ బోవలసిన దానను. నా విషయమై యేడ్చిన లాభమేమి?

సు—వారువచ్చి తీసికొని వెళ్లనప్పుడు నేను దిగబెట్టినచో లోకులేమందురో తెలియునా?

పు—ఏమందురు?

సు—కన్నకూతునకుఁ దిండియైనను బెట్టలేక అత్తింటికిఁ బంపివేసినదందురు. ఇంతబ్రదుకు బ్రదికి యిట్టి యపవాదమెట్లు భరింతును తల్లీ!

పు—నీవనవసరముగా భయపడుచున్నావు. అవివేకులెవ్వరో యనుకొందురుగాక, దానితో మనకేమి? మన విహితకృత్యము మనమాచరింపవలెను. నేనిఁక నత్తింట నుండవలసిన దాననుగాని పుట్టింటఁ గాదు. అదినీకు దెలియని విషయముకాదు.

సు—వారువచ్చి పిలిచి తీసికొనివెళ్లనిదే నేను బంపినచో నాకుఁ జిన్నతనము కాదా?

పు—కాదు. అవతలివారి కుచితానుచిత జ్ఞానములేక పందలైనప్పుడు మనము చేయునదేమి? మన మంచితధర్మమును నెఱవేర్చి వారిచెంపపైఁగొట్టి బుద్ధి తెప్పింపవలెను.

సు—నీవు చిన్నప్పటినుండియుఁ బువ్వులలోఁ బెరిగిన సుకుమారివి. నీవారాకాసి యత్తగారి పోరుపడి పగులయింట నెట్లుబ్రదుకఁగలవుతల్లీ!

పు—అమ్మా! నీకన్నియు సందేహములే, నాయందు నీకపరిమిత ప్రేమ యుండుటచే నీకాసందియములు పొడముచున్నవి. నిజమాలోచింప నాకది పరులయిల్లుగాదు. నాయింటికి నేనరుగుచున్నాను. నాయింట నాకుఁగొన్ని లోపములు కలుగవచ్చును. కొన్ని కష్టములు తొడరవచ్చును. స్వగృహమునందట్టివి పాటించువారుండరు. అత్తగారుగాని యాడుపడుచులుగాని నన్నేమియు ననఁజాలరు? అన్నను వారికి ప్రత్యుత్తరమీయను. వారేమిచేయుదురు? "ఊరకొన్నవారి కూరెల్ల నోప" దని వినలేదా? అవియన్నియు సులభముగాఁ ద్రోసిపుచ్చెదను. ఆవిషయమై నీవెట్టిభయమును జెందకుము.

'ఎట్టి సాధ్వులకును బుట్టినయింట్లను, పెద్దకాలముండఁ దగ్గఁదగదు.'

అను నీ పండితోక్తిని మదిని దలంపవేమి! నన్ను త్వరితప్పక యత్తింటికిఁ బంపుము.

సు—అమ్మాయీ! నీవుచెప్పినది సత్యమే. కాని నీవు లోకవృత్తమెఱుఁగక యిట్లనుచున్నావు. అత్తింటి కష్టములెట్లు భరింపఁగలవమ్మా!

పు—నీవు పెద్దదానవే. కాని లోకజ్ఞానములేదు. ఇప్పటి కాలము నీచిన్నతనపు కాలమువలె నున్నదనుకొనుచున్నావు. ఇతరుల సమాచారము లెట్లున్నను నాయత్తవారిల్లు నాకు సౌఖ్యావహమగునుగాని వేఱుకాదు. ఏమందువా! నాయత్తగారు విద్వాంసురాలు. ఆడుపడుచులు బాగుగాఁ జదువుకొన్నవారు. ఇంతేకాదు. మాఅత్తగారు

స్త్రీ స్వాతంత్ర్యమునకుఁ బోరాడుచు మహిళాసంఘమున కధ్యక్షత వహించియున్నది. అట్టియామె. మూర్ఖురాలివలె చీలికయ్యములకుఁ దిగదు. నేనుగూడ మూర్ఖురాలను గానని నానమ్మకము. అత్తయుఁ గోడలును మూర్ఖురాండ్రయినచోఁ గయ్యములు తప్పవు. అంతియకాని నావిషయమై యట్టిబాధలు సంభవించునని తలంపకుము.

సు—మీయత్తగారి మాటకేమి? ఈ పెద్దక్కముండ యక్కడనే యున్నదఁట! నీకాపురమెట్లు స్థిరపడునో నాకుఁదెలియదు.

పు—మామేనత్త మాటయా చెప్పుచున్నావు.

సు—అవును. అది కుటిలురాలు. మనతో బద్ధద్వేషిణి. అది లేని పోనిమాటలుచెప్పి వారికి నీపయి కోపము దెప్పించునేమోయని నాభయము.

పు—ఆమె కుటిలత్వమునుబట్టి యట్లనుచున్నావు. కాని యామె కుటిలత యంతటను సాగదు. నీకెందుకు? నన్నత్తవారి యింటికిఁ బంపుము. నేను బరమసౌఖ్య మందుచున్నట్లు విని నీవు తప్పక సంతోషింతువు.

సు—సరియే. కాని మీనాన్నగారు మరణించిన పిమ్మట వారు వచ్చి నన్నుఁ బరామర్శింపలేదు. నిన్నుఁ దీసికొని వారి యింటికెట్లు రాఁగలను దల్లీ!

పు—పోనిమ్ము. వారియింటికి నీవు రావలదు. వారిగుమ్మములో నన్నువదలి నీవు పిన్నిగారి యింటికి వెళ్లుము. తక్కిన పనియంతయు నేను నవరించుకొందును.

సు—నిన్నంపుటకు సొమ్మెక్కడ?

పు—లేకేమి; ఒకరూపాయి యున్నదికాదా?

సు—అయ్యో! వెఱ్ఱితల్లీ! ఎంతయమాయికురాలవే! నీసారె యొకరూపాయితో నవునా? మీనాన్నగారు వేయిరూపాయిల విలువఁ

గల వస్తువులు సారెపెట్టి పంపఁదలఁచుకొన్నారు. అట్టియెడ నొక నూఱురూపాయిలయిన వలదా ?

పు—మామామగారు గర్భదరిద్రులాయేమి ? వారికి మనమేల యియ్యవలెను ?

సు—ఓసీ ! వెఱ్ఱిదానా ! వారికిలేదనియా మనము సారెతీసికొని వెళ్లుట ! మనగొప్పకోసము మనము సారెగొనిపోవుదుము.

పు—అంతేకదా ? విత్తముకొలఁది విభవము. విత్తమునుబట్టియె గొప్పతనము. మనయొద్దవిత్తమున్న నట్లేచేయుదుము. లేనియపుడేమి చేయఁగలము. సారెతీసికొని వెళ్లవలయునని నిర్బంధము లేదుకదా !

సు—నిర్బంధములేదుగాని తగినవిధమున సారెతీసికొని వెళ్లనిచో నల్వురు మొగమునఁ బేడనీళ్లు చల్లుదురు.

పు—నల్వురు—అనఁగాపైవాండ్రా ! లేకనాయత్తింటివారా !

సు—అందఱునుగూడ.

పు—పైవాండ్రమాటలను లక్ష్యముచేయవలదు. అత్తింటివారడిగినచో వారికి సమాధానమిచ్చుదానను నేను.

సు—సారెమాట కేమి ? కాని కర్చులకొకరూపాయి యెట్లుసరిపడును.

పు—చాలకేమి—పదునాల్గణాలు రైలుకర్చు. రెండణాలు మిగులును. అదికూలి.

సు—ఏమి, బాగుగా, సరిపుచ్చిచెప్పితివే ! అనకాపల్లిదాక బండి కావలెను ? స్టేషనునుండి నీయత్తింటికి బండికావలెను.

పు—చాలినంతధనమున్నప్పుడు నన్ను బంగారుపల్లకీలోఁగూర్చుండఁబెట్టి పంపుము. సమ్మతించెదను. లేనియపుడేమిచేయఁగలము ?

సు—అయ్యో ! తల్లీ ! సారెలేదు, చట్టుంబండలులేదు. దాని కేమిగాని నిన్ననకాపల్లిదాక నడపించి తీసుకొనివెళ్లనా !

పు—అదేమి ? తప్పా ?

సు—అవును.

పు—తల్లీ ! అదితప్పుకాదు. నీవునడవలేవా ?

సు—నాకోసమా ? చెప్పుచుంటిని.

పు—మఱినాకోసమా ! నాకునడుచుటయేసరదా ! దీనికోసమిత రులను యాచింపవలదు. కూలిదానికీమూటనెత్తి తెల్లవారుజామునసే లేచి బయలుదేరుదము. ఏడుగంటలు కాకుండఁగనే యనకాపల్లిచేరు దుము. పదిగంటలకు విశాఖపట్టణము.

సు—ఈపల్లెటూరిలో బండిలేకపోయినఁబోనిమ్ము. కాని పట్టణ ములో నడిపించి తీసికొనివెళ్లఁగలనా !

పు—తల్లీ ! ఆపట్టణములో నడిచిపోయిన మనలను జూచువా రెవ్వరు ? ఆయాసమందువా? లేదు. పట్టణపుస్టేషనునకు మాయత్తవారి యిల్లెంతోదూరములేదు. కూతునునడిపించి తీసికొనివెళ్లుచున్నదని లోకులు నిందింతురనుభయమునీకున్నచో నీవు నావెనుకనో, ముందో, కొంచెముదూరములో నడుచుచుండుము. నీకును నాకు నెట్టిసంబంధము లేదని లోకులు తలంతురు. నేనొక్కతెనే యత్తింటికిఁబోఁగలుగుదును. కాని తోడులేకుండ వెళ్ళుట హైందవస్త్రీల మర్యాదకాదు. అందుచే నిన్నింతగా నిర్బంధించుచున్నాను. చెన్నపురిలోఁ జదువుకొనుచున్న ప్పుడు నేనొంటరిగా నెన్నిపర్యాయములు ప్రయాణమొనర్చితిని. అంత కంటె నీప్రయాణముదూరమా ! లేక కష్టమా ! చెన్నపురిలో పరస్థ లమునకు వెళ్లవలెను. విశాఖపురిలో అత్తింటికి వెళ్లవలయును. ఇంకేది కష్టమో యోజింపుము.

సుబ్బలక్ష్మి మాఱుచెప్పలేక ప్రయాణమునకుఁ గావలసినవన్నియు మూటగట్టెను.

5

చెన్నపురినుండివచ్చెడి మెయిలుబండి యేలూరునకుదయమేడు గంటలకు వచ్చును. నరసింగరావు పేరిశాస్త్రిగారికుటుంబమును విశాఖపురికిఁ బంపనెంచి సకలప్రయత్నములును గావించెను. మంగమ్మయు, రాజ్యలక్ష్మియు, నామెకోడలు కమలాంబయు, గ్రొత్తచీరెలు కట్టుకొని వారిచ్చిన పసపుకుంకుమలు మూటగట్టికొని తమకై సిద్ధముగానున్న మోటారుబండిలోఁ గూర్చుండిరి. వారిసామానంతయు నెద్దుబండిలోని కెక్కించి యొక సేవకుని తోడిచ్చి "యత్తయ్యను బండియెక్కించి ర" మ్మని నరసింగరావు తనకొడుకును దామోదరరావును బంపెను. అతఁడు బండివానిని వేగముగా రమ్మనిచెప్పి మోటారుబండిలో డ్రైవరుప్రక్క గూర్చుండెను.

మోటారుబండి స్టేషనుకుఁజేరుటకు ముందే మెయిల్బండివచ్చి సిద్ధముగానుండెను. దామోదరరావు టిక్కట్లనుగొని తనయత్తచేతి కిచ్చి యాడువారు కూర్చుండుపెట్టెలోఁ గూర్చుండఁబెట్టెను. దామోదరరావట్లుచేసి యొక స్నేహితుఁడగుపడగా నతనితోఁ బ్రసంగించుచు ప్లాటుఫారముపై పచేరుచేయుచుండెను. సామానుబండి వచ్చినిలువబడెను. బండివాఁడు సామానుగొనిపొమ్మని దామోదరరావును బిల్చుచుండెను. నీరు త్రావఁబోయిన యింజనువచ్చి బండ్లవరుసకుఁ దగుల్పఁబడెను. బండిలోనుండి మంగమ్మగూడ నాత్రముతోఁ గేకలు వేయుచుండెను. అప్పుడు దామోదరరావు "కూలీ, కూలీ" యని బిగ్గరగా నఱవనారంభించెను. తానుపెద్దయుద్యోగి కుమారుండును పెద్ద చదువు చదువుచున్నతాను, కూలివానివలె సామానుమోయుట తనకుఁ జిన్నతనముగాదా! అందుచేఁ గూలీలకై నిరీక్షించియుండెను.

బండివాఁడు కొన్ని సామానులు తెచ్చి యవతలనుండి కేకవేయుచుండెను. అది యందుకొనువారులేరు.

ఆసమయమున నాయాఁడువారి తొట్రుపాటుచూచి బోడసరపు కద్దరుపంచెలు ధరించినయొక తరుణవయస్కుఁడు జాలిపడి గబగబపరు విడి బండివాఁడు తెచ్చిన సామానుదెచ్చి మెయిలుబండిలోని కందింప నారంభించెను. అదిచూచియు దామోదరుఁడట్లు నిలిచిపోయెనేకాని యతనికి సాయపడుటకుఁగూడ సమ్మతింపలేకపోయెను. కూలీలు మఱె వ్వరిదో సామాను మోయుచుండుటచె వాండ్రెవ్వరును రా వలనుపడ లేదు. ఆ తరుణవయస్కుఁడు సేతుబంధన కాలంబున హనుమంతునివలె మూటలను బెట్టెలను నొక్కమాఱుగా దేనారంభించెను. దామోద రుఁడు కూలియువచ్చునప్పటికిఁ బనియంతయుఁ బూర్తియయ్యెను.

రామారావు నుపకారబుద్ధిచూడఁగనే రాజ్యలక్ష్మి కతనియందొక యపూర్వభావ మంకురించెను. ఆమెతల్లితో "చూచితివా! అమ్మా! ఈ మహానుభావుఁడెవ్వఁడోకాని నేఁడుమనకీ సాయముచేయకున్న మన గతియేమగును. బావనునమ్ముకొన్నచో మనపని బాగుగానెఱవేఱు నని మాటిమాటికిఁబల్కుటయేగాక రామారావందించు సామానం తయు, తల్లికిఁగాని, వదినెకుఁగాని శ్రమయుక్కరలేకుండఁగా రాజ్య లక్ష్మియొక ర్తుకయె బండిలోఁజేర్ప నారంభించెను. దామోదరరావొక మూటయైనను బండిలోని కందింపలేదుగాని క్రొత్తవాఁడొకఁడు తన కాఁగలభార్యకు సామాను జేయిచేయితగులు నట్లందించునపుడు విప రీతిభావమతనికి జనింపకపోలేదు. ఇంజను కేకవేసినది. రాజ్యలక్ష్మి యాక్రొత్తవానితో "అయ్యా! రండు. బండికదలుచున్నది" అని పిలు చుచుఁదనప్రేమమయమైన చూపులతనిపై పఱపినపుడు నిజముగా దామోదరుని ప్రాణములెగిరిపోయి నట్లయ్యెను.

రామారావు దృఢహృదయుఁ డయ్యు నామె వాల్లభ్యములకుఁ గందళితహృదయుండు కాకపోలేదు. అతఁడామెతో "మీ దయకుఁ గృతజ్ఞుఁడను. ఇది యాడువారు కూర్చుండెడునది. నేనిందుఁ గూర్చుండ రాదు. దీనితరువాతి పెట్టెలో గూర్చుండెదన"ని బండి కదలుచుండగా మఱియొక పెట్టెలోఁ గూర్చుండెను. తమకు మహోపకారియగు రామారావు తమపెట్టెలోఁ గూర్చుండ నవకాశము లేమికి రాజ్యలక్ష్మి యెంతవిచారించెనో దామోదరరావంత సంతసించెను. ఆహా! ప్రేమ తత్త్వ మెంతవిపరీతముగాఁ బరిణమించును? దామోదరుఁ డత్తగారి యొద్ద సెలవుకొని వెళ్లుచుండగా మంగమ్మ! బాబూ! ఈ సెలవులలో మాయూరు తప్పక రావలెనని మఱిమఱి చెప్పెను. అతఁడొకమాఱు రాజ్యలక్ష్మి సౌందర్యమును నేత్రపుటముతోఁ బానముచేసి వెడలి పోయెను. బండి కదలెను.

బండి నడచునప్పుడు రాజ్యలక్ష్మి రామారావుచేసిన యుపకారము నభివర్ణించుచు నట్టివాఁడు తమపెట్టెలోఁ గూర్చుండి తమకృతజ్ఞతను గైకొనుట కయినను వలను పడమికి విచారింపఁదొడఁగెను.

మంగమ్మకూతురు మాటనందుకొని, "అవునే తల్లీ! నిజముగా నతఁడెవ్వఁడో మంచివాఁడు. అతనికిఁ గృతజ్ఞత చూపుటకయినను వీల యినది కాదు. అతఁడు దరువాతిస్టేషనులో మనకుఁ గనపడకుండునా!" అని పలికెను.

కమలాంబ—అత్తా! మీరు విచారింపఁబనిలేదు. అతఁడు మనకుఁ గనపడకుండ నుండఁగలఁడా? నిడదవోలులో బండి నిలువగానే యతఁడు వచ్చి మనలను బల్కరింపకపోఁడని నా నమ్మకము. ఏమందువు! రాజా!

రా—(కోపముతో) నన్నడిగెదవు? నాకేమి తెలియును?

కమ—నీకుఁ దెలియునని కాదు. అతనిస్వభావమును గనిపెట్టి యున్నావేమో యని.

మం—అతని స్వభావము కనిపెట్టి నట్టేయున్నది. అంత మంచి వాఁడు. అంత పరోపకారబుద్ధి గలవాఁడు వేఱొకఁడుండఁడు. ఒక మూటయా! రెండుమూటలా, బండెడు సామాను ననాయాసముగా నందించియున్నాఁడు.

క—బాబయినను సామానందింప లేకపోవునా? పెద్దచదువు చదువుచుండుటచే నీ కూలిపని చేయ సిగ్గుపడినాఁడు.

రా—తనపనులు తాను నెఱవేర్చుకొనుటకును సిగ్గుపడిన నెట్లు? ఈ దిక్కుమాలిన నాగరకత యందున్నలోపమే యిది.

మం—నాగరకత మాటకేమి? ఆ పెట్టెలు, మూటలు బావెత్తనే లేకపోవును.

రా—ఏమి యెత్తును. పురములలో ననారోగ్యవంతములగు ప్రదేశములందు నివసించుచు కాఫీయుపమలతోఁ గాలము పుచ్చును. చదువు పూర్తియగు నప్పటికి శరీరమున రక్తమాంసములిగిరి పోవును. రక్తబలము తగ్గగానే యేరోగములవాతనో పడుదురు. వయస్సున బావయు రామారావుగారును సమానులే యనుకొందును.

మం—సమానులే. రామారావేపరియగుటచేఁ గొంచెము పెద్దవలెఁ గనఁబడును. కాని బావకంటె దృఢకాయుఁడు.

కమ—(మందహాసము చేయుచు) ఓసీ! రాజూ! మీ యమ్మగారన్నది నిజముకాదా! అత్తా! రామారావువలె మనరాజుగూడ బలవంతురాలు. అతఁడందిచ్చు సామానంతయు ననాయాసముగా రాజో క్కర్తయే యందుకొనఁగలిగెను. అని రాజ్యలక్ష్మిని జూచి "రాజూ! మాకు విందెప్పుడు?

రా—ఎందుకు.

క—నీకుఁ బాణిగ్రహణ మైనందుకు.

మం—అయినప్పుడు నీకే కాదు. మీా సంఘమువారికందఱకును విందొనర్చును లెమ్ము.

కమ—నవ్వుచు! సామానందించు నప్పుడు రామారావునకును రాజునకును బాణిగ్రహణమైనది. అవునా? లేదా! రాజూ! నాకై చెప్పు నవ్వకుండఁ జూచిచెప్పుము.

రా—చాలు. చాలు. నీ పరిహాసములు చాలించు.

ఇంతలో బండి నిడదవోలు చేరినది. అంత రామారావు బండిదిగి వీరిచెంతకు వచ్చెను. అతనిని బల్కరింపఁ గుతూహలమున్నను రాజ్యలక్ష్మి వదినెగారి వేళాకోళములకు జంకి పెడమొగము పెట్టుకొని కూర్చుండెను. కాని యామెచూపులు మాత్రము సమయము లభించునపుడెల్ల నతని వదనపద్మమును బరామర్శింపకపోలేదు.

కమ—రామారావునుజూచి "బాబూ! ఇక్కడదిగెద రాయేమి?" అని ప్రశ్నించెను.

రా—లేదమ్మా! కాఫీత్రావుటకు దిగితిని. నేనును విశాఖపట్టణము వచ్చువాఁడనే.

క—బాబూ! మీా నివాసస్థల మెచ్చట?

మం—ఓసీ! కమలా! మాటలసందర్భమున నతఁడు కాఫీత్రాన కుండఁ జేసెదవు కాఁబోలును.

రాజ్యలక్ష్మికిఁ దమయొద్దనున్న కాఫీ తినుబండములు నతనికియ్యవలెనని యున్నది. పెద్దల యనుమతిలేకుండ నేమిచేయును? అట్టిటు చూచుచుండెను.

కమ—అత్తా! అతనికి త్రావ కాఫీలేదందురా! మనయొద్దనే యున్నది. (అని రాజ్యలక్ష్మితో) రాజూ! మనయొద్ద కాఫీయున్నది కాదాయని ప్రశ్నించెను.

రా—లేకేమి ? వదినె! కావలసినంత కాఫీయున్నది. తినుబండ ములు కూడ నున్నవి.

కమ—అట్లయిన నూరకుందువేల? మాటలతోఁ గృతజ్ఞతచూపుదు వందువు. అవి తెచ్చి రామారావుగారి కియ్యరాదా !

రా—ఆ మాటలకు రాజ్యలక్ష్మి వదనము త్రపాభరమున నెఱ్ఱవడి పోయెను.

మంగమ్మ—కమలా ? చిన్నపిల్ల దానికేమి తెలియును ? నీవు లేచి వెండిపళ్లెములోఁ గొన్ని తినుబండములుపెట్టి కప్పుతోఁ గాఫీయిమ్మి ? రాజూ ! బత్తాయి నారింజ పండ్లున్నవికాదూ ! అవికూడ పెట్టుము.

కమల, లేచి పళ్లెములోఁ బెట్టి రామారావున కందించెను. రాజ్య లక్ష్మి ముసిముసి నగవుతో రెండుపండ్లను దెచ్చి పళ్లెరములోనుంచెను. కమల కాఫీదెచ్చి యిచ్చెను.

రా—వలదమ్మా ! బండి కదలిపోవుచున్నది.

క—తొందరలేదు. ఇవన్నియు మీ పెట్టిలోనికిఁ గొనిపోయి నెమ్మ దిగా భుజింపుఁడు. తరువాత మాకీ కప్పుసాసరయు నిచ్చివేయవచ్చును. (అని రాజ్యలక్ష్మితో) రాజూ ! ఇవియన్నియు నాయనతీసికొని వెళ్ల లేరు. ఇదిగో మంచినీళ్ళు, కాఫీయుఁ గొనిపోయి వారిపెట్టెలోనికిఁ జేర్చి రమ్మి.

రా—అశ్రమ మీ కెందులకమ్మా ! బండి కదలిపోవును. అనిచెప్పి ముందుగాఁ గొన్ని తనపెట్టెలోఁ బెట్టుకొనివచ్చి రెండవమారు కాఫీయు మంచినీళ్లను గొనిపోయెను.

బండి కదలెను. రామారావు, తనపెట్టెలోఁ గూర్చుండి భక్షిం చుచు, "అహో ! ఇదేమి ? వింతగా నున్నది ! ఆపిల్ల యెవ్వరు ? ఆతక్కిన కాంతలెవ్వరు ? నన్నింతగా నాదరించుటకుఁ గారణము తెలి యదు. ఆబాలిక నన్నెందుల కిట్లు ప్రేమమయసముద్రములో ముంచి

తేలుచున్నది? ఆమె వాలకము చూడఁగా నన్ను మనసారఁ బ్రేమించిన ట్లున్నది. ప్రాయము చూడఁగాఁ బదునెన్మిదేండ్లకుఁ దక్కువ యుండవు. అంత ప్రాయముగల బాలి కవివాహిత్మయై యుండునా! వివాహితయైనచోఁ దాను నన్నట్లు చూచునా? వేషమును బట్టి చూడ వారు గొప్పయింటివారివలె నున్నారు. అట్టి వారికడ నీచత్వముండునా? ఆలోచింప నిప్పటికాలములో నంతవయస్సుగల కన్యకలుండుట గలదు. అగుఁగాక! నాకీ గొంతెమ్మకోరికలేల? నే నెక్కడ? వా రెక్కడ? ఉత్తమస్త్రీలు చనవుగా వర్తింతురు. అంత మాత్రమున నేను విపరీతభావసంకుచితుఁడనగుట తప్పు. కాని, చక్కదనము, బుద్ధి, వివేకము మొదలగు మంచిగుణములెన్నియో యామె యం దగపడుచున్నవి. ఇట్టి యువతి లోకమున నరుదు. "అఖండం పుణ్యానాం కమివసముపస్థాస్యతివిధిః" యను కాళిదాసు శ్లోకము స్మృతికి వచ్చుచున్నది. అందరానిపండ్ల కాసించి నామానసమింత యారాటపడ నేలొకో! ఆమెయొద్ద నేదయినను మంత్రశక్తియున్నదా! లేక నామానసము పేలవమయిపోయినదా! లేకపోయిన నన్నింతగా నాకర్షింపఁగలదా! ఒక పావుగంటయైనను నామెను జూడకుండ నామనస్సు నిలువలేక పోవుచున్నదే! నా యీయారాటమునకుఁ దగినట్లుగానే వారును నన్నమితముగా గౌరవించి బంధుప్రేమమును జూపుచున్నారు." అని యిట్లాలోచించుకొనసాగెను.

# ౭

రాజ్యలక్ష్మిహృదయ సముద్రమునఁగూడ భావతరంగములు ద్రేకించి పరస్పరసంఘట్టన మొనర్చుకొనకపోలేదు. రామారావు మొగ మును జూచుటకు నతనిమాటలు వినుటకును రాజ్యలక్ష్మిమనస్సు తహ తహపాటుచెందకపోలేదు. ఆమె "అయ్యో! అదేమి? నాడెందమున కింతయాందోళనము కల్గుట కేమిహేతువో! ఎవనినో క్రొత్తపురుషుని, ఊరేమో, పేరేమో తెలియని వానినిగాంచి నామనస్సింత లొంగి పోవుట చూడనాశ్చర్యము కల్గించుచున్నది. దైవఘటనమెట్లున్నదో, అట్లు జరుగకమానదు. మనయత్నమేల పనికివచ్చును? ఏమయినను అతని సుగుణములు నున్నను దనవంక కాకర్షించుకొన్నవి. తుద కేమ గునో" యని తలపోయుచుండెను.

రామారావు తమ పెట్టెకుదగ్గరగా గూర్చిండినట్లు రాజ్యలక్ష్మి యెఱుఁగును. అతఁడు పెట్టెలోనుండి తొంగిచూచినప్పుడతనిఁగన వచ్చునని తలంపున రాజ్యలక్ష్మియొక్కప్రక్కకరిగి బండిపోవువైపు చూచుచుఁగూర్చుండెను. కమల రాజ్యలక్ష్మి భావమును గనిపెట్టుచునే యుండెను.

మంగమ్మ—రాజ్యలక్ష్మితో "అమ్మాయీ! అటుచూడకుము. నలుసులు కంటిలోఁబడిన బాధపడెదవు. వలసినచో వెనుకవైపునకుఁ జూడుము. ప్రమాదముండద"నెను.

క—అత్తా! చూడఁదగిన వస్తువటుండగా నిటుచూచిన లాభ మేమి?

రాజ్య—(కోపముతో) నదినే! అసందర్భము లాడకుము. చాలిం పుము.

క—రాజూ! ఇందసందర్భ మేమున్నది?

రాజ్య—కాదా! చూడఁదగిన వస్తువేమిటి? నామొగము.

క—(నవ్వుచు) నీ మొగముకాదు. ప్రియుని మొగము.

రాజ్య—(కోపముతో) అట్లని నీతోఁ జెప్పితినా!

క—నీవు చెప్పలేదు. కాని నీభావమదియని పోల్చితిని. లేకపో యిన, ఇక్కడ నున్నదాన వక్కడికేల పోయితివి.? మీయమ్మ వల దనుచున్నను నెందులకట్లు చూచుచున్నావు?

మం—ఓసీ! కమలా! అదేమే వేళాకోళముచేసి దానినట్లు బాధిం చుచున్నావు. నిజముగా దానికి గోపమువచ్చినచో నిన్నును, నన్నును బీకి పాకము పట్టును.

క—ఈపరిహాసము రాజునకు సంతోషదాయకమనియే యట్లు చేయుచున్నాను.

రాజ్య—నాకు సంతోషదాయకమని నీతోఁ జెప్పితినా?

క—రాజా! అన్నియు నోటితోఁ జెప్పనక్కఱలేదు. చేష్టలనుబట్టి యూహింపవలసిన వెన్నియో కలవు.

బండి గోదావరి చేరినది. బండి యెంతోసేపు నిలువకపోవుటచే రామారావు దిగిరాలేదు. బండి రాజమహేంద్రవరము చేరినది. రాజ్య లక్ష్మి మంచినీళ్ళు తెచ్చెదనని తల్లితోఁజెప్పి మరచెంబు పట్టుకొని కొళాయిచెంతకరిగి నిలువఁబడెను. అచ్చట జనము మిక్కుటముగా నుండుటచే రాజ్యలక్ష్మికి నీళ్లు దొరకలేదు. అంత రామారావు రాజ్య లక్ష్మిని వెంబడించిపోయి "మీరెందులకు వచ్చినారండి! నేను మంచి నీళ్లు తెచ్చి యియ్యలేనా! మీవంటివారికిట నీళ్లు దొరకవు. చెంబు నాచేతికిచ్చి మీరు వెళ్లుఁడ" ని చెప్పెను.

చెంబతని చేతికిచ్చుట యామెకు సంతోషమే కాని వదినెచూచి నచో( బరిహాసించునని రైలువయిపు చూచెను. ఆమె తమవంకకే చూచుచున్నట్లగపడెను. "సరియే! మీరు నీళ్లు తెచ్చిపెట్టు(డని యత(డు చాచిన చేతికి( జెంబియ్యక నేలనుంచి బండిలోని కరిగెను.

కొంచెము సేపటిలో రామారావు మంచినీళ్లు దెచ్చి వారికిచ్చి తన పెట్టెలోని కరిగెను.

వెనుక వర్ణించిన రామవరమునకును, అసకాపల్లెకును నడుమ తుమ్మ పాలయను గ్రామము కలదు. అందు సంపన్నులగు రాజులేకాక శూద్రులుగూడఁ గొందఱుండుటచేతను, పుష్పఫలభరితములై శాఖోపశాఖలచేఁ గ్రిక్కిరిసియున్న మామిడితోటఁ లుండుటచేతను, శారదానదీ కుల్యాజలపూరసిక్తములగు భూములు గలదగుటచేతను, ధనసస్యాది సంభరితమై పల్లెయైనను ప్రఖ్యాతిని గాంచకపోలేదు. అయ్యూరిస్థల మహాత్మ్యమెట్టిదియో కాని యందుఁబుట్టిన నిఱుపేదలుగూడ మహావిద్వాంసులై, ధనసంపన్నులై దేశవిఖ్యాతిగాంచుట కలదు. అందులకు నిదర్శనము శర్మగారొక్కరు. అతఁడు బాల్యమునఁ బేదతనమనుభవించినను దుదకు విఖ్యాతపురుషుఁ డయ్యెను.

ఆగ్రామమందు శివావధానియను నొకపేదబ్రాహ్మణుఁడు గలఁడు అతఁడు స్వాధ్యాయమంతయుఁ జదువకపోయినను, కొంచెము స్మార్తముచదివి వైదికవృత్తియందు వర్తిల్లుటచే నవధానియను బిరుదమతనికి సులభముగా లభించెను. అతఁడు నామరూపములచేతనే కాక, సంపదలచేతను గూడ శివుఁడే.

పిత్ర్యములగు భూములు లేకపోవుటచే శివన్న స్వయముగాఁ గష్టపడి కొన్నివందలరూపాయిలు సంపాదించుకొని యదియంతయు శుల్కమిచ్చి యొక దరిద్రకన్యకను వివాహము చేసికొనెను. అతనికిఁ బైతృకమగు తాటాకులయిల్లు మాత్రముకలదు. శివావధాని నరసమ్మయను భార్యతో నాకుటీరమునఁ గాపురము చేయుచుండెను. అతనికి స్వల్పకాలములోనే ముగ్గురాడు పిల్లలును నొక కుమారుఁడును గల్గిరి. తనకీ

పిల్లలుపుట్టుటచేతను వారి పోషణాదికమునకు ధనము వెచ్చింపవలసి యుండుటచేతను దారిద్ర్యము మిక్కిలి హెచ్చినను నది చిరకాలముండ లేదు. పెద్దపిల్ల కాఱువత్సరముల ప్రాయము రాగానే పెత్తనమంతయుఁ దానే వహించి నరసమ్మ మగని కిష్టములేకపోయిన వేయిరూపాయిల శుల్కమును బుచ్చుకొని యొక మోటువానికిచ్చి పెండ్లిచేసెను. మగడు చేయుచున్న ముష్టివలన నాహారాదికము తీఱుచుండ నీధనము వలనఁ గావలసిన సామగ్రికొని తొంటికంటె సుఖముగానే యాదంపతులు పిల్లలతో జీవించుచుండిరి. మఱికొంత కాలములోనే రెండవపిల్ల గంగమ్మకును, మూఁడవకూతురగు సత్తెమ్మకును వివాహములుచేసి యింకను రెండువేల రూపాయల యాదాయమును పొందగల్గిరి కాని యీమాఱు వివాహములు తమయింటనే చేయవలసి వచ్చుటచే నెంత ఖర్చు తగ్గించినను రెండు మూఁడువందల రూప్యములు వ్యయమయ్యెను. ఎట్లయిననేమి, కూతుల వివాహములవలన రెండువేల యాఱువందల ధనము ఆబీదకుటుంబమునకు లభ్యమయ్యెను. అప్పుడు నరసమ్మ యందలి మూడువందల రూప్యములతోఁ గొన్ని నగలు చేయించుకొని తక్కిన రొక్క మాయూరనే యొక ధనసంపన్నునకు బదులిచ్చి దానివడ్డీ ధనముతో విద్యాభ్యాసార్హప్రాయుఁడగు కొడుకున కింగ్లీషు విద్య నేర్పింపఁజొచ్చిరి. వారి కుమారుఁడు రామారావు చిన్నవాఁడయినను బుద్ధిమంతుఁడగుటచేఁ బ్రతి తరగతియందును దానే మొదటివాఁడై ఉపాధ్యాయుల వాత్సల్యమును సంపాదించి ప్రవేశపరీక్షయందు తీర్ణుఁడయ్యెను.

పిమ్మట రామారావు విజయనగరమహారాజావారి కళాశాల యందుఁ బ్రవేశించి ప్రథమపరీక్షయందును, పట్టపరీక్షయందును బ్రథమ

పర్యాయముననే యుత్తీర్ణత గాంచెను. గ్రామస్థులు శివావధానితో రామారావు మిగుల బుద్ధిమంతుఁడనియు, యమ్మేకూడ చదివి జయ మును బొందినచోఁ గళాశాలలయం దుపన్యాసకపదవి కల్గుననియు, దానివలన నధికధనాదాయము లభించుననియుఁ జెప్పుటచే నతఁడు దనకుమారుని చెన్నపురియందు జదివింపఁ బంపెను. రామారావు చెన్నపురిలో మిగులఁ గష్టపడి చదివి కృతకృత్యుఁడయ్యెను. అది విని తల్లిదండ్రులు కుమారు డుద్యోగియై ధనము సంపాదించి తమ బీద తనమును బోఁద్రోలునని గంపెడాశతో నెదురుతెన్నులు చూచు చుండిరి. కాని యతఁడు మిగుల దేశాభిమానియై హిందూదేశమున వర్తిల్లుచున్న దౌర్జన్యములకు జాలిపడి కాంగ్రెస్సుతోఁ గలిసి దేశ సేవ చేయ నిశ్చయించుకొని చెన్నపురిలో నిలిచిపోయెను. కాని తల్లి దండ్రుల యాశదీర్చుట కతఁడు కృతనిశ్చయుఁడు కాలేదు.

అది యట్లుండ శివావధాని యల్లుం డిరువురు సంవత్సరములోపల మృతినొందుటచే కుమారికలు యుక్తవయస్కురాండ్రయినను అత్తిం టికిఁబోక తండ్రి నాశ్రయించి యుండిరి. అతని పెద్దకూతురు కాంతమ్మ కానలుగురు పిల్లలు. ఆమె మగం డస్వస్థుఁడై సందునఁ గష్టపడి సంపా దించి దారసుతాదులను బోషింపలేక పుట్టినింటికిఁ బంపుటచే శివావ ధాని కుటుంబము క్రమముగాఁ బెరిగెను. రామారావు చదువునకును, దనభార్య నగలకును, మధ్యమధ్య సంభవించిన కుటుంబవ్యయముల కును శుల్కద్రవ్యమంతయు నించుమించుగా వ్యయమగుటచే శివావ ధానిని దారిద్ర్యమెప్పటివలెనే బీడింపఁదొడఁగెను.

శివావధాని క్రమముగా ముదుసలి యగుటచేఁ దొంటివలె ధనము సంపాదించి కుటుంబమును బోషింప నశక్తుఁడై "నీవు చదువ వలసిన

చదువు పూర్తియైనది కాన శీఘ్రముగావచ్చి యెచ్చటనైనను నుద్యోగము సంపాదించుకొని కుటుంబపోషణభారము కొంతవహింపకపోయినచో నది మలమలమాడి నశింపవలసి వచ్చున”ని రామారావునకు వ్రాసెను. కాని దేశసేవాతత్పరుఁడైన యతనికి దేశప్రజల కష్టముల ముందు తండ్రి దీనాలాపములు వినఁబడలేదు.

అతఁ డాంధ్రపత్రికా ముఖమున “ఆంధ్రరాష్ట్రీయకాంగ్రెస్సుసభ” విశాఖపురమున జరుగునని చదివి యచ్చటికిఁ బోవుచు మార్గమధ్యమున వేరిశాస్త్రిగారి కుటుంబముతోఁ బరిచయముగలవాఁ డయ్యెను.

రాజమహేంద్రవరమునుండి మెయిలుబండి బయలుదేరెను.

కమ—రాజ్యలక్ష్మితో—రాజు మంచినీళ్లు నీవు తేలేదేమి?

మం—కమలా! నీకన్నియు సందియములే? కొళాయిదగ్గర చాలమంది యుండుటచే దీనికి దొరకవని రామారావుగారు తెచ్చినారు కాంబోలు? తప్పేమి?

క—దానికై నే ననలే దత్తా? రామారావును మన రాజ గౌరవించినది. కృతజ్ఞత చూపవలెఁ నన్న యామె యట్లు గావింప వచ్చునా?

రాజ్య—తెల తెలపోయి చూచుచుండెను!

మం—ఎట్లగౌరవించినది?

క—కాదటమ్మా? అతఁడు చెంబుకై చేయి చాపగా నిచ్చినది కాదు.

మం—ఇదేమి యగౌరవము? అతనికి నిజముగా నందించినచో బాగుగా నుండదని మానివేసినది. ఇంతేకాదు. అది నీకన్నులఁ బడినచో నేదో విధమున నెకసక్కెము లాడుదువు?

క—ఇప్పుడు మాత్రము మానుదునా! చేతులు చేతులు తగిలెడు విధమున రామారావు సామా నందించెను. మన రా జందుకొన్నది. దానికి లేని తప్పు దీనికా?

రాజ్య—త్రపాకోపభరముచే సంకుచిత యగుచుండెను.

మం—అది తొందరసమయము. అప్పు డట్లు చేయనిచో పని ముగియదు. ఇప్పు డట్టి తొందర లేదు. కాన యట్లు చేసినది.

ఇట్లు వీ రేదియో సంభాషించుకొనుచుండగా బండి చామర్లకోట చేరెను. నాఁడు వాల్తేరు పాసింజరు యుక్తసమయమునకు రాకపోవు

టచే మెయిలు మఱికొంచెము సేపచ్చట నిలుపవలసి వచ్చెను. రామారా వాడువారి పెట్టెచెంతకు వచ్చి నిలిచెను. రాజ్యలక్ష్మి యేదో సమయము కనిపెట్టి నఖశిఖపర్యంతమును నేత్రములు కల్పించుకొని రామారావును జూచుచుండెను. రామారావు బండి నానుకొని నిలువఁబడి కమలాంబతో "తల్లీ! నాకిట్లపరిమితాదరము చూపుచున్న మీ రెవ్వరో తెలిసికొనవచ్చునా" అని యడిగెను.

క—అయ్యా! అందు తప్పేమి? మాది విశాఖపట్టణము. అక్కడ సబ్జడ్జీగారు మా మామగారు. ఈయమ మా యత్తగారు. ఈ బాలిక నా యాఁడుపడుచు. జడ్జీగారి కడపటి కూతురు. ఆమె పేరు రాజ్యలక్ష్మి. ఆంధ్రాయూనివర్సిటీలో బి. ఏ. ఆనర్సు చదువుచున్నది. నేను వీరి యింటి కోడలను. ఏలూరులో మా చుట్టాలయింటఁ బెండ్లికిఁ బోయి తిరిగి విశాఖపురి కరుగుచున్నాము.

రామా—చాల సంతోష మమ్మా! అంత గొప్పయింటివారు కావుననే యింతటి మర్యాద గౌరవములు మీ కబ్బినవి.

రాజ్య—తమ వృత్తాంత మంతయు నతనికిఁ జెప్పిన కమలాంబ యతని వృత్తాంత మడుగనిచోఁ బెద్ద తప్పుచేసిన ట్లగునని తలంచుచుండెను.

క—అయ్యా! మా వృత్తాంతము చెప్పితిని. మా కిట్లు కారణముగా సాయపడుచున్న మీ యుదంతము చెప్పి సంతసింపఁజేయరా?

రాజ్య—అడుగవలసిన దడిగినది. (అని యొడ లంతయుఁ జెవులు కల్పించుకొని వినుచుండెను.)

రా—అమ్మా! మా కాపురము తుమపాల. అది అనకాపల్లికి సమీపమున నున్నది. నేను చెన్నపురిలో బి. యే. ఆనర్సు చదివి కృతార్థుఁడ నైతిని. ఇఁక నింటికి రానైయుండఁగాఁ బ్రభుత్వమూలముగా దేశమందు జరుగుచున్న దౌర్జన్యములకుఁ బరితపించి గాంధి

మహాత్ముని యాదేశమును దలఁదాల్చి కాంగ్రెస్సుతో జేరి పనిచేయు చున్నాను. రెండు దినములలో విశాఖపురి నాంధ్రరాష్ట్రీయ దేశీయ మహాసభ జరుగును. దానికై పోవుచున్నాను.

ఆ మాటలు వినుచున్న రాజ్యలక్ష్మి యానందమునకు మేరలేదు.

క—బాబూ! మీస్థితిగతు లేమి? మీతండ్రిగా రేమి చేయుదురు.

రాజ్యలక్ష్మి అత్యాతురతతో వినుచుండును.

రా—తల్లీ! ఇఁక నావిషయమై యడుగకుఁడు. మాయంతటి దరిద్రులు లోకమం దుండరు.

రాజ్య—దరిద్రులా! కానిమ్ము. సంపదలు స్థిరములు గావు.

రా—మా తండ్రిగారు పదిగ్రామముల కధికారి:

క—(నవ్వుచు) బాబూ! నా కర్థము కాలేదు.

రా—మరేమియు లేదు తల్లీ! ముష్టియెత్తి తెచ్చి కుటుంబ పోషణము చేయుదురు.

రాజ్య—అందు తప్పులేదు. బ్రాహ్మణునకు శిలావృత్తియు నుంఛ వృత్తియు విహితములు.

క—బాబూ! మీ జనకు లట్లు కష్టపడుచుండగా మీ రిట్లు దేశ సేవకై ప్రయత్నించుట న్యాయమా! కన్న తలిదండ్రులను గష్టపెట్టు టేటి ధర్మము?

రా—తల్లీ! మీ రన్నది సత్యమే. అదియు నాలోచించితిని. సకల మానవధర్మములలోను ముఖ్యమైనది దేశరక్షణము. సకలసౌఖ్యముల లోను స్వాతంత్ర్యము గొప్ప సౌఖ్యము. నా మన మెల్లప్పుడు వాని యం దాసక్తమై యుండును. అందుచే నిట్లు చేయవలసి వచ్చినది.

రాజ్య—(తనలో) హాయి, హాయి, ఏమి మాటలు. ఆ రెండు గుణములే చాలును. తక్కినవానితోఁ బనియేమి! దేశభక్తి, స్వాతం

త్ర్యము. ఇవి నిజముగాఁ గనకమయములు గదా! వానినిబట్టి యతఁడు లోకపూజ్యుఁడు.

క—ఇప్పుడు మీరు మీ గ్రామము వెళ్లెదరా!

రా—లేదమ్మా! ఈ సాయంకాలమునకు విశాఖపురము రావలె నని వ్రాసినారు.

క—అట్లయిన మీ బస యెక్కడ?

రా—రామచంద్రకవిగారి యింట.

క—సీతారామస్వామి కోవెలకు సమీపముననే కదా వారియిల్లు.

రా—"అవునమ్మా!" అని రామారావు వెడలిపోయెను. బండి కదలెను.

క—(రాజ్యలక్ష్మితో) రాజూ! వీరి బస మన యింటికి సమీపముననే.

రాజ్య—(కోపముతో) నిన్నెవ్వ రడుగుచున్నారు?

క—కావలసిన విషయమైన యొకరడుగుమనవలెనా!

రాజ్య—ఎవరికిఁ గావలయును?

క—నీకు—

రాజ్య—నాకుఁ గావలెనని నీతోఁ జెప్పితినా!

క—నీవును, మీయమ్మయు, మాటిమాటికిని రామారావునకుఁ గృతజ్ఞత చూపుటకైన నవకాశములేదని విచారించినారు. రామారావు గారి నివాసాదులు తెలిసినచో ఈదినము గాకపోయిన మఱియొకప్పు డైనను గృతజ్ఞత చూపవచ్చునుగదా! ఆ వృత్తాంతము మఱెవ్వరికిఁ గావలయును?

మెయిలుబండి మనోవేగముతోఁ బర్వెత్తుచుండుటచే నందఱును బ్రసంగమును జాలించిరి. కాని కమలాంబ మాత్రము రామారావు,

రాజు, రాజు, రామారావు. బి. యే. ఆనర్సు—బి. యే. ఆనర్సు, అని పలుకఁ జొచ్చెను.

మం—కమలా! ఏమిటి? అలాగునఁ బారాయణము చేయుచు న్నావు.

క—లేదండీ! అన్నియుఁ గుదిరినవి. రామారావు. రాజు—బి. యే, ఆనర్సు, బి. యే. ఆనర్సు.

మం—చాలులెమ్ము, ఆనర్సు చదివిన నేమాయె? ఆముష్టి సంబంధము చేసిన నెత్తిపై వెండ్రుక లుండనీయరు. లేకలేక నొక్క యాఁడు పిల్ల కల్గినది. ముద్దు ముచ్చటఁ దీఱకుండ నీపాడు సంబంధమున కంగీకరింపఁగలనా? ఇంతకు మీమామగారు బొత్తుగా నిష్టపడరు. కాంగ్రెస్సువారు దొరతనమువారికి ముఖ్యశత్రువులు. ప్రభుత్వము విశ్వాసమునకుఁ బాత్రులయి యింత పేరు సంపాదించుకొన్న వారికిది యెట్లిష్టమగును. కాంగ్రెస్సువారికి మంచినీళ్ళిచ్చినంత మాత్రముననె యుద్యోగములు పోఁగొట్టికొని కారాబద్ధులగుచుండఁ బిల్లను కాంగ్రెస్సువాని కిచ్చినచో మీమామగారి గతి యేమగున''ని పలికి యూరకుండెను.

పిమ్మట మఱి యెవ్వరును మాటాడలేదు. రాజ్యలక్ష్మి మాటాడక పోయినను జిత్తమున విపరీతభావంబు లుత్పన్నమై పరస్పర సంఘర్షణము చేయుచు నామె నస్వస్థనుగాఁ జేయకపోలేదు. ఆమె తనలో "అవురా! ఏమి విచిత్రఘటనము. ఈతఁడు నాదృష్టిపథమునఁ బడనేల? అతని యందు నాకింత యనురాగము జనింపనేల? ఈనాకోర్కి యెట్లు నెఱవేఱును? ముష్టి సంబంధమని తల్లి నిరసించుచున్నది. కలిమి లేము లస్థిరములని సమాధానపడినను కాంగ్రెస్సునకు విరోధియగు తండ్రిని సమ్మతింపఁజేయు టెట్లు? తల్లిదండ్రులను ధిక్కరించి వివాహము గావించుకొనఁగలనా! ఇట్టివి పశ్చిమఖండమునఁ గలవని చదివితిని. కాని

వారి సంప్రదాయములను బాటింపనా? అది మన దేశమునకు విరుద్ధము. తల్లి దండ్రులకే కాక దేశమునకుఁగూడ విరుద్ధముగఁ బ్రవర్తింపఁగలనా? పూర్వము సావిత్రి యెంతమంది వలదన్నను లెక్కింపక సత్యవంతుని వరించినది. మేటిసుఖము లనుభవించినది. అమితమగు కీర్తిగణించినది. స్త్రీలోకమున కాదర్శప్రాయమైనది. నేనామార్గమేల యవలంబింపరాదు. సావిత్రికిఁగల మనోద్రఢిమనాకు లేదందునా? ఎందుకు లేదు. సావిత్రికి మాత్రము పుట్టుకతో వచ్చినదా? ఇంతచదువు చదివి, స్త్రీ సంఘమునకు స్వాతంత్ర్య ముండితీఱవలెనని పట్టుపట్టి పని చేయునేను, నామనోస్వభావములకు విరుద్ధముగా నెట్లు ప్రవర్తింపఁగలను? తుదకేమగునో? దైవమునకే తెలియవలె" నని యోజనా పరంపరలో మునిఁగియుండెను.

ఇంతలో బండి వాత్తేరు చేరెను. రామారావు బండిదిగి మూట బట్టుకొని ఫ్లాటుఫారముపై నడయాడుచుండెను. జడ్జిగారి మోటారు డ్రైవరువచ్చి సామాను కూలీలచే మోయించుకొని పోవుచుండెను. రాజ్యలక్ష్మి డ్రైవరుతో "సామానున కొకబండి చేయింపుము. కారులో నింతసామానిముడదని" చెప్పెను. వాఁడట్లేచేసెను. మంగమ్మ, కమల, రాజ్యలక్ష్మియుఁ గారులోఁ గూర్చుండిరి. రామారా వెండలో నట్టేటు దిరుగుచుండుటచూచి రాజ్యలక్ష్మి తమ బండిలోఁ గూర్చుండ రామారావును బిలువ నందులకుఁ దనలోదాను నిందించుకొనక పోలేదు. ఈ సంఘటనమువలన ముందు ముందెట్టి చిక్కులు సంఘటిల్లునోయని. వగచుచున్న మంగమ్మ యిఁక రామారావు పేరెత్తఁ దలఁచుకొనలేదు. కమలాంబ రామారావును బిలిచి "బాబూ! మీరు మా బండిలోఁ గూర్చుండి రారాదా" అని పలికెను. రామారావు "తల్లీ? వలదమ్మా? ఇదిగో బస్సువచ్చుచున్నది. దానిపై వచ్చెద" నని పలికెను.

రామారావు తమతో రాకపోయినను బిలిచి గౌరవించిన కమల తన తల్లికంటె నెంతో యుచితజ్ఞురాలని రాజు మెచ్చుకొనక పోలేదు.

కమ—మీరు మాతో రాకపోయినఁ బోనిండు, కాని తరువాత నైనను మాయింటికి రండు బాబూ.

రా—అల్లే వచ్చెదనమ్మా!

క—మాయిల్లు మీబసకు దగ్గర. ఇంతే కాదు. పేరిశాస్త్రిగారి యిల్లన్న నందఱకుఁ దెలియును. తప్పక రావలయును.

రా—అల్లే వచ్చెదనమ్మా! ఆయిల్లు నే నెఱుగుదును. పేరిశాస్త్రి గారి మూఁడవకొడుకు వాసుదేవరావు నాస్నేహితుఁడు. అతనితోఁ గలిసి వచ్చెదనని వెడలిపోయెను.

రామారావు వెడలిపోయినను, గమలాంబచేసిన ప్రసంగమువలన రామారావు నివాసాదులు తెలియుటయే కాక, యతఁడు తమయింటికి రాఁదగిన మార్గముకూడ నున్నందుల కానందభరితయై వదినె మంచితనమునకు సంతసించుచుండెను.

స్వల్పకాలములో మోటారు పేరిశాస్త్రిగారి యిల్లు చేరెను.

పదిగంటలకు విశాఖపట్టణముస్టేషను జేరవలసిన ప్యాసింజరుబండి పదునొకండు గంటలకుఁ జేరినది. అది జ్యేష్ఠమాసము. మండు వేసవి. కర్తరీ దినములు. సూర్యుఁ డాకసపునడుమనుండి మిణుగురులు గురియించుచుండెను. బాటసారులు బండిదిగి సత్వరముగాఁ దమతమ బసల కరుగుచుండిరి. కొందఱు బండ్లపైఁ బోవుచుండిరి. ధనికులగు వారు తమకై వచ్చిన మోటారుబండ్లలోఁ బోవుచుండిరి. కొందఱు తమ మూటలను కూలీ నెత్తిపైఁబెట్టి యెండలో నడచి పోవుచుండిరి. మఱికొందఱు మూటలను దమభుజములపై నుంచుకొని పోవుచుండిరి. విశాఖపురీవార్ధి మంద మంద మలయమారుతములు ప్రసరించి కొఁగలించి బాటసారుల యాయాసమును దొలఁగించుచున్నను, సూర్యకిరణ సముదయ సంతప్తయగు భూమి మాత్రము ముట్టినంతనే చుఱ్ఱునఁ గాలి బాటసారులను బర్వులెత్తింపఁ జొచ్చెను.

ఆబండిలో నుండియే సుబ్బలక్ష్మియుఁ బుష్పవేణియు దిగిరి. ఇక్కడ నుండియైన బండిగట్టించుకొని పోకపోయినచోఁ దనకుఁ జిన్నతనమని యూహించి పుష్పవేణి వలదనుచున్నను మానక సుబ్బలక్ష్మి ప్రతి బండివానితోను బేరమాడుచుండెను. నాల్గణాలకుఁ దక్కువయైన బండి గట్టమని వారు చెప్పిరి. అచ్చటి బండివాండ్ర కొక నియమముండుటచే నందఱు నదేవిధముగాఁ జెప్పసాగిరి. సుబ్బలక్ష్మిచెంత రెం డణాలు మాత్ర మున్నవి. మఱి బండికట్టించుట యెట్లు? బాటసారులందఱు వెడలిపోవునందాక పాప మామె ప్రయత్నము చేయుచునే యుండెను. కాని కుదరలేదు. అందుచే నామె కూతురు చెప్పినట్లు చేయవలసి వచ్చినది. ఆమూట యొక కూలిదాని నెత్తిఁబెట్టి వారిరువురును నడువ సాగిరి. కాళ్ళు మలమల మాడి ఫొక్కులెక్కుచున్నను నత్యంతసహాన

శీలముగల పుష్పవేణి కిక్కురనకుండ నడుచుచుండెనుగాని సుబ్బలక్ష్మి సహింపలేక మాటిమాటికి నీడప్రదేశమును జేరుచుఁ, దన్నును, ఎండను, దైవమును జెడదిట్టుచునే యుండెను. బాటసారులు సుకుమారియగు పుష్పవేణి కష్టమునకు జాలిపడి పలుమాటలనుచుండ విని సుబ్బలక్ష్మి మిగుల ఖిన్నురాలు కాకపోలేదు. అయిన నేమిచేయఁగలదు? ఎట్లయిననేమి వీరు పేరిశాస్త్రి గృహమును జేరిరి. మొదట సుబ్బలక్ష్మి తన చెల్లెలగు రంగమ్మగారి యింటికి గూతుతోఁ బోయి సాయంకాలముననో, మఱునాఁడో పేరిశాస్త్రిగారి యింటికిఁ గూతును బంపనెంచెను. కాని తన చెల్లెలిగారి యిల్లు మిగుల దూరమున నుండుటచే నాయెండలో నంతవఱకు నడచిన కూతురెట్టి కష్టమును జెందునోయని యాప్రయత్నము విడిచిపుచ్చెను. తరువాత మంచిది కాకపోవుటచేఁ బుష్పవేణి యందుల కంగీకరింపలేదు. సుబ్బలక్ష్మి కూతును బేరిశాస్త్రిగారి యింటిలోని కరుగుమని చెప్పి తాను మరలవచ్చి కలిసికొందునని తన చెల్లెలిగారియింటి కరిగెను.

అప్పుడే చర్చిగంట గొట్టినది. పండ్రెండయినదని పుష్పవేణి తెలిసికొనెను. ఆ యింటివారిలోఁ గొందఱు భుజించి కచ్చేరీలకుఁ బోయిరి. మఱికొందఱు తమతమ గదులలో శయనించిరి. దాసదాసీజనములు గూడఁ దమతమ గృహములకుఁ బోయిరి. అందుచే నిల్లంతయు నిశ్శబ్దముగా నుండెను. పుష్పవేణి లోపలి కరిగి మూట నక్కడ వరాండాపైఁ బెట్టించి కూలి యిచ్చి కూలీని బంపించివేసెను. ఆమె నాలుగిండ్ల భవంతి దాటి లోని కరుగుచున్నను బలుకరించినవా రొక్కరును లేరు. ద్వారములు మాత్రము దీసియున్నవి. పుష్పవేణి మఱి నాలు గదుగులు నడచి పోగా లోపలినుండి హాసధ్వనులు వినవచ్చెను. అచ్చట నొక ద్వారమును జేరఁబడి లోని కరుగ నక్కడ నొక విశాలమగు చావడి గలదు. దానికిఁ జుట్టును చెట్లుండుటచేఁ జల్లని గాలి వీచుచుండెను.

అం దొకచో మంగమ్మ తమ్మలము వేసికొనుచు నచ్చటనే కూర్చుండి వత్తులు చేయుచున్న పెద్దక్క మాటలు వినుచుండెను. ఒకచో స్టవు వెలిగించి కమలాంబ మామగారికిఁ బూరీలు చేయుచుండెను. మఱి యొకచో నిరుగుపొరుగు లమ్మలక్కలు విస్తళ్లు కుట్టుకొనుచుండిరి. ఒకమూల రాజ్యలక్ష్మియు, నామె తమ్ముడు వాసుదేవరావును నూలు వడుకుచుండిరి. ఒక ముదుసలియవ్వ యప్పుడే భుజించి వచ్చి గోవింద నామములు పాడుచుండెను. అందఱు తలకొకవిధముగాఁ బ్రసంగించు కొనుటచే జావడి యంతయు ధ్వనులతో నిండియుండెను.

పుష్పవేణి గుమ్మము దాటి చావడిలోనికి వచ్చెను. ఆమెను జూచి వారు నివ్వెఱగందిరి. చాలకాలమై యామెను జూచుటచేతను, ఆమె త్వరలోఁ బెరిగిన దగుటచేతను, జాలమంది యామెను బోల్చుకొనలేక పోయిరి. ఆమె సామాన్య వస్త్రమును ధరించినను, నిరలంకారమై యున్నను, ఎండలో నడిచి వచ్చుటచే నాయాసఖిన్నమైనను, సౌందర్యమున కెట్టి కొఱంతయు లేక యౌవనముచే మిసమిస లాడుచున్న తదీయ దివ్యాకారము చూపఱకు గౌరవాశ్చర్యములు కలిగింపక పోలేదు. మంగమ్మ గూడఁ గోడలిని గుర్తింపలేక మహిళాసంఘాధ్యక్షురాలైన దన్ను జూచుట కెవ్వరో వచ్చియుందురని మెల్లగా లేచి యామెను సమీపించి యామె చేసిన నమస్కారములను గ్రహించి నిలువఁబడెను. ఇంతలో పెద్దక్క చేయుచున్న వత్తులచ్చటఁ బడవైచి మంగక్కా "మఱచితివి కాఁబోలు. ఇది నీ చిన్నకోడలు. మీకు శ్రమయెందులకని యదియే వచ్చినది" అని పుష్పవేణినిజూచి "ఓసీ! నీ వొక్కతవే వచ్చితివా! మీ యమ్మ కూడ వచ్చినదా" అని ప్రశ్నించెను.

పు—"అత్తా! మా యమ్మయు వచ్చినది."

పె—(నవ్వుచు) ఆవిడ వియ్యాలవారి యింటికి రాదా? ఏమి?

పు—రా కేమి? వచ్చును. మా నాన్నగారు చనిపోయి యాఱు నెలలు కాలేదు. ఆఱునెలలు దాటిననేగాని వియ్యాలవారిని జూడరా దటం గాదా?

పె—నీ యత్తమామలు వచ్చి నిన్నుఁ దీసికొని రా యత్నించుచున్నారు గదా? ఇంతలోందరపడియేలవచ్చితివి. నీవు మీయమ్మయు మా వంశమున కంతటికి నపకీర్తి తెచ్చుచున్నారు.

పు—ఇం దపకీర్తి యేమి కలదు? మా మామగారు న్యాయాధికారులు. మా యత్తగారు మహిళాసంఘాధ్యక్షత వహించి స్త్రీసంఘమునకు సౌఖ్యస్వాతంత్ర్యములు గల్గింపఁ జాటుచున్నారు. అట్టివారు న న్నింతకాలము మఱచిపోవుట నా దురదృష్టము. త్రికాలజ్ఞుఁడగు కణ్వమహర్షి యేమి చేసినాఁడు? దుష్యంతుఁడు మఱచిపోగా శకుంతలను భర్తచెంతకుఁ బంపలేదా? వారు చేయ్యవలసిన పనిని మఱచుటచే నేనే రావలసివచ్చినది. తప్పేమి?

పె—మంగక్కా! చూచితివా? నీకోడలు హైకోర్టు వకీలులాగు మాటాడుచున్నది. అది చెప్పిన సామ్యమును బట్టి నీవు కోడల నేలుకోక వదలివేసినను సరియే యను నర్థము తేలుచున్నది.

ఇంతలో రాజువచ్చి పుష్పవేణిని గౌఁగలించుకొని యింగ్లీషుతో నిరువురును సంభాషించుకొనిరి. అందుఁబెద్దక్క మాటలువిని యత్తమామలు తన్నన్యాయముగా వదలివేసిరనియు, బెద్దక్కతమయందు బద్ధవిరోధినియై యిట్లుచేయుచున్నదనియు, వేయిరూపాయిల విలువగల వస్తువులు తమయింట నపహరించికొనిపోయి తమ్మనేకబాధలు పెట్టుచున్నదన్న యభిప్రాయము సూచించుచుండెను.

మంగమ్మ రాజునువారించి నీమేనగోడలి సామ్యమును బాగుగా సమర్థించితివి. ఏదీ! మరలఁజెప్పుమనెను. పెద్దక్క మరలదొంటివలెఁ బల్కెను. - అదివిని మంగమ్మ బాగుబాగని మెచ్చుకొనుచుండఁగా

రాజ్యలక్ష్మి తల్లితో "పెద్దక్కయక్లెందులకుఁ జెప్పుచున్నదో తెలియునా! నీకోడలు నీయింటనుండిన నామెకేలాభములేదు. పుట్టినింట నున్నచో నేవేసినగలు మిగిలియున్నవి యపహరించుకొని పోవచ్చు" నని చెప్పుచున్న దనెను. పెద్దక్కయనినఁగిట్టని వారొక్క పెట్టుననగిరి. పెద్దక్క చిన్నపుచ్చుకొని చూచితివా! మంగక్కా! రాజు నన్నెట్లు వేళాకోళము చేయుచున్నదో" యనిపలికెను.

"రాజూ! నీవు చూచితివా! అట్లనుచున్నావు. అది తప్పుగాదా" అని మంగమ్మ వారించెను.

పు—రాజుచెప్పినది సత్యమేనండీ! మేనత్తను జూచి "అత్తా! మానాన్న పదొకొండవరోజుననేను జెరటిలోస్నానము చేయుచుఁ జీరతెమ్మని పెట్టితాళములు రత్నమ్మకీయగా నీవామెచేతినుండి తాళపుచెవి బలాత్కారముగా గొనిపోయి నగలపహరింపలేదా! నిజము చెప్పుము" అనెను.

ఆ మాటలువిని పెద్దక్కయింకను సంభాషించినచోఁ దనగుట్టు లన్నియుఁ బుష్పవేణి బయటఁ బెట్టుననియు, దానివలన మంగమ్మ తనయింటికి రాకుండఁ జేయునేమోయనియు భయపడి మెల్లమెల్లగా జాఱెను.

మంగమ్మ కోడలినేమియు నాదరింపకపోయినను గమలాంబవచ్చి "రమ్మా! చెల్లీ! రమ్ము. నాగదిలోఁగూర్చుందమని తీసికొనిపోయెను. రాజ్యలక్ష్మి వారిని వెంబడించినది.

వారువెడలినతరువాత మంగమ్మ మొదలగువారు కూర్చుండిరి. అప్పుడు పెద్దక్క మంగమ్మతో "నీకీదరిద్రసంబంధమెట్లు లభించినదే! వసంతరావు బాగుగాఁ జదువుకొన్నవాఁడు. జమీందారులు వేలకొలది కట్నములతోఁ దమపిల్లనిచ్చియుందురు. ఇంతకును మీహోదాకుఁ దగినసంబంధము కాద" ని పలికెను.

మం—అక్కా! నీవు చెప్పినది సత్యమే. కాని యిప్పుడేమిచేయఁ గలము? అయినను ముకుందరావుకూడ గట్నము బాగుగానిచ్చి పెండ్లి మహావైభవముతోఁ జేసినాఁడు. అతనికీపిల్లతప్ప మఱిసంతతిలేదు. ఆ యింటియాస్తి యంతయుఁగోడలికి రావలసినదేకదా! అయినను ఇప్పుడేమిచేయుటకుఁ దోచకున్నది.

పెద్ద—తోచుటకేమున్నది? విడాకుల చట్టమొకటి బయలుదేరి నదికదా! అది మీసంఘమువారుకూడ నంగీకరించియున్నారు. దీనికి విడాకులిచ్చిపొమ్మని వేఱొకపిల్లను పెండ్లిచేసినచో వలసినంత ధనము వచ్చును.

అక్కడవిస్తళ్లుగుట్టుచున్న పొరుగింటి యూవిడ "మంగక్కా! పెద్దక్కయాలోచనము చాలబాగుగానున్నది. నీమగని నుద్యోగము మానుకొమ్మనుము. నీముగ్గురుకొడుకులకుఁ బెండ్లిండ్లు చేసి కట్నములు పుచ్చుకొని వారికి విడాకులిచ్చి మరలమరల పెండిండ్లు చేసికొన్నచో వలసినంత ధనమువచ్చును. ఇదేమిటి? మంగా! ఇట్టిమాటలు చెవిని బెట్టుచున్నావు. భార్యాభర్తలకొకవేళఁ బరస్పరానుకూల్యము కుదరనిచో విడాకులుగాని కట్నములకోసము విడాకులా?" అనిపలికి పెద్దక్కను నిందించెను.

పెద్దక్క యదివిని యన్నమ్మా! నన్నెందులకు నిందించెదవు. ధన ముమాటకేమి? కోడలుదుష్కళంకయైనచో నేమిచేయవలయు"నని యడిగెను.

అన్న—వంశమునకు సాంకర్యము గలుగునని వదలివేసినవేయ వచ్చును. రాముఁడు సీతను విడిచినాడుకాదా?

పెద్ద—అట్టిదియే యిక్కడ సంభవించినది. పుష్పవేణి దుష్క ళంక యగుటచేతనే వదలవలసివచ్చుచున్నది. మఱియొక కన్యను వరుఁడు స్వీకరించును. ఇందుఁదప్పేమి?

అన్న—దుష్కళంకయోకాదో నిర్ణయింపకుండ వదలివేయ రాదు.

పెద్ద—ఆ విషయమైమీకు వలసినంత సాక్ష్యముకలదు.

అన్న—పుణ్యపాపములు దైవమునకుఁ దెలియవలెను.

పెద్ద—నాకంత నమ్మకముండుటచేతనే పవిత్రమగు బులుసువారి వంశమున నది ప్రవేశింపఁదగదని యొక జమీందారీసంబంధము తెచ్చితిని. పిల్ల బంగారుబొమ్మ, కట్నము ఇరువదివేలు. ఇట్టిలాభము మా మంగక్కకుఁ బోకుండఁ జేయనింత పాటుపడుచున్నాను.

తక్కినవారెవ్వరును మాటాడలేదు. మంగమ్మకుఁ బెద్దక్కబోధ వలన నాశకలిగినది. పుష్పవేణిని వదలివేసి యీ సంబంధము చేసికొనను వ్విళ్లూరుచున్నది. కారణములేకుండఁ బుష్పవేణిని వదలివేసినచో నామె భరణమునకు దావాతెచ్చుననియు నందువలన బాధలుకల్గుననియు నూహించి తమ మహిళాసంఘములో విడాకులచట్టమును దీర్మానించి తన కుమారునిచేఁ బుష్పవేణికి, నోటీసిప్పించినచో నీకనెట్టి బాధలును గలుగవని మంగమ్మయూహించి యందులకుఁ బ్రయత్నించుచుండెను. సంస్కర్తలు స్వార్థాభిలాషులై వర్తించినచో నెట్టి యధర్మము ప్రబలునో చూడుఁడీ. సాయంకాల మగుటచే నందఱును దమతమ పనులపై నరిగిరి.

సాయంకాల మయిదుగంటలయ్యెను. శేరిశాస్త్రిగారి రెండవకుమారుఁడు వసంతరావు టెన్నిస్సుబాటు పట్టుకొని క్లబ్బున కరుగుచుండెను. తనభార్య పుష్పవేణివచ్చినట్లు తెలిసియు దుష్కళంకదూషితురాలని తల్లి చెప్పిన మాటలచే రోసి కళత్రముఖపద్మమును జూడఁ గుతూహలమున్నను దానిని ద్రోసిపుచ్చి పురములోని కరుగుచుండెను. కమలాంబ యదిచూచి, వసంతమూ, వసంతమూ, అని పిలిచెను. అతఁ డామె గదిగుమ్మములోనికి వచ్చి "వదినే! ఏల పిల్చితివ"ని యడిగెను.

కమ—ఏమియును లేదు. స్త్రీస్వాతంత్ర్యమును గుఱించి యాంధ్రపత్రికకు నీ వెన్ని వ్యాసములు వ్రాసినావు!

వసం—నాలుగో, అయిదో! జ్ఞాపకములేదు.

కమ—స్త్రీస్వాతంత్ర్యమును గూర్చి మూర్ఖులుచెప్పిన పాఠమును మాత్రము వ్రాసితివి, అంతె కాని నీ వనాగరకతావిశిష్టుఁడవైనను, పాశ్చాత్యవిద్యాపరిపూర్ణుఁడవైనను, సకలవృత్తాంతకోవిదుఁడవైనను స్త్రీలకు స్వాతంత్ర్యమిచ్చి గౌరవింపవలెనని నీకు లేదు. నీ వన్నియుఁ జిలుకపలుకులవలె ననుకరణములు.

వసం—నీవు భ్రమపడుచున్నావు. చిలుకపలుకులుగావు.

కమ—కాకేమి! మీయమ్మగారు చెప్పినవి వ్రాసితివి.

వసం—అగుఁగాక నాకు మాత్రమది యిష్టముగాదనుకొన్నావా?

కమ—నవ్వుచు—అవునోయి. ఎట్లు కాదనుకొందును: రెండుసంవత్సరములకుఁ బూర్వము పునస్సంధానమైన భార్యను విడిచివేసితివి. పాపమది చచ్చినదో, బ్రదికియున్నదో యని యైనను గనుగొన్నావా? భార్య, తండ్రి మరణించుటచే బుట్టెడుదుఃఖములో మునిఁగియున్నను,

బరామర్శించుటకై నను పిలుచిక్కినది కాదు. ఇవి యన్నియు స్త్రీ స్వాతంత్ర్యాభిలాషకుఁ జిహ్నములే కాఁబోలును.

వసం—అందులకు నేనేమిచేయుదును? అది దుష్కళంకదూషితు రాలు. దానిని మన పవిత్రకుటుంబమునఁ జేర్పరాదని మా యమ్మ చెప్పుచున్నది. మాతండ్రిగారూర కున్నారు. అట్లుండ నా భార్యను నే నెట్లు తీసికొనిరాఁగలను? రోగగ్రస్తుఁడను కాకపోయినచో మా మామగారు చనిపోయినప్పుడు నేనే వెళ్లియుందును.

కమ—తల్లిగారు చెప్పినారని ధర్మవిధిని బరిణయమైన రూపవతిని, విద్యావతిని, భార్యనువిడిచి త్యక్తధర్ముఁడవగుట నీ వంటి విద్వాంసు నకుఁ దగునా?

వసం—మాతృవచనోల్లంఘనమే ధర్మమందువా?

కమ—మీతల్లి నీకును నాకును బూజ్యురాలే కాని ధనాశాపీడితు రాలై ధర్మ మతిక్రమించుచున్నది. అట్టివారి మాటను బాటింప రాదు.

వసం—మా యమ్మకు ధనాశయేమిటి?

కమ—ఓహో! నీ కింకను జెప్పనేలేదా? పెద్దక్క నీ భార్యకు బుష్పవేణికి విడాకులిచ్చి యొక జమీందారుని కూతును వసంతరావు నకుఁ బెండ్లిచేసినచో నిరువదివేలు కట్నమువచ్చునని మీతల్లితోఁ జెప్పఁగా నామె యందుల కాసపడి, సుగుణవతియగు పుష్పవేణిని విడిచిపెట్ట నీకు బోధించుచున్నది.

వసం—అది దుష్కళంకదూషితురాలని చెప్పినది.

కమ—అట్లనినఁగాని నీవామెనువిడువవని, అంతేకాని పుష్పవేణిని జూచినవారెవ్వరైన నట్లనఁగలరా! ఉత్తమగుణములను బట్టియు, రూపమునుబట్టియు నది నిజముగా నొక మహారాజునకు భార్య

గావలసినది. అట్టిది నీ యదృష్టముకొలదిని లభింపగా నీ వనుభవింపలేక "సిరిరా మోకాలొడ్డువారు గలరా" యను సామెతనుసార్థకముగావించి తివి. ఇదిగాక యామె చరిత్రయందనుమానముదయించినచోఁ బరీక్షింపుము. అంతేకాక పెద్దక్క చెప్పినమాటలు విని నీవును మీ యమ్మయు నట్లు చేయఁదగునా? హిందూసంప్రదాయములకు వెఱచి యా సాధ్వి నిన్నే నమ్మికొనియున్నది. కానిచో నీకీపాటికి విడాకు లిచ్చి వేఱొక యుత్తమ భర్తను వరింపకపోవునా! ఇదిగో నీ మాఱు సభలో ఆ చట్టమునుగూడఁ దీర్మానించి మీ మగవాండ్రకుబుద్ధివచ్చు నట్లు చేయకపోయిన నేను గమాలాంబనుగాను. ఆహా! ఇంత ఘోరమా! ఇంతన్యాయమా? పుస్తిముడివేసి సంప్రదాయానుకూలముగా వర్తించు నుత్తమసాధ్వుల నిక్కట్లపెట్టించిన పురుషులకు జన్మజన్మములకైనను దిండి పుట్టునా? గౌరవమబ్బునా? కలకంఠకంఠి కన్నీరొలికిన సిరియుండదను మాట యెఱుఁగవా! మాటిమాటికి బులుసువారము బులుసువార మని చెప్పుదురు. అట్టివారి కుండవలసిన బుద్ధులివియా!

వసం—చెప్పవలసినదేదో వేగచెప్పుమా! కొన్నిస్సునకు వేళ యగుచున్నది.

కమ—మెల్లగా నతని సమీపించి, పరాకుగానున్న యతనిచేతిలోని బొటు లాగుకొని వసంతరావూ! ఈ దినము బంతియాడకపోయిన నష్టములేదు. నాయుపదేశము వినిపొమ్ము. ఇదిగో నీకుర్చీపై కూర్చుం డుము. ఇప్పుడే వచ్చెదనని యతనిని లోనికి రానిచ్చి తాను వెలుప లికిఁ దప్పుకొని బయటను దాళమువేసి మాఱుదారిని లోనికరిగెను. వసంతరావు చేయునది లేక కుర్చీలోఁ గూరుచుండెను.

మఱిరెండు నిమిషములలో నానాలంకారశుభ్రవస్త్రపరిశోభితయగు పుష్పవేణి దేవలోకమునుండి భూమి కవతరించిన దేవకాంతవలె గది లోనికి వచ్చెను. ఆమె వచ్చియు రాకమునుపే యాద్వారము బంధింపఁ

బడుటయు విద్యుచ్ఛక్తిదీపములు వెలిగింపఁబడుటయు జరిగినవి. వసంత రావామె రూపమునఁజూచి దిగ్భ్రమచెందిపోయెను. పుష్పవేణి నిజ ముగా నధికసౌందర్యవతి. నూతనయౌవనవిలాసము లామె సౌందర్య మునకు వన్నెపెట్టి తదీయకాంతులను విద్యుద్దీపములకాంతి సంతతు లలో మిళితము గావించుచుండెను. ఆమె సురూపాకృతిచెంత నిలువఁ బడుటకైనను దనకర్హతలేనట్లు వసంతరావు భావించెను. ఆసనముపైఁ గూర్చుండుటకుఁ గూడ నతనికిఁ గష్టమనిపించెను. అనుకొనకుండఁగనే యతఁడు లేవఁబోవుచుండఁ బుష్పవేణి సమీపించి యాసనాసీనునిఁజేసి తాను నేల చతికిలఁబడి యతని రెండుపాదములను స్పృశింపసాగెను.

అంత వసంతరావు కొంచెము ధైర్యము చిక్కఁబట్టి యామె చేతులు పట్టుకొని "వేణూ! నీవా! యెప్పుడు వచ్చితివి" అని యడిగెను.

పు—నాథా! నేను గాకపోయిన మఱెవ్వరు తమచెంతకు రాఁ గలుగుదురు.

వ—ఎప్పుడు వచ్చితివి?

పు—ఈదినమున మధ్యాహ్నముననే వచ్చితిని.

వ—మాతల్లి యేమన్నది?

పు—మీతల్లిగారు కోడలికిఁ జూపవలసిన గౌరవము చూపలేదు. మీదుమిక్కిలి పెద్దక్కమాటలు విని నన్నుఁ బొమ్మనుటకు సిద్ధపడి యున్నారు. మీకు మఱొక్క కన్యనుదెచ్చి వివాహము చేయుదురఁట!

వ—చూచితివా! మాయమ్మ యింటికి బెద్దది. గౌరవార్హురాలు. ఆమె మాటను ద్రోసిపుచ్చుట కష్టము.

పు—"నాథా! కావచ్చును. మీరన్నదానిలో నసత్యములేదు. కాని పెద్దచదువు చదివిన మీవంటివారు వివాహితలైన హిందూస్త్రీలు భర్తలచే నాదరింపఁ బడకపోయినచో స్వరూపనాశన మందవలసినదే కాని గత్యంతరములేదని తెలిసిన మీవంటివారిట్టి క్రూరకర్మమున

కంగీకరించినచో నిఁక ధర్మమనునది లోకమునఁ గలదా? మీరు చిన్నపిల్లలు గారు. విద్వాంసులు. మీరు ధర్మాతిక్రమణ మాచరింపఁ దగదు. నన్ను యావజ్జీవమును బరిపాలించుటకు, మహామహులచెంత పండితజనముల సన్నిధిని, అగ్నిహోత్రుని(బ్రోల ప్రమాణము చేసినారు. అట్టిదానికి మీరు బాధ్యులుగాని మీతలిదండ్రులు గారు. ఏతత్ప్రమాణభంగజనితపాపము మీదికాని మీజననీజనకులది కాదు. ఇట్టియెడల మీరిటికర్తవ్యతామూఢులై వర్తించినచో నిఁక నేమి చెప్పఁగలను. అదినాభాగ్యలోపముగాని మీలోపముగాదు. మా యక్క కమలాంబ చెప్పినట్లు ఐహికసౌఖ్యాభిలాషయే మాకున్నచో, మీవంటివారు మమ్మును వదలివేసినచో మేము, పురుషాంతర పరిగ్రహణము గావించుట తప్ప నితరమార్గము లేదు. మీరధర్మ మాచరించి మమ్మధర్మ మార్గమునకుఁ దింపుచున్నారు. ఈరెండు పాపములును మీకే చెందును. మఱియొకటి యోజింపుఁడు. మీ తల్లిగారు మీయింటికిఁ బెద్దదన్నారు. సత్యమే. ధర్మ మన్నింటి కంటెను బెద్దది. ధర్మాతిక్రమణము చేయుట పరమపాపమన్నారు. నిజముగాఁ బుణ్యపాపములే యుండి వానిని బరలోకములో విమర్శించుటయె సత్యమైనచో మీపాపములకు ప్రత్యుత్తర మీయ వలసినవారు మీరు. అప్పుడు మీ మాతృవాక్యానుల్లంఘనజనిత పుణ్య మడ్డురాదు." అని దుఃఖించుచు డగ్గుత్తికతో "నాథా! నేను దిక్కుమాలినదానను, సాధ్విని, మీ సహధర్మ చారిణిని. సర్వము నకును మిమ్మే నమ్ముకొని యున్నదానను. ఇట్టి నన్ను ద్రోసిపుచ్చుట మీకుఁ దగునా! నావర్తనమందుఁ గళంకమున్నచో బుజువుపఱిచి శిక్షార్హురాలనైనచో నీ మహాసముద్రగర్భమున ముంచివేయరాదా? లేక విషమిచ్చి చంపివేయరాదా! మీరు నిర్దయులై నన్ను లోకాపవాదాగ్నిజ్వాలామాలా కబళితనుగాఁజేసి హింసించుట న్యాయమా!"

అని దుఃఖాతిశయమున నోట మాటరాక యతని పాదములు తలసోకఁ బడి యుండెను.

అది వినగానే వసంతరావు నిలువున నీరయ్యెను. దుఃఖ మతివేల మయ్యెను. ఎంత ప్రయత్నించి భార్యనోదార్త మన్నను కంఠము స్వాధీనము కాలేదు. కన్నులనుండి బాష్పధారలు మాత్ర మవిచ్ఛిన్న ముగఁ గురియఁజొచ్చెను.

కొంతసేపటి కతఁడు దిటవు దెచ్చికొని వేణూ! అని పిల్చెను.

పుష్పవేణి హిమకిణపరిషిక్తకమలంబుబోలిన కనులెత్తి పతిని జూచెను.

వసంతరావు భార్యను దగ్గఱగా దీసికొని తన వామహస్తము నామె కంఠమును పెనవేసి "వేణూ! నీవు చెప్పిన దంతయు సత్యము. మాది యవిభక్తకుటుంబము. స్వార్జిత మింకను లేదు. ఈ దుష్కాలములో నుద్యోగములు లేవు. మా చదువున కుపాధ్యాయత్వమే ఫలము. అది యెచ్చటను దొరకలేదు. నిన్ను దీసికొనివచ్చి తల్లిదండ్రులను గాదని స్వతంత్రజీవనము చేయ నవకాశము లేదు. నిర్వ్యాపారులమై మన మూరక తినుచుండుటయే కాక మన కగు వ్యయమును గూర్చి తండ్రి గారిని ధనమడిగి పుచ్చుకొనుట యుక్తముకాదు గదా! అందుచే సంసారపాశబద్ధుఁడగు జీవివలె నున్నాను. ఏమి చేయుమందువు?

పు—నాథా! ఈ మీ యుక్తమాలోచనములకుఁ బరమ సంతోషము. తల్లిదండ్రులకు బరువు గల్గించుట మంచిది కాదు. మీ రన్నట్లుద్యోగములు లభించుట కష్టము. అదిగాక ధనాదాయమార్గమ్ము లేదు. కాని నా మనవి యొకటి గలదు. ఆదరించెదరా!

వ—న్యాయ మైనచోఁ దప్పక యాదరించెదను.

పు—అన్యాయమార్గమును ద్రొక్కించు నవివేకిని గాను.

వ—చెప్పుము.

ప్ర—మా తలిదండ్రులకు నేనొక్కతనే సంతానమను. నా తండ్రి ధన మార్జించి పెక్కుభూములు గొన్నాఁడు. అవి సాలునకుఁ బండ్రెండు వందల యాదాయము గలవి. మా జ్ఞాతులు వాని నక్రమముగా నాక్రమించి యున్నారు. వా రాక్రమించుకొనుట కెట్టి యాధారములు లేవు. మా నాన్నగారి చిన్నతనమందే మాతండ్రులు విభక్తులైనట్లు పరమ నిదర్శనము లున్నవి. మీ రేమాత్రము పూనుకొన్నను ఆ భూములు మనకు స్వాధీనములగును. అందువలన మనకు సుఖముగా జీవనయాత్ర జరుగును. మనము శక్తికొలఁదిని బరోపకార మొనర్చుచు సత్కార్యము లాచరించుచు యశోగౌరవము లార్జించుకొనఁగలము.

వ—జడ్జీగారి కుమారుఁడనై యిల్లఱికిముండిసఁ జిన్నతనము గాదా!

ప్ర—మీ రిల్లఱికి ముండవలదు. అత్తింటివారి సొమ్మెల్లఁ దిన నర్హుఁడు. ఇంతకును నేను మీ దానను. నా ధనము మాత్రము మీది కాదా? ఇందు మీకు గౌరవలోప మేమి కలదు?

వ—పదిమందితో ద్వేషము పెట్టుకొని ధనము విశేషముగా వెచ్చించి కష్టపడవలెను. అప్పుడైనను కార్యము సందేహాస్పదము.

ప్ర—నాథా! కాదు. నేను చెన్నపురిలో నున్నప్పుడే న్యాయ వాదుల నడిగి తెలిసికొంటిని. ముందుగా రైతులకు ప్లీడరునోటీసులు పంపినచో రైతులు మా జ్ఞాతులకు సిస్తు లియ్యరు. తరువాత కోర్టు ద్వారా మనము హక్కు పొందవచ్చును. మీ కెక్రమ లేకుండ నేనే చేయఁగలను. కాని తరుణవయస్కను, మగనాలి నగు నేను కచ్చేరీ లెక్కినచో లేనిపోని యపవాదలకుఁ గారణ మని జంకి మీ సెలవు లేకుండఁ జేయ నిష్టములేక యుంటిని. సావకాశముగా నున్నప్పుడు మీ రొకమాఱు మీ నాన్నగారి నడుగుఁడు. సర్వము మీకు బోధ పడును.

వ—ఆస్తిపది తెచ్చిన ధనము దిన నర్హమగునా ?

పు—నాథా ! ఉద్యోగముచేసి ధన మార్జింప నిష్టపడినారు. ఉద్యోగ మనగాఁ గూలిపని. పలువిధములఁ గష్టపడి పదుగురచేఁ జీవాట్లు దిని గౌరవహీనమగు ధనమును దినుటకంటెఁ దన శరీరార్ధమగు నుత్తమ భార్య ధనము తినుట నీచము కాదు. మనము రామవరములోనే యుండనక్కఱలేదు. భూములు వశమైన పిమ్మట మీయిష్టమువచ్చిన చోట నుందము. కోరినచో మనకు వండిపెట్టుచు మా తల్లి మనచెంత నుండును. లేనిచో నామె తనయింటనే యుండును.

వ—మాఱు చెప్పలేక యూరకుండెను.

పు—నాథా ! మీతో మఱొక యంశము మాటాడవలసియున్నది. నన్ను మీరు పరిగ్రహింపకుండుటకు నాయందెట్టి లోపములును లేవు. మీ యమ్మగారు "మా హోదాకుఁ దగిన సంబంధము కాద"ని యెవ్వరితోనో మమ్మును గురించి యన్నారఁట. లౌకికములును, క్షణ భంగురములు నగు హోదాల నపేక్షించి శాశ్వతధర్మమునకు విచ్ఛిత్తి గల్గింపఁ గూడదని విద్వాంసురాలగు నామె కేల తోచకున్నదో తెలియకున్నది. నే నిచ్చటికి వచ్చునపుడు గొప్పగా సారె తేలేదని యెవ్వరితోనో యన్నారట. ఆవిషయములోఁ గూడ నాయందు లోపము లేదు. పది పండ్రెండువందల యాదాయముగల భూములతో నేను మీ యింటికి వచ్చుచున్నాను. అదికాక వస్తుసామగ్రియే తెమ్మన్నచో భూము లమ్మివేసి వలసినంత సారె తేఁగలను. నేను గళంక దూషిత నైనట్టు చెప్పిరట ! ఆవిషయమై మీరు జాగ్రత్తతో విన వలెను. పెద్దక్క మా మేనత్త ! నన్ను దన కుమారుని కిచ్చి పెండ్లి చేయలేదని మాతో విరోధము పూనినది. మా తండ్రిగారు మృతి పొందిన దినములలో మా యింట వేయిరూప్యముల వెలగల నగ లపహరించినది. ఆ తుచ్ఛారా లంతతో సంతృప్తి చెందక మీ యమ్మ

గారితో లేనిపోనివి చెప్పి నా కాపురము మంటగల్ప నిట్టి నింద నారో పించినది. వలసినచో మీరును మీ యమ్మగారును వినునట్లు పెద్దక్క చేతనే నా నిష్కళంకతను వెల్లడించెదను. ఇవి యన్నియు నాలోచించి నన్ను విడిచిపెట్టక యనుగ్రహింపుడు. చెప్పవలసిన దంతయుఁ జెప్పితిని. అప్పటికిని మీకును, మీతల్లిగారికిని నాయందు దయగల్గనిచో నా దురదృష్టమును నిందించుకొనుచు వెడలిపోయెదను. అంతకంటె నే నేమి చేయఁగల నని పలికెను.

ఆమె ప్రసంగమునకు వసంతరా వాశ్చర్యచకితుఁ డయ్యెను. తన భార్య సురూపవతి, సౌందర్యవతి యనియే తలంచుకొనెను గాని యింతటి విజ్ఞానవతి యని యెప్పుడును దలంచుకొనలేదు. తుద కతఁ డట్టి విజ్ఞానవతి దనకు భార్య యగుట తన పురాకృతపుణ్యపుంజమని భావింపకపోలేదు.

ఇరువురును లేచిరి. పుష్పవేణి "నాథా! నావిషయమై యే మాలోచించితి"రని యడిగెను.

అందుల కతఁ డామెను గౌఁగలించుకొని ముద్దిడి, "వేణూ! నీవిజ్ఞాన వాక్సుధారసమువలన సంతప్తమగు నా హృదయక్షేత్రము నిండినది. నీ విచ్చటనే యుండుము. ఒకటి రెండు దినములలో నీ తలం పంతయు నెఱవేర్చెద"నని యనెను. తన హృదయవల్లభుఁడు తన కట్టి వాగ్దానము చేసినందులకుఁ బుష్పవేణి సంతోషభరితురా లయ్యెను.

విశాఖపట్టణములో సబ్ జడ్జీగాఁ బనిచేయుచున్న పేరిశాస్త్రిగారు ప్రభుత్వమువారి గౌరవమునకేకాక ప్రజల మన్ననకుఁగూడఁ బాత్రులై మిగులఁ బ్రసిద్ధిగన్నవారు. అతని తండ్రి తాతలు కేవలము వైదిక కర్మానుష్ఠానపరులై వేదాధ్యయన నిష్ణాతులై యజ్ఞయాగాదులు చేసియుఁ జేయించియు "బులుసులేని యజ్ఞము, బలుసులేని తద్దిన" మనెడి సామెతకుఁ గారకులైరి. పేరిశాస్త్రిగారు వైదికకుటుంబమునఁ బుట్టినను మేనమామల సంప్రదాయమునుబట్టి యాంగ్లవిద్యాభ్యాసము చేసి పట్టపరీక్షయందును న్యాయశాస్త్రమందును జయమంది క్రమముగా న్యాయాధికారి యయ్యెను. శాస్త్రి యాంగ్లవిద్యాభ్యాసియైనను, బాశ్చాత్యనాగరకతాప్రియుఁడైనను అనవసరముగా ధనము వెచ్చింపక న్యాయమార్గమునఁ గొంచెము ధనమార్జించుకొనెను. అతని నివాసము గోదావరీతీరమైనను జిరకాలమునుండి విశాఖపురముననే యుండుటచే నతఁడు విశాఖపురవాస్తవ్యుఁడనియె యందఱును తలంచుచుండిరి.

అతఁడు విశాఖపురమున సీతారామస్వామి కోవెలకు సమీపముగా నొక యద్దింట వసించుచుండెను. అతనికి ముప్వురు కుమారులు, ఒక్కతెయే కూతురు. అతని పెద్దకుమారుడు గోవిందరావు చిరకాల మాంగ్లభాష నేర్చికొన్నను, జడ్జీగారి కుమారుఁడని యెందఱు సాయముచేసినను బ్రవేశపరీక్షయందైన నుత్తీర్ణుఁడు కాలేకపోయెను. అతనికిఁ జిన్నతనమందే వివాహమయ్యెను. అతఁడు ప్రవేశపరీక్ష చదువునాటికే నలువురు పిల్లలతండ్రి యగుటచేఁ జదువతని కంటినదికాదు. గోవిందరావు మొన్న మొన్నటివఱకును నింటఁ బిల్లలనాడించుచు సుఖముగాఁ గాలక్షేపము చేసెను. కాని తల్లి మిక్కిలి పట్టుపట్టి మగనిచేఁ గలెక్టరు

గారికి సిఫార్సుచేయించి ముప్పదిరూపాయల యుద్యోగమిప్పించెను. రెండవకొడుకు వసంతరావు. ఇతఁడు శ్రద్ధతోఁ జదువుకొని పట్టపరీక్ష యందు శ్రీర్ణుఁడగుటయేకాక, బి. యే. ఆనర్సు చదివి లెక్కలలో మొదటి వాఁడుగాఁ గృతార్థుఁడయ్యెను. మూఁడవవాఁడు వాసుదేవరావు. అతఁడన్నలవలె నింగ్లీషు చదివెనుగాని యతనికేమియు నంటలేదు, అంతేకాక యింగ్లీషు చదివి నౌకరీచేయుటకంటె దేశభక్తుఁడై మహాత్ముని శాసనము మన్నించి దేశసేవ చేయుటయే మంచిదని భావించి తండ్రిగారికి భయపడి నెలనెలకు జీతమికట్టి బడి కరుగుచున్నను జదువుట మాత్రములేదు. వాసుదేవరావు పెద్దన్నకంటెను జదువులేక కుటుంబమున కుపచరింపకపోయెను. అన్నకంటెను, దమ్మునికంటెను, వసంతరావు విద్వాంసుఁడైనను నుద్యోగమునఁ బ్రవేశింపలేదు. జడ్జీ గారి కుమారుఁడై యుండియు, లెక్కలలో మొదటితరగతి జయమందియు, జిల్లాబోర్డువారి చిన్నబడులలో నుద్యోగముచేయుట తనకుఁ జిన్నతనమని మానివేసి యాంధ్రాయూనివర్సిటీలో నుద్యోగముకై దండ్రిగారి గౌరవమునంతయు వినియోగించి ప్రయత్నించెను. కాని యతఁడాంధ్రుఁడయినను విశాఖపురీవాస్తవ్యుఁడయినను ఉద్యోగము లభింపలేదు. అందుచే నతఁడు వార్తాపత్రికను జదువుచు నింటఁ గాలము పుచ్చుచుండెను. వీరలకుఁ గడపట నొక కూతురుపుట్టెను. ఆమెపేరు రాజ్యలక్ష్మి. ఆమె మిగులబుద్ధిమతి, ఆమె చిన్నప్పటినుండియు శ్రద్ధతోఁ జదువుకొని తన తెల్వితేటలచే బడిలో నుపాధ్యాయులనే కాక యింటఁ దల్లిదండ్రులను గూడ సంతోషపెట్టెను. శాస్త్రియం దుచే నామె కున్నత విద్యనేర్పింప సమకట్టెను. ఈడువచ్చినపిల్ల నిట్లు విచ్చలవిడిగాఁ దిరుగనిచ్చి యున్నత విద్యకోసము పెండ్లిచేయనిచోఁ బరమపవిత్రమైన మన బులుసువారి కుటుంబమునకుఁ గళంకముగాక మానదని తల్లి మొఱపెట్టి యెంతచెప్పినను వినక కూతున కున్నత

విద్య నేర్పించెను. ఆమె ప్రతిసంవత్సరమును బరీక్షలయందు జయమందుచు యఫ్. యే చదివి యాంధ్రవిశ్వవిద్యాలయమందు ఆనర్సుచదివి కృతార్థురాలయ్యెను. పేరిశాస్త్రి భార్య మంగమ్మ. మహిళాసంఘమున కధ్యక్షురాలై సంస్కారప్రియురాలగుట కూడ రాజ్యలక్ష్మి చదువుకొన సాగుటకు హేతువయ్యెను. రాజ్యలక్ష్మి వివాహము విషయమై దంపతు లొక్కటియగుటచే నుభయసలిమాటలు సాగినవికావు. పిల్ల కిరువదియేండ్లు దాటినను వివాహము కాలేదు.

ఒకనాఁడు పేరిశాస్త్రిగారి పెరటిచావడిలో స్త్రీలందఱును దమతమ పనులు నెఱవేర్చుకొనుచుండిరి. అప్పుడు గోవిందరావు పత్రిక నొకదానిని బట్టుకొనివచ్చి యచ్చటఁ గుర్చీలోఁ గూర్చుండి భార్యను జూచి "కమలా! ఇది విన్నావా? ఇంగ్లండులోఁ బండ్రెండుగురు స్త్రీలు లేబరుపార్టీపక్షమునఁ బార్లమెంటు సభ్యులయినారట! అని పలికెను. అది విని కమల! ఆహా! ఎంతయదృష్టము! స్వాతంత్ర్యము విషయమున ఇంగ్లండునకును హిందూదేశమునకును ఎంత తారతమ్యమున్నదో చూచితిరా? ఎంతకాలమునకును మనపని యింతేకాఁబోలును? ఎన్ని మహిళాసభలున్ననేమి? ఎంత యాందోళనముచేసిన నేమి? అని మంగమ్మనుజూచి "అత్తా! మనసంఘమువారా స్త్రీలకొక యభినందనపత్రమును బంపవలెనుఁ జుఁడీ!" అని పలికెను.

మం—అవును. కమలా! అట్లే చేయుదము, మనముకూడ నూరకుండక మాటిమాటికిఁ గావలసిన తీర్మానములు సెట్టవలసినంత యాందోళనముచేసి పురుషులను మన వంకకుఁ ద్రిప్పుకొని వారితోఁబాటు మన కన్నివిధములగు స్వాతంత్ర్యమును సంపాదించుకొనవ"లెనని పలికెను.

రాజ్యలక్ష్మి వారిమాటలు విని, "వదినే? చాలు. చాలు. మీ సంఘ మభినందనపత్రములు పంపుటకు మాత్రమే పనికివచ్చును. కాని

సంఘసేవ కెందులకును బనికిరాదు. స్వాతంత్ర్యము, స్వాతంత్ర్యము. అందురు. మొదట మనదేశమునకే స్వాతంత్ర్యములేదు. ఇఁక దక్షిణ వారి కెట్లువచ్చును.

మీప్రయత్న మెట్లున్నదనఁగా నెండిపోవుచున్న చెట్టునకు మొదట నీళ్లుపోయక యాకులు కొమ్మలు దడుపుచున్నట్లున్నది. మీ రందఱు బ్రోవయి దేశమునకు స్వేచ్ఛ సంపాదింపుఁడు. అప్పుడు మీరు కోరు నది దానియంతట నదియే వచ్చును."

మం—(నవ్వుచు)—దీనికిదో వెఱ్ఱి. మహాత్మునితోఁ బాటు కారా గృహములకు బొమ్మనును. కష్టపడుటయే కాని యట్లు చేసినంతమా త్రము మనదేశమునకుఁ స్వాతంత్ర్యము కలుగునా?

రా—మీకో వెఱ్ఱి! నాకో వెఱ్ఱి! ఎవరి వెఱ్ఱి వారి కానందము. మన మందఱమును గలిసి నాలుగుకుండల నీళ్లు చెట్టుమొదటఁ బోసినఁ దానియంతట నదియే చిగుర్చును. మన మందఱము దేశస్వాతంత్ర్యము నకై పనిచేసినచో నదిరాక తప్పదు. అప్పుడు కావలసినదంతయు లభించును.

మం—ఓయి బాబో! పోలీసువాండ్రచే నెవ్వరు దెబ్బలు దినఁ గలరు? కైదులో నెవ్వరుండఁగలరు?

రా—మనమే, నిజ మాలోచించినచో మనకిపుడు కైదులోకంటె నెక్కుడు సుఖములేదు. కైదు, కైదు అన్న భయపడిన నెట్లు? అంతతో సరిపోయినదా! సమయము వచ్చినప్పుడు ప్రాణము లర్పింప వలయును. అట్లు వందలకు వందలు, వేలకువేలు ప్రాణాహుతి చేయ కుండ స్వాతంత్ర్యము వచ్చునా? అది రాకుండ మీ రెంత గుండపిండి యైనను లాభములేదు.

అంతలో వాసుదేవరావువచ్చి "అమ్మా! బాబు, బామ్మ, వచ్చి నార"ని చెప్పెను. అదివిని యామెలేచి వీధిలోని కరుగుచుండఁగా

దామోదరరావు తన యత్తగారు, నరసింగరావుగారి సోదరి వేంక టమ్మ యెదుర్కొనిరి. మంగమ్మ వేంకటమ్మతో ఏమక్కా! నీవెంత కాలమునకు మాయింటికివచ్చితివే! రమ్ము. సంతోషము''ని పలికెను.

వేం——చెల్లీ! మాసంతోషమంతయు నీచేతిలోనున్నది. మావ చ్చినపని తీర్తువేని యధికసంతోషము చెందెదము.

మం——అక్కయ్యా! నేనును అందులకే యత్నించుచున్నాను. రమ్మని చావడిలోనికిఁ దీసుకొని వెళ్లెను. అచ్చటివారందఱును వేంక టమ్మతో కుశలప్రశ్నములు చేసినతరువాత,

పెద్దక్క——"మంగా! ఇఁక నూరకుండక యేదో విధమున రాజు పెండ్లి నిర్ణయింపుఁడు. "ఆలస్యమమృతంవిష'' మ్మందు'' రనెను.

మం——పెద్దక్కా! మా యూటంక మేమి యునులేదు. కట్నముల మాట తేలినచో నంతయు నిర్ణయమైనట్లే! మావియ్యపురాలు రాకుండనెట్లు!

వేం——ఆ విషయమై యిదివఱలో ననుకొనలేదా! మీ వియ్యపు రాలు నన్నుఁబంపినది!

మం——ఏమిచెప్పి బంపినది!

వేం——బాబు పరదేశపు చదువునకైన ధనమంతయు మీరు పెట్టక తీఱదు. తక్కినవారిలో మీరిచ్చుకోలేనిచోఁ గొంత తగ్గించెదము.

పేరిశాస్త్రిగారితల్లి సరసమ్మ! "చూడు, వేంకడూ! వారుకోరునది తినుటకుంగోరలేదు. బాబుచదువునకుఁగోరినారు. బాబభివృద్ధిలోనికి వచ్చినచో వారొక్కరె సంతసింపరు, వీరుమాత్రము సంతోషింపరా? వారికిఁగొడుకు, కోడలు. వీరికిఁగూతురు, అల్లుఁడు. ఇందుపరులెవ్వరు? ఏదోవిధముగా నిర్ణయముమంచిది.''

మం——అత్తా! మీకిటుకొడుకు. అటుకూతురు. మీమాట యిరు వురు వినఁదగినవారే! కాని యొక్కటి యాలోచింపవలయును. ఈ

రాజు పెండ్లితో మాసర్వస్వము వ్యయమైనచోఁ బిమ్మట మనకుటుం బము గతియేమి? ఇఁక మీ కుమారుఁ డుద్యోగము చాలించుకొనవల యును. మామనుమలెవ్వరు నాసాటివారుకారు. ఇదంతయుఁదెలిసియు మీరు, మీయమ్మాయియు సంతబరువు మామీఁదవైచినట్టు?

సర—చూచితివా! పెద్దక్కా! ఇట్లనిన వీరికిఁ గోపము. లేనిచో వారికిఁ గోపము. సంబంధములు విడిపోవునుగదా యని యింత చెప్పు చున్నాను. పోనిమ్ము. అగునదేదో యగును.

కమ—అమ్మమ్మా! నీవింత చెప్పుచున్నావు.. కాని కట్నము తగ్గింపుఁడని వారితోఁ గూడఁ గట్టిగాఁ జెప్పలేకపోతివా!

సర—చెప్పకేమి? చెప్పితిని. కట్నములో నొక వేయి లాంఛన ములలో నైదువందలు తగ్గించుటకు ఏర్పాటు చేసితిని. ఇంతకంటె నిఁక నేమి చేయుదును.

పెద్ద—మంగా! మన యత్తయ్య కొంతపనిచేసినది. మన మేమిచ్చి నను బైవానికిఁ బోవునది కాదు.

మం—సత్యమే కాని యింగ్లండు చదువునకుఁ దక్కువగాదు. పదియేనువేలో, ఇరువదివేలో కావలయును. తెలియునా! కావల సినచో మఱొకవేయి కట్నమిచ్చెదము కాని యింగ్లండు చదువున కొప్పుకొనలేము.

వేం—అట్లన్న నెట్లు! అందుకు మీరంగీకరింపనిచో బాబు పెండ్లికే యంగీకరింపఁడు.

కమ—అతఁ డంగీకరించుటకు మానుటకు నేమి? రాజీ సంబంధ మంగీకరించునో, యంగీకరింపదో! ఆలోచింపుఁడు.

పెద్ద—చాలు చాలులే. ఎవ్వరైనను నవ్వెదరు. వేయితపస్సులు చేసినను అట్టి సంబంధము దొరకునా!

సర—ఓసీ! కమలా! నీవు, నీయత్తగారు గలిసి యేమైనను జెప్పి మానిపింపవలెను గాని రాజుమాత్రము బాబును వదలగలదా!

కమ—కాదమ్మమ్మా, రాజుది స్వతంత్రబుద్ధి! ఒకరు చెప్పిన మాట వినదు.

సర—అగుగాక. దానికి మగఁ డక్కఱలేదా? ఏమి?

కమ—కాదమ్మా! రాజున కీ సంబంధమం దిష్టములేదు. ఎవరి నైన వైదికుని బెండ్లాడునఁట. ఇంతయేల? అదిగో ఏకులు నడుకు చున్నది. దానిని పిలిచి యడుగరాదా!

సర—దాని నడుగనేల? అది యొకవేళ నీ సంబంధము వలదని యనుననుకో! అట్లన్న మానుదుమా! కుఱ్ఱది? దానికేమి తెలియును?

మం—మాన కేమిచేయుదు మత్తా! పెండ్లాడునది యది. దాని కిష్టములేనిచో మనమేమి చేయఁగలము.

సర—ఏమో! కూతున కేదో మప్పిన ట్లున్నది.

పెద్ద—రాజూ! రాజూ! అని కేక వేసెను.

రా—(వచ్చి) ఏమి పిన్నీ!

పెద్ద—నీపెండ్లి నిర్ణయమగుచున్నది. ఈసంబంధము నీకిష్టమేకదా!

రా—కాదు.

సర—అదేమే! అట్లందువు? అంతకు నీయిష్టమేనా?

రా—బామ్మా! నాపెండ్లికి నాయిష్టము వలదా!

వేం—కావచ్చును. గాని యీ సంబంధమందు లోపమును జూపిన కదా నిరసింపవలెను.

రా—పిన్నీ! అంతయు లోపమే. నాస్వభావము వేఱు. బావ స్వభావము వేఱు. విరుద్ధస్వభావులమగు మాకు వివాహసంబంధము సుఖప్రదము కాదు. జీవితమునకేది యాధారమో యది యిట్లయి నచో వివాహమువలన లాభమేమి!

పెద్ద—ఏమే! మంగా! రా జిట్లనుచున్నప్పుడు పెండ్లి యెవ్వరికే!

మం—అవును. బాబును పెండ్లాడకపోయిన నంత మంచివరుని మఱియొకని వరింపవలదా!

రా—వరుని మంచిచెడ్డలు నాకనులతోఁ గనిపెట్టవలెను.

వేం—మంగక్కా! నీకూతు రెంతగడుసుదో! చూచితివా! తండ్రికి కర్చక్కఱలేకుండఁ జేయుచున్నది.

మం—మంచిసంబంధము కావలెనన్నచో నప్పుడు మాత్రము ధన వ్యయ మక్కఱలేదా?

కమ—రాజు గోరుకొన్న సంబంధమునకు ధనవ్యయ మక్కఱలేదు.

పెద్ద—అది యెవరిసంబంధమే?

మం—పెద్దక్కా! నీవు చెప్పుము. మీ యూరికి దగ్గఱగనుక నీకన్నియును దెలియును.

పెద్ద—అడుగుము.

మం—తుమపాలలో రామారావను నొక యువకుఁడు గలఁడఁట! ఎఱుఁగుదువా!

పెద్ద—గోనెగుడ్డలవంటి గుడ్డలు గట్టుకొని కాంగ్రెస్సువారితోఁ దిరుగు వాఁడఁటే!

మం—అవును.

పెద్ద—(నోరు మూసికొని) అయ్యో! అయ్యో! అదెక్కడి సంబంధమే! అయ్యో! గర్భదరిద్రుఁడే! అతఁడు శివావధాని కొడుకే! ఆ యవధాని ముష్టియెత్తుకొని జీవించును. అతఁడు దినుటకుఁ దిండిలేక ముగ్గురు ఆడుపిల్లలను మూడువేల కమ్ముకొన్నాఁడు. అయ్యో! మంగమ్మతల్లీ! నీ రెండవకోడలి సంబంధముకన్న అధమాధమమే? నిలువ నీడలేదు. తిన నన్నములేదు. అట్టివానితో వియ్యమందుదువా

మం—రాజూ! చూచితివా! ఎఱుఁగక నీవగ్నిలో దుముకజూచిన నూరకుండఁ గలమా?

రా—అమ్మా! నీవు విపరీతదృష్టితోఁ జూచుటచే నీకట్లు తట్టినది కాని పెద్దక్కమాటలలో నాసంబంధమును నిరసింప నేమియులేదు.

మం—అదేమే! అట్లందువు. ఒకనుగుణమైనను వలదే?

రా—పెద్దక్క వారుగర్భదరిద్రులని యన్నది. కాని కలిమిలేములు కాపురముండవు. దరిద్రులు సంపన్నులు కావచ్చును. సంపన్నులు దరిద్రులుగావచ్చును. దానికినియమములేదు. పోనిమ్ము. వరునితండ్రి ముష్టియెత్తుననియున్నది. పరులకు దోసిలొగ్గి తలవాచునట్లు చీవాట్లు దిని సేయుసేవావృత్తికన్న నది మిగులమంచిది. సేవావృత్తి శ్వవృత్తి యని పండితులందురు. దానియందెట్టి లోపమునులేదు. ముగ్గురాడు పిల్లలను మూఁడువేలకమ్ముకొన్నాఁడని చెప్పినది. ఇట్లనుట కేవల మన్యాయము. మనమామయ్య తనకొడుకును మనకు రమారమి యిరువదివేలకమ్ముచున్నాఁడు. ఇదిమంచిదా! ఇంతకంటె వారే మంచివారు. అది కన్యాశుల్కము. ఇది వరశుల్కము రెండును సమానములే. పెద్దవారమ్మినచో నది కట్నమగును. చిన్నవారమ్మినచో నది శుల్కమగును. ఇందేమియు లోపములేదు. నిలువనీడయు, దిన తిండియు ఒకటిరెండు వేలలోనచ్చును. మఱియు వీనితోనాకెట్టి సంబంధమునులేదు. వరుఁడు సద్గుణవంతుఁడు స్వాతంత్ర్యప్రియుఁడు, నాస్వభావము అతనిస్వభావము ఒక్కటి. అట్టివానిని వరించినప్పుడే నాజీవితము సుఖమయము. అందుచేఁ బెద్దక్కమాటలువిని జడియకుము. పెద్దక్క నీచ స్వభావురాలు. మంచిచెడుగని, చెడుగుమంచియని చెప్పుటయేదానిపని. నీవిందులకు విపరీతచిత్తవు కాకుము.

సర—లేచి—రాజూ! బాగుగాఁజెప్పితివి. దీనితో మీయమ్మకు, మీనాన్నకు బుద్ధివచ్చును. చిన్నతనములోఁ బెండ్లిచేయుఁడని చెవినిల్లు

గట్టుకొని పోరితిని. చదువునకు భంగముగల్గుననిచెప్పి విడిచిపెట్టినారు. అదియిప్పుడుచెప్పినట్లువినునా? అదియెవ్వనినో యధమకులుని వరించి పవిత్రమగు మావంశమును జెఱిచినది.

కమ—అమ్మమ్మా! ఎల్లకాలము, మీయిష్టమువచ్చినట్లు సాగుననుకొన్నావా? యావజ్జీవము తనజీవితము, కష్టము, సుఖము, ఎందుతో సంబంధించియుండునో యందు స్వాతంత్ర్యము లేకపోయిన నెట్లు? అప్రియునిబెండ్లాడినచో, 'ఎద్దెండకులాగును, ఎనుబోతు నీడకు లాగున' న్నట్లుండును. అట్టి దాంపత్యము కేవలము దుఃఖమయము.

పెద్ద—ఇంక నేమున్నది? పెండ్లికూతురిష్ట పడలేదు. ఇంకఁగట్నము లని, లాంఛనములని మాటాడనవసరమేలేదు. రాజు ఒక్క నిమిషములోఁ దనపెండ్లి విషయమేకాక యప్పులనుండి తండ్రినిగూడ తేల్చినది.

సర—"ఏమి—తేల్చినది. దీనియిష్టమారేమి? మావాఁడు కచ్చేరి నుండిరానీ! అంతయు సమకూడునని" పల్కెను.

సరసమ్మకిది మిగులఁగష్టముగా నుండెను. వేంకటమ్మ యింకేమి యును మాటాడలేదు. వీరిరువురును ఏలూరునుండి వచ్చునప్పుడు కట్నముకొంచెము తగ్గినఁదగ్గవచ్చుననుకొనిరి. కాని పెండ్లికూతురిష్ట పడదని తలంపలేదు. ఇదివినగానే దామోదరరావు విచారమునకు మేఱయేలేదు. ఒకవేళ నింగ్లండుచదువు మానివేయుటకుఁ దానంగీక రించిన నాసంబంధము కుదురునేమోయని మేనత్తతోఁజెప్పెను. కాని యెట్టిలాభమునులేదు. కొడుకు కచ్చేరీనుండి రాగానే సరసమ్మ పెద్ద పెట్టున నేడ్చి రాజుపెంకితనమును మానుపుమని చెప్పెను. కాని యతఁ డందులకంగీకరింపలేదు. సరసమ్మ రాజునేకాక కమలను మంగమ్మను గూడ విరామములేకుండఁ దిట్టనారంభించెను. మఱునాఁడుదయము వేంకటమ్మ బాబుతో వెడలిపోయెను.

రాజ్యలక్ష్మికి మేనరికము తప్పిపోయి నందులకు కొందఱు విచారించుచుండఁ గొందఱు సంతసించుచుండిరి. ఆ విషయమై [illegible] మిక్కిలి విచారించుచున్నది పేరిశాస్త్రి తల్లి సరసమ్మ. [illegible] సంబంధము తప్పించుట కిష్టములేక యామె నాదంశ కట్నమి [illegible] లేకుని యున్నప్పుడు తన సొంతసొమ్ములోఁ గొంత యిచ్చినయెడల [illegible] స్థిరపఱుపవలెనని యనుకొన్నది. కాని మొదటికే [illegible] తనయందు భక్తిగల కొడుకుతో ననేకవిధములఁ జెప్పిన [illegible] కోపపడినది. తిట్టుకొన్నది. కలిసిన సంబంధము చేసికొనుటవలని లాభములు నిరూపించినది. కన్నపిల్లల నడుమలో నుంచక పోవుటవలని [illegible] వెల్లడిచేసినది. కాని యేమియును లాభములేదు. తన సర్వస్వమును వెచ్చించినను వరశుల్కమునకుఁ జాలునట్లు లేదు. [illegible] నల దన్నచో యుక్తముకాదని భావించుచుండును. తనపై నెట్టిభారమును బెట్టక రాజ్యలక్ష్మి వలదని నిషేధించి నందుల [illegible] లోలోన సంతసమునే చెందుచుండెను. తమహోదాకుఁ దగిన సంబంధము తప్పిపోవుచున్నదని మంగమ్మ యొకవైపు విచారించుచున్నను, అంతకట్నమడిగిన వియ్యాల వారిపైఁ గోపమూని వివాహమును విఘ్నమొనరించుటకు కొకవైపు సంతోషమును గూడ నందకపోలేదు. తక్కిన వారందఱు ఒక్క వివాహమున కిల్లు గుల్లచేసినచో నిఁక కుటుంబమునకుఁ దిండియే యుండదని తలంచి రాజు చేసినపనికి మిగుల సంతసింపసాగిరి.

ఏ తద్వివాహసమాలోచనమందు దాసక్తులై యుండుటచే మంగమ్మ మొదలగువారు పుష్పవేణి విషయమై ప్రస్తావన తెచ్చుటకే యవకాశము లేకపోయినది. కమలాంబ పుష్పవేణి నాదరించి తనకు గల సంబంధించి తనస్వాధీనత యందున్న యొక గదియందు నివసింపఁజేసెను

పుష్పవేణియందు నివసించి తఱుచుగా భర్తృసమావేశము నొందుచుం డను. రూపసంపదచేతనే కాక సుగుణసంపదచేఁ గూడ భర్తను సంతసింపఁజేయఁ గలిగెను. ఇట్లు పదిదినములు కడచునప్పటి కామె తన యుత్తమస్వభావముచేతను, సత్ప్రవర్తనము చేతను గుటుంబము వారి గౌరవాదరములకుఁ బాత్రమయ్యెను. పెద్దక్క మాటలకు లొంగిపోయి ధనాశాపరురాలై యేదో నింద మోపి పుష్పవేణిని విడిచిపెట్ట నిశ్చయించుకొన్న మంగమ్మ కూడఁ బుష్పవేణి మంచితనమునకు హృదయమున మార్పుచెందక పోలేదు. ఇట్లు పుష్పవేణి కాపురము స్థిరమగుచున్నందులకుఁ బెద్దక్క మదిలో మిక్కిలి దుఃఖించియు నేమియుఁ జేయునవకాశము లేమికి వగవకపోలేదు. వారు పుష్పవేణిని విడుచులాగునఁ జేసినచో తన వదినపై, గసి తీర్చుకొనుటయే కాక తాను కుదిర్చిన జమీందారీ సంబంధమువలనఁ దనకుఁ గొంత ధనలాభము గూడఁ గల్గును. అందుచేఁ బెద్దక్కమాత్రము తనపని తాను మానక సమయము చిక్కినప్పుడెల్లను బుష్పవేణి కులకళంక యనియు, నట్టి దానిని గుటుంబమునఁ జేర్చుకొన్నచోఁ గులమున కప్రతిష్ఠ రాకమానదనియుఁ జెప్పుచునే యుండెను. మఱియుఁ బుష్పవేణికి జారత్వమే కాక చోరత్వముకూడ నున్నట్లు వెల్లడింప నిశ్చయించుకొనెను.

ఒకనాఁడు పుష్పవేణి కమలాంబగదిలోఁ గూర్చుండి రైక కుట్టుకొనుచుండెను. కమలాంబ తనమెడలోని బంగారు గొలుసును బల్లపై వెండిగిన్నెలో నుంచి స్నానమునకై పెరటిలోని కరిగెను. పుష్పవేణి పినతల్లి రంగమ్మ యామె స్థితిగతు లెట్లున్నవో తెలిసికొనుటకై వచ్చెను. ఆమె బీదదగుటచే మంగమ్మ చూచియును మాటాడలేదు. వారిగౌరవ మర్యాదలతో మనకేమి పనియని రంగమ్మకూడ నామెను బలుకరింపక వేణితోఁ గదిలోఁ గూర్చుండి యామెచెప్పిన దంతయు విని తనయక్కతోఁ జెప్పుటకు వెడలిపోయెను. మధ్యాహ్నసమయ

మున నెట్లయిన నవకాశము చేసికొని కమలాంబతోఁ గలిసి తల్లిని జూడవచ్చెదనని కూడ వేణి తల్లికి వార్తపంపెను.

కమలాంబను దప్పకుండఁ దమయింటికి రమ్మని కోరుటకై రంగమ్మ కొంచెముసేపు వేచియుండెను. కాని యామె పిల్లలకుఁ గూడ నీళ్లు పోయు చుండుటచే నెంతకును రాలేదు. అందుచే రంగమ్మ వంటకు వేళయగుచున్నదని చెప్పి వెడలిపోయెను.

రంగమ్మ వెడలిపోయిన పిమ్మటఁ బెద్దక్క పెరటిచావడిలోఁ దల దువ్వుకొనుచున్న మంగమ్మను జేరి, "ఏమే, మంగక్కా! నీచిన్న వియ్యపురాలు వచ్చినది. నీ కగపడనే లేదా?" అని నవ్వుచుఁ బల్కెను. ఆమెతల ద్రిప్పుచు "లేద"ని పలికెను.

అప్పుడు పెద్దక్క "మంగా! నీతో నే నెంత చెప్పినను వినవు కావు. నా మాట లసత్యమను కొన్నావు. మీ కన్నులయెదుట జరిగినచో నమ్మకుందురా! ఇది యిప్పుడు రహస్యముగా నుంచుము. నే డొక చిత్రము జరిగినది. నీ పెద్ద కోడలు బంగారుగొలుసు పిల్లపై నుంచి స్నానమునకుఁ బోయినది. పుష్పవేణి యదితీసి తన మెడలో వేసికొని మాటిమాటి కద్దము చూచుకొనుచుండెను. వేణి చిన్నపిల్ల నగలు ధరింపఁ గోర్కెయుండును. ఈ రీతిగా నైనను దృష్టి పడునేయని వారున్న లోపలి కరిగియు వారితో మాటాడ నిష్టములేక తిరిగివచ్చి వేసితిని. అంత రంగమ్మలేచి "వేణూ! నే నరిగెదను. మధ్యాహ్నము తప్పక వచ్చెదవుకాదా!" అని చెప్పిలేచి మొలనేదో సవరించుకొనుచు వెడలిపోయెను. మరల నేను గదిలోని కరిగి చూచితిని. ఆ గొలుసు దానిమెడలోను లేదు. గిన్నెలోను లేదు. మీ కోడలు పినతల్లికిచ్చి పంపివేసినది. చూచితివా! దానిగుణము. పాపము, కమల దాని యం దెంతో యాదరముచూపి గౌరవించినందుల కిది చేసినయుపకారమిది. కుక్కను బంగారు సింహాసనమునఁ గూర్చుండఁబెట్టినను దానిగుణము

...నునా ! అందుచేతనే యది మీ యింటికిఁ దగినకోడలు కాదు. కమల చూచుకొనువఱకు నీవీ ప్రసంగము తేకుమ''ని చెప్పి కాఁగల పని కెదురు చూచుచుండెను.

కమలాంబ స్నానము చేసివచ్చి గిన్నెలో గొలుసు లేకుండుట కచ్చె రువందుచు "చెల్లీ ! ఇందున్న బంగారు గొలుసేదీ" అని యడిగెను. అంతల నామె నివ్వెఱగందుచు " అక్కయ్యా ! నే నెఱుఁగనమ్మా ! మామిన్న ... జూడరాఁగా మాటాడుచు నిటగూర్చున్నాను. పెద్ద క్క ... వచ్చినది. నీ వక్కడ గిన్నెలో గొలుసుంచి తివన్న సంగతే నాకుఁ దెలియ''దనెను. కమలాంబ తొందరపడి యుచ్చ... వెదుక నారంభించెను. ఒక్కక్షణములో నింటివారందఱు నక్కడికిఁ జేరిరి. అప్పుడు సంగమ్మ "కమల నే నిష్టపడకపోయినను జెల్లెలని లోపలఁ బెట్టుకొన్నందులకుఁ దగిన శాస్త్రియైనది. దీనిపిన్నమ్మ వచ్చినది. ... దానికిచ్చి పంపివేసినది. దీనిగుణము నీకుఁ దెలిసినదా ?" అనెను.

...—అత్తా ! ... పడుచున్నారు. ఉత్తమప్రకృతి నీచగుణ ములు ... పొసంగదు. అది మఱియొక విధమునఁబోయి యుండవచ్చును.

సం—"చాలు లెమ్మా, నీ మాటలు. నీ నీతులును. వెంటనే పోలీసు వారిని రప్పించి దీని పిన్నమ్మగారి యిల్లు పరిశోధింపఁ బంపినచోఁ దప్పక ... దొరకును. నీ మగడున్నాఁడేమో ! ముందుగా నా ప్రయత్నము సాగింపు''మనెను.

కమల మాటాడలేక యూరకుండెను.

పుష్పవేణి ... కనవసరముగా నవమానము గల్గుటయేకాక తన మూలమునఁ దన పిన్నిగారికిఁ గూడఁ గష్టములు గల్గినందులకు ... 

వీధిలోని కరిగిన గోవిందరావును, వసంతరావును వచ్చిరి. పేరి శాస్త్రిగారు తనగదిలో నేదో జడ్జిమెంటు వ్రాసుకొనుచుండిరి. జడ్జిగారి యింటిలోపల నేదోవస్తువు పోయినదని విని పోలీసువారు తమంత తామేవచ్చి జడ్జీగారికి నమస్కరించిరి. పోలీసులు తమపనియం దెంత శ్రద్ధ వహించియున్నారో యని జడ్జీగారికిఁ దెలియుటయే వారి యుద్దేశము. పేరిశాస్త్రి వారితో నేమియుఁ బలుకక వెడలిపొమ్మని చేసన్న చేసెను.

అట్లు వచ్చినందులకుఁ గొంచెమైనను మన్ననచూపక పొమ్మన్నందు లకు పోలీసులు చిన్నపుచ్చుకొని వెడలిపోవుచుండ మంగమ్మ వారిని బిలిచి గోవిందరావును దోడిచ్చి రంగమ్మగారి యింటిని బరిశోధింపఁ బంపెను. పోలీసు లిల్లు చొరఁబడి పరిశోధించిరి. కాని వస్తువు దొరక లేదు. అపుడు సుబ్బలక్ష్మి "చెల్లీ! పెద్దక్క యక్కడనున్నది నీవు వెళ్లవద్దని చెప్పితినిగాదా! అది నీటిలో నిప్పుపుట్టింపఁగలదు. అంతటి కుటిలురాలు లోకమున నుండదు. అది యెన్నో దొంగతనములు చేసి నది. అందఱును దనవంటివారే యని యనుకొనుచున్నది. పేదల మైనంతమాత్రమున దొంగతనము చేయుదుమా" అని చెప్పి పోలీసుల నిట్లు పంపినందులకు వియ్యాలవారిని పరిపరివిధముల నిందింపఁ జొచ్చెను. అది చూడవచ్చిన నిరుగుపొరుగువారు రంగమ్మ మంచి తనమునకు బొగడుచు ననవసరముగా వారి నవమానించిన పోలీసు వారిని నిందింపఁజొచ్చిరి. పోలీసువారును, గోవిందరావు మొదలగు వారును మరలిపోయి వస్తువు దొరకలేదని చెప్పిరి. పేరిశాస్త్రి వచ్చి బంధువులనియైనను యోజింపక యప్పని చేసినందులకు భార్యను నిందించి పోలీసువారిని బంపివైచెను.

మంగమ్మ భర్తకు నెదురాడ వెఱచి లోనికరిగెను. పెద్దక్క యామెను వెంబడించెను.

మం—దొంగవస్తువును దొరకనిత్తురా!

పెద్ద—అది యిరుగింటనో పొరుగింటనో దాచి యుండవచ్చును. అంతే కాని యమ్ముకొనుట కవకాశములేదు. ఈవేళ కాకపోయిన రేపయినను బయటఁబడక మానునా! ఆగర్భదరిద్రుల కంతవస్తు వెట్లు వచ్చును? వారు వాడుకొన్నను దెలియును. అమ్ముకొన్నను దెలియును.

మం—కానిమ్ము. ఏదో యగును. ఇది మాయింటి కెంతలోకు వయో చూడుము. ఇట్టి దెన్నడైన నెఱుగుదుమా!

కమలాంబకుఁ బుష్పవేణియం దెట్టి సందేహములేదు. గోవింద రావునకును లేదు. రాజ్యలక్ష్మికిని లేదు. భర్తయగు వసంతరావు నకును లేదు. సంతతదుఃఖముచేఁ బుష్పవేణి ముఖము మిక్కిలి కలు షితమై పోయెను. ఎవ్వరెంత యోదార్చినను ఆమె దుఃఖమును మాన లేదు. భుజింపలేదు. ఆమె దురవస్థకు వారి హృదయములు ద్రవించి పోవుచుండెను. అపుడు పెద్దక్క మంగమ్మతో మిక్కుటముగా నేఁడు తిండి తినకపోయిన చో దొంగది కాదందురు కాఁబోలునని మంగమ్మతో ననెను. ఆమాటలు విన్నప్పు డొక్క మంగమ్మకుఁ దప్ప నచ్చటివారి కందఱకును గష్టమనిపించెను. పుష్పవేణి చెప్పిన మాటలనుబట్టి పెద్దక్కయే యపహరించి యిట్లు నిందమోపి యుండవచ్చునని యను కొనిరి. ఆ కుటుంబమువారి యందఱిలో రాజ్యలక్ష్మికిఁ బెద్దక్కయనిన మిక్కిలి కోపము. అందుచే పెద్దక్కయే దొంగయని నిశ్చయించుకొని రాజ్యలక్ష్మి యహోరాత్రము లెప్పుడు నామె మీఁదనే కన్ను వేసి రక్షించెను.

ఆవస్తువు పోయిన మఱునాఁడు మంగమ్మతో "అక్కా! చాల దినములయినది వచ్చి మాయింటికిఁ బోయెదను" అని పలికెను.

మం—నీకోసము అచ్చట బెంగబెట్టుకొని యేడ్చువా రెవ్వరు? ఇఁక నాల్గుదినము లుండరాదఁటే.

ఆకుటుంబములోఁ జాలమందికిఁ దనపై కోపమని పెద్దక్క యెఱుఁగును. ఇఁక మఱికొన్ని దినములున్నచోఁ దనలోపములు వెల్లడి యగునేమో యని యామె భయము. అందుచే మంగక్కా! కాదు. కొన్నిపనులున్నవి ఉదయము రైలుబండిలో వెళ్లెదను. మరల వచ్చెద నని చెప్పెను.

మం—సరియే యట్లే కానిమ్ము.

రాజ్యలక్ష్మి రహస్యముగాఁ బెద్దక్క మూట విప్పి చూచెను. కాని వస్తువు దొరకలేదు. పెద్దక్క వస్తు నపహరించి పెరటిలో జామిచెట్టు మొదటఁ బూడ్చినది. మఱునాఁడు ప్రయాణమగుటచే దాని నెట్లయినను సంగ్రహించికొని పోవలెనని పెద్దక్క తలఁచుచుగా బెరటిలోని కరుగుచుండెను. ఎవ్వరో యొక్కరు నూతికడ నుండుటచే వస్తువును సంగ్రహించుటకు వీలు చిక్కలేదు. చీఁకటిపడిన పిమ్మటఁ బెరటిలోనికి వెళ్లు నలవాటా యింటివారికిఁ దక్కువ. అందుచే రాత్రిపూటఁ దీసికొనుటకుఁ బెద్దక్క నిశ్చయించెను. రాత్రి యందఱును భోజనమునకుఁ గూర్చుండిరి. రాజ్యలక్ష్మి మాత్ర-మన్నమునకు రాలేదు. మంగమ్మ యామెను గూర్చి యడుగగా వాసుదేవరావు, "అక్క! బేటరీలైటు పట్టుకొని సభకు వెళ్లినద"ని చెప్పెను. దాని కెవ్వరును సభలే. యని మంగమ్మ విసివికొనెను. అందఱును భుజించుచుండిరి. మంగమ్మ వారి కుపచారములు చేయుచుండెను. కమలాంబ పిల్లలను బండుకొనఁ జేయుచుండెను. ఇఁకఁ బెరటిలోని కెవ్వరును రారని నిశ్చయించుకొని పెద్దక్క పెరటిలోని కరిగెను. పెరడు చీఁకట్లతో నిండి మిక్కిలి భయంకరముగా నుండెను. చీఁకటిలోఁ బాతిన చోటు తెలియక మెల్లగా పెద్దక్క వెదకుచుండెను. ఎట్లో యా చోటును జేరి మెల్లగా పెల్లగించినది. ఇట్టటు చూచినది. సాంద్రతిమిరము తప్ప మఱేమియు లేదు. గొలుసు నంటుకొనియున్న మన్నును దుడుచు సమయముననఁ గొంతదూరమున

నున్న మల్లెపందిరిక్రింద దాగియున్న రాజ్యలక్ష్మి లైటు తిన్నగా నామెపై పోకస్సు చేసినది. ఆకస్మికముగా నా వెలుతురు పడుట కది నివ్వెఱఁగంది వస్తువును మొలను దాచుకొను సమయమున రాజ్యలక్ష్మి పరుగెత్తుకొనిపోయి యామె చేయి బట్టుకొనెను. పెద్దక్క యామె చేతి పట్టును విడిపించుకొనలేక పెనగుచుండ రాజ్యలక్ష్మి దొంగ దొంగ యని కేకవేసెను. ఆ కంఠధ్వని రాజ్యలక్ష్మిదని గ్రహించి భుజించు వారు లేచి పెరటిలోనికి లాంతరులు పట్టుకొని వచ్చిరి. రాజ్యలక్ష్మి యొక చేతితోఁ బెద్దక్కను రెండవ చేతితో లైటును బట్టుకొని యుండెను. ఆ చిత్రమును జూచి వారంద ఱాశ్చర్యచకితులైరి. వస్తువుతోఁ గూడ దొంగ దొరకెను. తప్పించుకొనుటకుఁ బెద్దక్కకిఁక మార్గమేది? గొంతెత్తి యేడువఁ దొడఁగెను. జాలిపడి వారు తన్ను విడిచి పెట్టుదురేమో యని యామె యుద్దేశము. అక్కడివా రందఱును బలువిధముల నామెను నిందింపసాగిరి. పేరిశాస్త్రి భార్యను జూచి "ఇట్టి నీచురాలి నెందులకుఁ జేరఁదీసితివి? చూచితివా! దీని మూలమున నమాయకురా లయిన కోడలి కెట్టి కష్టములు సంభవించినవో! దాని మాటలు విని నీవును, నీ మాటలు విని నేనును జెడిపోయితిమి. మన యజ్ఞానము కోడలిని, త జ్జననీజనకులను మిక్కిలి సంతసింపఁ జేసిన ద"ని పలికెను.

మం—ఇది యిట్టిదని నా కేమి తెలియునండీ! దుక్కలాగున నున్నది. నాలుగు పనులు చక్కఁబెట్టి సాయపడుచున్నది. నలుగురు వంటలక్కలను బెట్టుకొన్నను నా కా సుఖము గలుగదు. అందుచే దాని నింటఁ జొరనిచ్చితిని. లేకపోయిన నట్లు చేయుదునా?

గో—దీనిని బోలీసువారి కప్పగించి తగిన శిక్ష చేయింపవలెను. లేనిచో నిది యెందఱ సాధువులను బాధించునో?

పే—సత్యమే. ఇట్టిదాని నూరక విడువరాదు.

మం—పాపము. దిక్కుమాలినదియుండెను. దానిని శిక్షింపఁజేసిన మన కేమిలాభము!

గో—దీనివలన లోకులకు బాధలు కలుగకుండుటయే.

ఇట్లు పెద్దక్క-ను శిక్షించువిషయమై కుటుంబములోఁ జెప్పుఁగుండ్ర శ్రీముఖులై యున్నను, మంగమ్మ యందుల కెంతమాత్ర మిష్టపడలేదు. చిరకాలమునుండి తన్నాశ్రయించినది. కావున దానియందు దోష మున్నను క్షమింపవలెనని యామె యాశయము. "విషవృక్షోపిసం వర్ధ్య స్వయంచ్ఛేత్తుమసాంప్రతి" యను న్యాయము ననలంబించెను.

కమ—"ఈవిషయమై యన్నివిధములచేతను బుష్పవేణికి మాత్రమే హక్కుగలదు. ఆమె యిష్టప్రకారము చేయుట న్యాయ"మనెను.

ఆ మాటవిని పెద్దక్క కెవ్వున కేకవేసి యేడ్చుచు మంగమ్మ కాళ్లపైఁబడెను. చిరకాలమునుండి తానొనర్చుబాధలు పడుచున్న పుష్పవేణి తన మరణమునకై యిష్టపడునని పెద్దక్కయూహ!

మామగారియొద్దకు వచ్చుటకు సిగ్గుపడి దూరమునగా నిల్చియున్న పుష్పవేణి చెంతకు కమలాంబా రాజ్యలక్ష్ములరిగి యామె రానని చున్నను బలాత్కరించి యచ్చటికిఁ గొనివచ్చిరి. ఆమె సిగ్గునుగాంచి పేరిశాస్త్రియు గోవిందరావును గొంచెమెడఁ గలుగఁబోయిరి. అప్పుడు పుష్పవేణి మంగమ్మ యనుమతి నిట్లనియె! "సామాన్యముగా మనకు లోకములో వచ్చు కష్టసుఖములు అస్మత్పూర్వజన్మ కృతకర్మముల మూలమున సంభవించునని పెద్దలందురు అందులకు మనుష్యమాత్రులు కారణమనుట తగదు. పెద్దక్క నాకును, నా కుటుంబమునకు నెన్ని యపరాధము లొనర్చినను మా యింటి యాడుపడుచగుటచే నాకుఁ బూజ్యురాలు, ఆమెకు నా యన్నవారు లేక దిక్కుమాలిన పక్షివలెఁ దిరుగుచున్నది. ఈసమయమున దానిని శిక్షింపజేసినను నే నిదివరకు

కనుభవించిన కష్టములు తప్పిపోవుగదా? ఇంతకును మనవస్తువు మనకు లభించినది. అందుచే నామెను విడిచిపుచ్చి యింక ముందింటికి రాకుండఁ జేయుట మంచిదని నా తలం”పని చెప్పెను. అదివిని పెద్దక్క పుష్ప వేణీ, నీ యమ్మ కడుపుచల్లగా, నీయత్తకడుపుచల్లగా, నీవు వేయేం డ్లు బ్రదికి వేయిండ్లకు మొదలవై యుండుమని దీవింపఁజొచ్చెను.

పుష్పవేణి యభిప్రాయము తన యభిప్రాయముతో నేకీభవించు టను గాంబోలును మంగమ్మ యామెమాటలకు పరమానందభరితు రాలయ్యెను. ఆమె యుదారస్వభావమును కమలాంబా రాజ్యలక్ష్ములు మిక్కిలి మెచ్చుకొనిరి. ఇంతటితో పెద్దక్కగుండె గూటపడినది. కాని రాత్రి ఫలాహారముచేసి వెళ్లుమని మంగమ్మ యెంత బతిమాలినను వినక పెద్దక్కమాట పట్టుకొని యాచీఁకటిలో నెచ్చటికో నడిచి పోయెను.

నాఁ డాదివారము. కచ్చేరీలకు సెలవు. పేరిశాస్త్రిగారుదయముననే స్నానముచేసి కచ్చేరిచావడిలో సుఖాసనాసీనుఁడై యుండ మంగమ్మ తినుబండములును గాఫీయుఁ బట్టుకొనివచ్చి భర్తసన్నిధిని బెట్టెను. పేరిశాస్త్రి భుజించుచు "మంగా! నే చెప్పినది విన్నావుకావు. నాను రాజేమిచేసినదో చూచితివా! మన మిష్టపడిన వరుని నిరాకరించినది, దాని యభిప్రాయము తెలిసికొనవలెనని యెన్నిసారులు చెప్పితిని. నా మాట సరకు చేసితివికావు. పెండ్లివిషయమై చిన్నపిల్లలకు స్వాతంత్ర్యము వలనుపడదని చెప్పు నా యుద్దేశము బోధపడినదా?"

మం—బోధపడినది. కాని యంతమాత్రమునఁ దప్పేమి. దానికి కిష్టమువచ్చిన మగని నెంచుకొనును. పోనిండు, మనకుఁ గొంత పూచీ వదలినది.

పే—అట్లనరాదు. దానివలనఁ బెద్దచిక్కులున్నవి.

మం—ఏమియును లేవు. ఎవరి యదృష్టము వారిదని యూరకుండ వలెను.

పే—అట్లూరకుండఁ గలమా?

మం—చేయిదాటిన పిమ్మట నేమిచేయఁగలము.

పే—చేయిదాటకుండ నుంచవలెననియే నా యభిప్రాయము.

మం—మీరు చెప్పినట్లు చేసి పెండ్లివిషయమున బాలికలకు స్వాతంత్ర్యము లేకుండఁ జేయుటకు నే నంగీకరింపఁజాలను.

ఇంతలో నొకపురుషుఁడు పెట్టెయు బరుపును గూలివానిచే నెత్తించి మోయించుకొని వచ్చుచుండగాఁ గచ్చేరిసావడిలోనికి వచ్చెను. అప్పుడు పేరిశాస్త్రి "ఓహో! బావగారా! రండు, రండు, చిరకాలమునకు మీ దర్శన"మని పలికెను.

మంగమ్మ నాలుగడుగులు ముందునకు నడిచి "ఓహో! అన్నయ్యా! ఢిల్లీనుండియే వచ్చుచున్నావా? నీవు వచ్చుటచే మాకు చాలసంతోషమైనది. మొన్ననే మన యూరినుండి కొందఱు వచ్చినారు. వదినెయుఁ బిల్లలు కుశలముతో నున్నారట."

సీతాపతిరావది విని "చెల్లీ! సంతోషము, నే నింటినుండి రెండు నెలలకుఁ బూర్వమే బయలుదేరితిని. ఇంటిలోఁ బిల్లలేమి చిక్కులు పడుచున్నారో యని యడలుచున్నాను. నాకుఁ గొంత యారాటము తగ్గినది. నీమాటలు చెప్పుటచే."

మం—నాయనా? మీ వంటివారు స్వసుఖములు స్వకుటుంబమును విడిచి [illegible] దేశప్రజాహితకార్యములు సాధించుచు ( పొంటెఁ ) కష్టపడుచున్నారు కావుననే మన దేశమున కింత నామరూపములు కల్గినవి. లేనిచో మన దేశమెట్లుండునో చెప్పవలయునా?

రా—అన్నగారి గొప్పతనము చెల్లెలే పొగడవలెను. ఇట్టి స్వార్థపరులు, లాభాలాభవిచారానభిజ్ఞులును దగుదుమమ్మాయని శాసనసభలలోఁ బ్రవేశించుటచేతనే దేశమింతయనర్థమును బొందినది. అమ్మా! నీ వన్నయ్యనంతగాఁ బొగడుచున్నావు. వీరొనర్చిన ప్రజాహితకార్యమేది?

మం—ఒకటియా? రెండా! చెప్పుటకు, అనేకములున్నవి.

రా—( క్రీలుమణచుచు ) ఏదియొకటిచెప్పుము.

మం—శారదాచట్టమును స్థిరపఱచుట!

రా—అది ప్రజాహితకరము కాదని పెక్కండ్రయభిప్రాయము.

మం—అట్లుఁగాక అభిప్రాయభేద ముండవచ్చును?

రా—దానికిఁ బ్రభుత్వమువారనుకూలముగా నున్నారుగనుక నెగ్గినది? వీరు చేసిన దేమున్నది.

మం—వీరందఱునుగలసి పనిచేసినారుగనుకనే నెగ్గినది.

రా—అమ్మా! నీవు చెప్పినదసత్యము. ప్రభుత్వేష్టమే భారత శాసనసభ. వీరందఱును హోముమెంబరుగారి క్రీడలు. వారెట్లు కదలిన వీరు నట్లేకదలుదురు. అట్టి దేశద్రోహులను భట్టువలెఁ బొగడుచున్నావు.

సీ—అదివిని వెలవెలపోవసాగెను.

మం—రాజూ! చాలుచాలు. ఊరకుండుము. చిన్ననోటికిఁ బెద్ద కూతలు. చిన్న పెద్ద ఆలోచింపకుండ నోటికివచ్చినట్లు ప్రేలెదవు.

సీ—పోనిమ్ము. చెల్లీ! చిన్నపిల్ల దానికేమి?

రా—కాదు. మామయ్యా! నేను జిన్నపిల్లవలె మాటాడలేదు. మీరు ప్రభుత్వము కనుసన్నలను మసలవలసినదేకాని ప్రజాప్రాతినిధ్యమును బురస్కరించుకొని వర్తించుచున్నారా!

సీ—ఓఁ. తప్పక. రాజ్యలక్ష్మి చిన్నపిల్లయనియు దెలియక ప్రశ్నించుచున్నదని యతనితలంపు.

రా—ఎందుల కీయసత్యములు. మామయ్యా! మీ దేశహితైకబుద్ధులన్నియు అట్టావాయొడంబడిక చట్టము సంగీకరించుటవలననే తెలిసినవి.

సీ—అట్టావాయొడంబడిక దేశహితకరము కాదందువా? రాజూ!

రా—హితకరమేయందువా? మామయ్యా.

సీ—పెద్దరాజనీతిజ్ఞురాలివలె మాటాడుచున్నావు. నీవేచెప్పుము.

రా—మీవంటివారియెదుట నేనేపాటిదానను. కాని భారతదేశ ప్రజలు, ఇతరదేశప్రజలు, కేవలమింగ్లండు రాజనీతిజ్ఞులగు ప్రజలు. వీరు, వారు, అననేల లోకమంతయు "అట్టావా యొడంబడిక" భారతదేశమునకు నష్టదాయకమని సిద్ధాంతము చేసినారు. శాసనసభా గుహాకరణములోఁ జిక్కుకొని యుండుటచే మీకు వినబడలేదో, లేక హోముమెంబరుగారికి భయపడి తదీయాభిప్రాయప్రకారముగా వర్తింపకతీఱదనిచేసినట్లు చెప్పుచున్నావో నాకుఁదెలియదు.

సీ——శాస్త్రీ! రాజు. చాలగట్టిగా మాటాడుచున్నది. ఈమాటలు దీనిని శాసనసభకుఁ బంపవలెనుసుమా!

రా——సంపుటకు, పఱానుటకును, మీరెవ్వరు. మేమే యెన్నికొనఁబడి వెళ్లుదుము.

సీ——పరాకలంటె మీరేమి సాధించుకొని వచ్చెదరో చూతము కాదు.

రా——మామయ్యా? కార్యముసాధించినను, మానినను, మీపురుషులకంటె యుక్తముగానే ప్రవర్తింతుము.

సీ——ఎట్లో? చెప్పుమా!

రా——మామయ్యా! పత్రికలు చదివినట్లు కనఁబడదు. పత్రికలు చదివి లోకసమాచారము తెలియఁగని వారికి శాసనసభ్యత కర్హత లేదు.

సీ——దాని కేమి? కానిమీస్త్రీల యుచితప్రవర్తన మెఱిఁగింపుమా!

రా——మీరు ప్రజాప్రతినిధులా? కారా!

సీ——ప్రజాప్రతినిధులమే.

రా——అట్టి మీరేమి చేయవలయును?

సీ——చెప్పుము.

రా——ప్రజానుకూలముగా నడిచి కార్యము సాధింపలేనప్పుడు మీపదవులకు రాజీ యిచ్చి తిరిగి రావలయును.

సీ——దానివలన లాభమేమి? అడ్డు లేకపోవుటచేఁ బ్రభుత్వము మఱింత నిచ్చలవిడిగాఁ బ్రవర్తించును.

రా——ఇప్పుడు మానినదా? మీరందఱు యుక్తజ్ఞానవంతులై సభ విడిచి వచ్చినప్పుడు ప్రభుత్వమువా రొనర్చుకొన్న కార్యముల గతి వేఱు. మీరందఱుండగనే మీ యెదుటనే యొనర్చుకొన్న కార్యముల గతి వేఱు. ఆగొడవ మీకేల? ప్రజాప్రతినిధులు మీరుగ ప్రభుత్వ

కార్యము సాధింపలేనప్పుడు సభలో మీరెందుల కుండవలెను. ఈవిషయములో మీరాజపురుషులకంటె మా ముద్దులక్ష్మియే యుక్తముగా వర్తించినదని పత్రికలన్నియు ఘోషించినవి. వినలేదా!

సీతాపతిరావది విని యు వినిపించుకొననట్లు నటించి గ్రామములో నేదో పని చక్కపెట్టుకొని వచ్చెదనని సేరిశాస్త్రితోఁ జెప్పి వెడలి పోయెను. మంగమ్మ కూతు లోకజ్ఞానమునకు సంతసించి దగ్గరగాఁ దీసికొని భర్తతో "దీనికీ వెఱ్ఱి యెట్లు వచ్చినదో కాని ప్రతివిషయమునందును గాంగ్రెస్సు విధానమును జొనిపియే ప్రసంగించును" అనెను.

రాజ్యలక్ష్మి "అమ్మా! కాంగ్రెస్సువారిది కేవలము న్యాయ మార్గము. వారధర్మమునకు భయపడుదురు. అన్యాయమునకు జంకుదురు. అంతే కాని యధికారులకును ప్రభుత్వమునకు భయపడి విపరీత వాక్యము లాడరు. "యదార్థవాదీ, బంధువిరోధీ" యను న్యాయము నెఱుఁగుదువా! తప్పయినను, ఒప్పయినను నిరంకుశముగా వెల్లడించుటయే వారిపని. అది తెలియక కాంగ్రెస్సువారిని విపరీతముగా భావింతురు.

అట్టావా యొడంబడిక భారతదేశమున కనర్థదాయకమని తుద కింగ్లీషువారు గూడ నంగీకరింపగా మామయ్య యెట్లు వాదించుచున్నాఁడో చూడుము. ఇట్టివారు శాసనసభలకుఁ బోవుట దేశారిష్టము కాదందువా? ఇట్టి సత్యవచనములు చెప్పిన కాంగ్రెస్సువారందువు. ఇట్టి విషయమునఁ గాంగ్రెస్సువారి దోషమేదో వెల్లడింపుము."

మం—అదేమో తల్లీ! అది నాతలకెక్కదు.

అంతలో సేవకుఁ డొకఁడువచ్చి మ్యునిసిపల్ వైస్ చెయిర్మెనుగారు దర్శనమునకై వచ్చెనని చెప్పుటచే మంగమ్మ కూతుతో లోనికరిగెను.

ఒకనాఁడు సాయంకాలము మూఁడుగంటలయినది. పేరిశాస్త్రిగారి పెరటి చావడిలో స్త్రీలు కూర్చుండి యిష్టాగోష్టిని సంభాషించుచుఁ దలకొకపని చేసికొనుచుండిరి. ఎండ వేడిమి యింకను బూర్తిగా శాంతింపలేదు. ఒకముదుసలి కాంత విస్తళ్లు కుట్టుచు గోవిందనామములు పాడుచుండెను. కమలాంబ యొకచోఁ గూర్చుండి పిల్లలకుఁ దలదువ్వుచుండెను.

ఇంతలో నొకవ్యక్తి వాసూ, వాసూ, అని పిలుచుచుఁ బెరటి చావడిలోనికివచ్చి యచ్చట స్త్రీలందఱును గూర్చుండుటచూచి సిగ్గుపడి వెనుకకుఁ దిరిగిపోవుచుండెను. కమలాంబ యదిచూచి చటాలునలేచి "బాబూ! రామారావు. రమ్ము. వెడలిపోయెద వేమి? ఇక్కడ ఘోషాపద్ధతివారు లేర"ని పిలిచెను. అదివిని రామారావు మరలి వచ్చుచు "అమ్మా? వాసుదేవరావున్నాఁడేమోయని వచ్చితినమ్మా" అని మాటాడుచు చావడిలోనికి వచ్చెను. మంగమ్మ యతనితో "ఏమి? బాబూ, చాలరోజులైనది. మనమిక్కడికివచ్చి, ఒకమారైన వచ్చితివికావుగదా" అని పలికెను.

రా—"లేదమ్మా! ప్రతిదిన మేదియో యొకపని యుండుటచే రాలేకపోతిని. వాసుదేవరావుతో నేడొక పనియున్నది. అందులకయి వచ్చితి" ననెను.

మం—"మంచిది! నాయనా! వాసు పెరటిలో నున్నాఁడటు వెళ్లు" మనెను రామారావటు వెడలిపోయెను. వర్షకాల మేఘనినాదమును విని సంతసించు మయూరివలెఁ రామారావు సంభాషణధ్వని విని సంతోషమయిమైయున్న రాజు వడుకుచున్న యేకులక్లట్లే విడిచి రామారావును జూడవచ్చెను. కాని యతఁడు పెరటిలోని కరుగుటచేఁ దదీయ

దర్శనభాగ్యము లభింపలేదు. సాయంకాలమగుటచే స్త్రీలందఱును లేచి తమ తమ విడుదుల కరిగిరి. రాజ్యలక్ష్మి కమలాంబ ననుసరించి పోయెను. కమలాంబ రాజ్యలక్ష్మిని దసగదిలోనికిఁ గొనిపోయి "ఏమేఁ రాజూ! మీవారు వచ్చినారు చూచితివా?" అనెను.

రాజ్య—అదేమి? వదినే! అట్లనెదవు. ఏమియులేకుండ నిట్లాక్షే పించుట తగునా?

కమ—ఏమియు లేదందువేమి? ఏమి కావలెను. నీవాతని ప్రేమించితివి. నిన్నతఁడు ప్రేమించెను.

రాజ్య—అవి దరిద్ర మనోరథములు. ఫలించుట యెట్లు?

క—బీజము క్షేత్రగతమైనప్పు డేలఫలింపదు?

రాజ్య—బీజారోహమునకు క్షేత్రగతమగుటయే కారణముకాదు. చాలినంత సహాయసంపదకూడ నుండవలయును. అట్లే యస్మదీయాను రాగబీజారోహమునకుఁ దగిన సహాయసంపద కావలయును.

క—దైవసంఘటన ముండినచో నన్నిసంపదలు వానియంతట నవియే కలుగును.

రాజ్య—అది పౌరుషము వదలి దైవపరులుచెప్పవలసిన మాటలు. క్షేత్రమును బాగుచేసి బీజావాపముచేయుట పురుషకారము. దానికిఁ దగిన కాలమందు వర్షముగురిసి బీజము నంకురింపఁజేయుట దైవము పని. మేము కృషీవళులవలె మాహృదయక్షేత్రము లెంత బాగుగాఁ జేసి బీజావాపము చేసికొన్నను వర్షము మొదలగు సహాయసంపద కూడ నున్నప్పుడుకాని యంకురింపదు. మాకట్టి సహాయసంపద కావలయును.

క—మీయిర్వుర యభిప్రాయము నొకరి కొకరికిఁ దెలిపి కార్యము సంఘటించువారుండవలె నందువా?

రాజ్య—అవును. వదినే! అతఁడువచ్చి నన్నుఁ దనకిమ్మని మాతల్లి దండ్రుల నడుగఁలేదు. మాతల్లిదండ్రులు నన్నతని కర్పింపఁదలంపనే తలంపరు. అతనివరింప నాకిష్టమున్నను నేనేమి చేయఁగలను. అట్టిచోఁ గార్యము ఫలించుటెట్లు?

క—నన్ను సంఘటన చేయుమందువా? ఏమి?

రాజ్య—తప్పు కానిచో, విపరీతము కానిచో.

క—ఇందుఁ దప్పేమియునులేదు. విరుద్ధమేమియునులేదు. నీస్వభావమున కనుకూలుఁడగు వరుని వరింతువు? ఇందాక్షేపణీయము లేదు.

రాజ్య—(వికసితవదనముతో) బ్రాహ్మణవంశజుఁడు సద్గుణుఁడు, విద్వాంసుఁడు, స్వాతంత్ర్యాభిలాషి, దేశభక్తుఁడు. ఇన్ని మంచిగుణము లున్నప్పుడు ధనము లేకపోయిన నష్టములేదని నాయభిప్రాయము.

క—అవును. స్థిరమగు గుణసంపదయే వాంఛనీయము. కాని చంచలమగు ధనసంపద యెవ్వరికిఁ గావలయును?

రాజ్య—నే నతనిని బ్రేమించితిని. కాని యతఁడు నన్నుఁ బ్రేమించెనో, లేదో.

క—అ ట్లెన్నటికిని గాదు. స్త్రీకులరత్నమవగు నీ వతని కేల ప్రేమాస్పదమవు కావు? "నరత్నమన్విష్యతి మృగ్యతేహితత్" అని కాళిదాసన్నాఁడు. "రత్నము వెదకబడునుగాని ధరించువానిని వెదుకదు." అని అట్లే నిన్ను వెదకుచు వారె వత్తురుకాని నీవు యత్నింపనక్కఱలేదు.

రాజ్య—నీవన్నది బాగుగా నున్నదికాని యొక్కలోప మున్నది. వారి దృష్టిపథమునఁబడ నర్హత నాకు లేదు. నేను రాజకీయోద్యోగి కూతును. అతఁడు కాంగ్రెస్సునకుఁ జెందినవాఁడు. నే నధికారి కూతును. అతఁడు సామాన్యబ్రాహ్మణుని కొడుకు. నేను ధనసంపన్నుని కూతును. అతఁడు దరిద్రుని కుమారుఁడు. మనసంఘములో

మనవారి కన్నులెప్పుడును ధనసంపన్నులందునో, యధికారి కుటుంబములందునో పడును. అంతే కాని గుణవిమర్శనముచేసి బీదకుటుంబముల ప్రక్క వాలవు. ఇంతే కాక యితఁడు కాంగ్రెస్సువాఁడు. మఱి యెట్లు ఘటించును.

క—రాజూ! నీవన్నది సత్యమే. నేను యత్నించి కార్యము ఘటింతును.

రాజ్య—సంతోషము. అతఁడు నేఁడిటకువచ్చినాఁడు, ఈతరుణము దాటినచో నీవతని జూడఁజాలవు.

క—అవును. ఈదినముననే కలిసి మాటాడెదను. పీధిగుమ్మము చెంత వేచియుందును."

రాజ్య—అట్లే చేయుమని వెడలిపోయెను.

కమలాంబ రామారావుకై ప్రతీక్షించియుండెను. నాఁడతనితో సంభాషించి కార్యమును సంఘటింప నిశ్చయించి యతఁడే చాటున నుండియైన వెడలిపోవునేమోయని యతనికై పెరటిచావడిలోనికి వచ్చుచుండెను. పెరటిలోనుండి వాసుదేవరావు రామారావుచేయి పట్టుకొని వచ్చుచుఁ తల్లితో "అమ్మా! ఈరాత్రి రామారావు మనయింట భోజనమునకుండు" నని పలికెను. "అయ్యో! అట్లే యుండనిమ్ము. అంత మంచియతిథి మనకు లభింప" దని పలికెను.

అనంతరము రామారావును, వాసును గచ్చేరీచావడిలోఁ గూర్చుండి యాంధ్రపత్రికను జదువుచుండిరి. ఇంతలో పేరిశాస్త్రి పీధిలోనుండి వచ్చి సుఖాసనాసీనుఁడై హిందువును జదువుచు "అతఁడెవ్వఁ" డని యడిగెను. మంగమ్మ భర్తను సమీపించి "అతడే నాఁడు మేమేలూరి నుండివచ్చునప్పుడు సాయపడిన రామారావను కాంగ్రెస్సువాలంటీరు. మంచిగుణవంతుఁడు. బుద్ధిమంతుఁడు. ఆనర్సు చదివి కృతార్థుఁడై నాఁడు. అతని కాపురము తుమపాల" అని చెప్పెను.

పే—ఇతనినిగుఱించియేకాదా ? నాతో మాటాడితివి.

మం—అవును. అతఁడే యితఁడు.

ఇంతలో రామారావు సమీపించి పేరిశాస్త్రిగారికి నమస్కరించెను.

పేరిశాస్త్రి యతనిని గౌరవించి కుర్చీపై కూర్చుండుమనెను. రామారావట్లు కూర్చుండియుండగా పేరిశాస్త్రి కాంగ్రెస్సువాఁడన్న కోపమొకవంక మనస్సు నాందోళింపఁజేయుచున్నను ఆంగ్లభాషా కోవిదుఁడన్న గౌరవమింకొకవంక నాదరణముచూపుచుండ "ప్రస్తుతము జరుగుచున్న కాంగ్రెస్సు విధానమేది ?" అని యడిగెను.

అప్పుడు రామారావు సుముఖుఁడై యింగ్లీషుతో కాంగ్రెస్సు విధానమంతయుఁ జెప్పెను. రామారావంతతో నూరకుండక, హిందూదేశపుస్థితులు, ప్రభుత్వవిధానము, ప్రభుత్వముచేయుచున్న పక్షపాతము, అట్టావాయొడంబడికవిషయమై ప్రభుత్వమువారొనర్చిన మోసము, అది హిందూదేశమునకనర్థదాయకమగుటయు, భారతీయార్థికదుస్థితియు, ఆవిషయమై ప్రభుత్వము చూపుచున్న యక్రమపద్ధతియు, ఆవిషయమై రాజకీయనాయకులు చేయదలచినవిషయమును వర్ణించుచు గంటలతరబడి మాటాడెను. అతని యింగ్లీషుభాషావైదుష్యమునకుఁ బేరిశాస్త్రి యాశ్చర్యపడెను. అల్పవయస్కుఁడగు నతనికిఁ దెలిసిన భారతదేశీయపరిస్థితులు చిరకాలమునుండి న్యాయాధికారియై పని చేయుచున్న తనవంటి వానికిఁ దెలియనందులకు మనస్సులో నొచ్చుకొనెను. కాంగ్రెస్సువారి విధానమంతయు న్యాయసమ్మతమైనట్లు తట్టెను. అతఁడిక వార్తాపత్రికను జదువమాని కుర్చీకిఁ దలఁజేర్చియుండెను. చెవులలో రింగురింగు మనుచున్న రామారావు వాగ్ధోరణిని సమాలోచించుచుఁ గూర్చుండెను.

మంగమ్మవచ్చి "వంటయైనది. స్నానమునకు వచ్చెదరా" యని పిలిచెను. పేరిశాస్త్రి వార్తాపత్రిక నటవిడిచి మంగమ్మవెంట స్నానమున కరిగెను.

కమలాంబ యటువచ్చి వాసుదేవరావును బిలిచి రామారావును తనగదికిఁ బంపుమని చెప్పెను. అప్పుడు వాసుదేవరావు లాంతరు పట్టుకొని "రామారావూ రా, ఇటుఁ గూర్చుండ" మని లేపెను. రామారావు లేచెను. వాసుదేవరావు రామారావును గమలాంబగదికి గొని వచ్చి "ఈమె మా పెద్దవదినె, కమలాంబ" యని చెప్పెను. కమలాంబ "వాసూ! నీవు చెప్పనక్కఱలేదు. నేనతని నెఱుఁగుదు" నని పలికి కుర్చీ వేసి కూర్చుండుమనెను. రామారావు కూర్చుండెను. చంచలబుద్ధియగు వాసుదేవరావు రామారావుతో "ఇపుడే వచ్చెద" నని చెప్పి వెడలిపోయెను.

అపుడు కమలాంబ రామారావు చెంత గూర్చుండి దేశపరిస్థితులను గుఱించియు, సంఘమందు గల్గుచున్న యాందోళనము గుఱించియు, ప్రస్తుతమున జరుగు వివాహాదులను గుఱించియు, సంభాషించి యిట్లనియె.

క—సోదరా! మీ కుటుంబస్థితిని బూర్తిగాఁ జెప్పినావు కావు. నాఁడు ఆరంభించితివి. కాని రైలును కదలిపోవుట ముగింపలేక పోతివి.

రా—అమ్మా! అధమాధమమైన నాకుటుంబస్థితి నేమని చెప్పుదును.

క—నీ తల్లిదండ్రులు జీవించియున్నారా?

రా—అవునమ్మా.

క—మీ రెంద ఱన్నదమ్ములు?

రా—నే నొక్కడనే నమ్మా!

క—ఆడుతోఁబుట్టువులు కలరా?

రా——కలరు.

క——ఎందఱు ?

రా——ముప్వురు.

క——అందఱకును వివాహములైనవా ?

రా——వివాహము లగుటయే కాదు. ఇరువురు వితంతువు లయి నారు.

క——రామ. రామ. ఎంతకష్టము. ముక్కుపచ్చలాఱని యాడు పిల్లలకుఁ బెండ్లిండ్లు చేసినచో నిట్టి యాపదలు తప్పవు.

రా——అవునమ్మా ? ఏమి చేయఁగలము.

క——సోదరా ! వయస్సు మీఱుచున్నను నీవు వివాహము చేసి కొనలేదేమి ?

రా——లేదు.

క——కారణమేమి ?

రా——నా వంటివానికి వివాహమగుట యెట్లమ్మా ?

క——ఎందుచేత ?

రా——నేను గర్భదరిద్రుఁడను. మా శాఖలో శుల్కము పుచ్చు కొనకుండఁ గన్యల నియ్యరు. శుల్కమిచ్చుటకు ధనమేదీ !

క——నీ వానర్సు చదివి కృతార్థుఁడవైతివి ? నీ కుచితముగాఁ బిల్ల నిచ్చి వివాహము చేయువారు లేరా !

రా——పూర్వమట్లు జరిగెడిది. ఉద్యోగములు లేకపోవుటచే జదువు విలువతగ్గినది. ధనసంపన్నునకైనను బిల్లనిచ్చెదరు. శుల్కమిచ్చిన వారికైనను బిల్లనిచ్చెదరు. నేనా రెండుతరగతులకును జేరనివాఁడను.

క——పోనిమ్ము. ఉచితముగాఁ గన్యనిచ్చినఁ బెండ్లాడుదువా ?

రా——వలదమ్మా.

క——అదేమి ? అట్లందువు.

రా—నాకుఁ బూర్వులార్జించిన ధనమింతేనియును లేదు. నే నార్జించువాఁడను కాను. ఇట్లుండ పెండ్లిచేసికొనినఁ బెండ్లమునకుఁ దిండి యైనను బెట్టవలదా?

క—(నవ్వుచు) ధనసంపన్నురాలగు కన్యక లభించినచో వరింతు వన్నమాట!

రా—ఈ దరిద్రున కంత యదృష్టమా?

క—అదృష్టము పట్టిన దనుకొందము. అట్టికన్యక నిచ్చిన స్వీక రింతువా!

రా—అట్లే. కాని వా రెవ్వరో చెప్పుమా!

క—మా మఱదలు రాజ్యలక్ష్మి.

రా—అట్లయినఁ గొనసాగనిది.

క—ఏమి?

రా—ఆమె యువతి. ఆమెను నేను వివాహముచేసికొన్న మా కుటుంబమునకు వెలియౌదును.

క—అది నీ వనఁదగినమాట కాదు. సంఘమంతయును సంస్కార ణములలో మునిఁగియున్న యిక్కాలమున నవనాగరకుఁడగు విద్వాం సుఁడిట్లనుట చూడ దేశమునకును, సంఘమునకును మంచిదినములుపట్ట లేదనుట.

రా—పోనిమ్ము. అందుల కంగీకరించితి ననుకొమ్ము. ఆమె వెల నాఁటిపిల్ల! నేను ద్రావిడిని. ఇది యెట్లు?

క—ఇదియును వెనుకటి దానివంటిదే! నీ వాలోచింపక పూర్వా చారపరాయణునివలె మాటాడితివి. శాఖాంతరవివాహము తప్పుకాదు. వర్ణాంతరవివాహములకు సుముఖమైన యిక్కాలమున నీ విట్లనుట శోచనీయము.

రా—గర్భదరిద్రుఁడను.

క—దారిద్ర్యము స్థిరముకాదు.

రా—ఆమె ప్రభుత్వోద్యోగి కూతురు. నేను కాంగ్రెస్సు వాదిని.

క—అందుచేతనే మాలక్ష్మికి వరణీయుఁడవయితి.

రా—అమ్మా! నన్నెందులకు దురాశాసముద్రమున ముంచెదవు. నా కామెవంటి కన్యక వేయితపస్సులుచేసినను లభించునా? ఒకవేళ నామె నన్నుఁ బ్రేమించినను, తల్లిదండ్రు లంగీకరింపవలదా? తల్లిదండ్రుల యిష్టమును ధిక్కరించి యామె నన్ను వరింపఁగలదా! ఎందులకు సాగనియత్నములు.

క—సోదరా! ఆ సందియము లన్నియు విడువుము. మా మఱఁదలు నిన్నుఁదప్ప నితరుని వరింపనని పట్టుపట్టినది. అంతటి దృఢానురాగము లోకమున నరిది. అది నిజముగా నీ పూర్వపుణ్యము. సద్గుణవతి, ధనవతి, విద్యావతి, నిష్కల్మషహృదయముతో నిన్నుఁ బ్రేమించినది. ప్రేమించుటయే కాదు. తల్లిదండ్రు లెంతబోధించినను వినలేదు. సావిత్రిని దల్లిదండ్రు లేమిచేయఁగల్గిరి? అట్లైయైనది. తల్లిదండ్రులు నిశ్చయించిన ధనసంపన్నుల సంబంధములు త్రోసిపుచ్చినది. నిన్ను నమ్ముకొని యున్నది. నీతోఁగలిసి దేశసేవచేయఁ గుతూహలపడుచున్నది. అట్టియువతి నర్థాంగిగా స్వీకరించుటకు మాఱుగా నీవు శాఖాంతరత్వమును, నిర్ధనత్వమును సాకుచెప్పి యీశుభమునకు విముఖుఁడవగుట కూడనిపని. నీ వింకను బూర్వాచారపరాయణునివలె మాటాడుట నాకుఁ జాల యాశ్చర్యమొదవించినది. దేశమంతయు సంస్కరణములలో మునిఁగియున్న యీకాలమున యువతీవివాహము తప్పనియు, శాఖాంతరవివాహము గర్హ్యమనియు బల్కుట మిక్కిలి హాస్యాస్పదము. పెక్కేల? నీ విట్టి కుత్సితపు టూహాలకుఁ దావిచ్చి యుత్తమకాంత యుసురులు పుచ్చుకొందువా? లేక నవనాగరకునివలె

వర్తించి యామెను వరించి లోకమున నభ్యుదయము గాంతువా? చెప్పుము. చెప్పుము.

రా—అక్కా! సిరి రా మోకాలొడ్డువారు గలరా? అట్టి యువతి నా పూర్వపుణ్యమువలన లభింప వలదందునా! ముందుముందు కష్టములు తొడరునేమో యని య ట్లంటిని.

కమ—నీ వట్లు భయపడకుము. భార్యాభర్త లేకమనస్కులై ధైర్యవంతులై వర్తించినచో లోక మంతయు నొక్కటి యయ్యు నేమియుఁ జేయఁజాలదు. నీవు దృఢమనస్కుఁడవై మాట యిచ్చినచో సర్వమును సమకూర్చెదను.

రా—సరియే. అట్లే కానిమ్ము.

కమ—త్రికరణశుద్ధిగాఁ జెప్పుము. మఱి తిరుగరాదు సుమా!

రా—రామారావు నోట రెండవ మాట రాదు.

కమ—సంతోషము. సోదరా? నేటికి మరల సీతారాములవంటి యుత్తమ దాంపత్యము కూడినది. నీయం దంతరక్తురాలగు యువతిని వరింపకపోవుట న్యాయము కాదు. మఱియు నీవు చూపిన నిర్బంధము గణనీయము కాదు. యువతీ వివాహము గర్హ్యము కాదు. ధర్మశాస్త్రము లంగీకరించుచున్నవి. ఇప్పుడు జరుగు వివాహము లించు మించుగా రజస్వలా వివాహములే. ఏమందువా? పదివత్సరములు దాటిన కన్యక రజస్వల యని ధర్మశాస్త్రము. పదియేండ్లు దాటిన కన్యలకే యిప్పుడు వివాహములు జరుగుచున్నవి. అట్టిచో మీ వివాహము గర్హ్య మెట్లగును.

రా—నీ వన్నది సత్యమే.

కమ—మఱియొక సంగతి. శారదాశాసనము స్థిరపడినది. ఇఁక ముందు కావలసిన వివాహములు పదునాల్గేండ్ల పిల్లలకే కావలయును. అట్టిచో నీ కిది యెట్లయినను దప్పదు. అందుచే నీ వరమరలేక రాజ్య

లక్ష్మిని వరింపుము. విద్యావంతురాలై యనురక్తురాలై, నీవలె దేశ భక్తురాలై, ధనసంపన్నురాలైన యువతి లభించుట సామాన్యము కాదు.

రా—సత్యమే. కాని కాంగ్రెస్సువారికి ద్రావ మంచినీళ్లిచ్చినంత మాత్రముననే దండితులై కారాగృహముల పాలయినప్పుడు, కాంగ్రెస్సు వానికి గన్యక నిచ్చినచో నేమి జరుగునో చెప్పవలయునా? నా నిమిత్తము జడ్జీగారు ఆపదల పాలు గావలసి వచ్చునేమో?

కమ—అగుఁగాక. దానికి నీ వేమి చేయఁగలవు?

రా—వివాహ మంగీకరింపకపోవుటయే?

కమ—అందువలన నుత్తమ యువతి మరణించునే! ఆపద్రక్షణము కంటెఁ బ్రాణరక్షణ ముత్తమము.

రామారావు ఊరకుండును.

కమ—రామారావు! ఇందు నీ దోష మేమియును లేదు. నిన్నుఁ బ్రేమించిన నిష్కల్మషహృదయురాలిని త్రికరణశుద్ధిగాఁ బ్రేమించి పెండ్లియాడుము. యువతీ ప్రాణరక్షణమునకు నీ విట్లు చేయక తీఱదు. ఎవ్వరికిఁ గల్గిన కష్టములు వారే తొలఁగించుకొందురు. నీ కేల? మీ తల్లిదండ్రులను గూర్చి చెప్పితివి. వర్ణాంతరవివాహములును, రజస్వలావివాహములును బ్రబలిన యికాలమున శాఖాంతరవివాహ ములను గూర్చియు, యువతీవివాహములను గూర్చియు సమ్మతింపని వారు వెట్టివారు. నీ కెప్పుడైనను యువతీవివాహము తప్పనియప్పు డిట్టి మంచి సంబంధము నేల వదలుకొనవలెను.

రా—సోదరీ! నీవు చెప్పినది సత్యము. నీ యుక్తులకుఁ బ్రత్యుక్తు లను జెప్పలేను. నీ యాజ్ఞకు బద్ధుఁడను. న న్నేమి చేయుమందువు. చేసెదను.

కమ—మా రాజ్యలక్ష్మిని వివాహ మాడవలెను.

రా—అట్లే.

కమ—సాంఘికముగా గాని వేఱొక విధముగాఁ గాని యెట్టి చిక్కులు వచ్చినను, రాజ్యలక్ష్మిని విడువనని ప్రమాణము చేయవలెను.

రా—అట్లే చేసెదను. కాని నేను దరిద్రుఁడను. అవి లేవని యివి లేవని నిందించిన నేను భరింపఁజాలను.

కమ—అంగీకరించుట తప్ప వివాహము విషయమై యొక దమ్మిడీ నీవు తేనక్కరలేదు.

రా—మంచిది.

ఇంతలో వాసుదేవరావు వచ్చి రామారావును భోజనమునకుఁ గొనిపోయెను.

రామారావుతో సంభాషించిన నాఁటిసాయంకాలము పేరిశాస్త్రి కచ్చేరీనుండి వచ్చి చావడిలో సుఖాసీనుఁడయియుండ మంగమ్మ కాఫీ పట్టుకొనివచ్చి యెదుట బెట్టి సమీపమునఁ గూర్చుండెను.

పే—మంగా! విశేషములేమి?

మం—ఏమియును లేవు. కాని నిన్నరాత్రి రామారావు చాల ప్రసంగించినట్టున్నది?

పే—అవును. వయస్సునఁ జిన్నవాఁడే కాని ఆంగ్లభాషాపాండిత్యమునందును, లోకజ్ఞానమందును నిరుపమానుఁడు.

మం—అంతేకాదు. పరోపకారమందును, సద్గుణములందును, మేధాసంపదయందునుగూడ నిరుపమానుఁడే.

పే—(నవ్వుచు) దారిద్ర్యమునందుఁ గూడ నిరుపమానుఁడేయఁట!

మం—దానికేమి లెండు. దారిద్ర్యమునకు నిలుకడ లేదుగదా? మన రాజ్యలక్ష్మి యతనిని ప్రేమించినది. దానిబుద్ధిని మరలింప మాకు వశముకాలేదు. సద్గుణుఁడు. విద్వాంసుఁడు. బుద్ధిమంతుఁడు. దేశభక్తుఁడు. స్వాతంత్ర్యాభిలాషి. యిట్టిభర్త లభించెనని మనపిల్ల మురిసిపోవుచున్నది.

పే—నీ యభిప్రాయమేమి?

మం—మాసంఘపద్ధతులనుబట్టి నేను మాఱుచెప్ప వీలులేదు. మీ కీవరుఁడు నచ్చినాఁడా!

పే—లేకపోయిన మాత్రము నేనేమి చేయఁగలను. త్రికరణశుద్ధిగా వరించుకొన్న లక్ష్మి మనోరథమును వ్యర్థము చేయఁగలనా? వివాహము విషయమై పిల్లలకు స్వేచ్ఛ యియ్యరాదని నేను మొదటి

నుండియుఁ జెప్పుచున్నాను కాదా? ఇంతకును లక్ష్మి వర్ణాంతరుని గోరికొనలేదు. మన మదృష్టవంతులమే?

మం—ఏమి యదృష్టవంతులమో! బాబును వరింపలేదని మీాయమ్మ గారికిఁ గోపము. శాఖాంతరుని వివాహము గావించుకొని లక్ష్మి బులుసువారి వంశకీర్తులు నశింపఁజేసినది. యిట్టి యకార్యమును జూచి నేను సహింపలేను. రాజ్యలక్ష్మి రామారావునేవివాహముచేసికొన్నచో ఏ నూతిలోనోపడి చచ్చెదనని మీాయమ్మ పట్టుపట్టినది. ఏమగునో!

పే—(నవ్వుచు) పూర్వాచారపరాయణుల పట్టుదల లట్టివే. ఒక మాఱు మాయమ్మ నిక్కడికి రమ్మనుము.

మంగమ్మ వెళ్లి యత్తగారిని దీసికొనివచ్చెను. సరసమ్మ సర్వకాల సర్వావస్థలయందును ఈ వివాహమునకు భంగము గల్గించుటకే యోజించుచున్నది కాన యల్లంత దూరమునుండియే వలవలయేడ్చుచు "ఈ దుష్కాలములో జీవింపరాదు. ఆయనతోఁబాటునేనును మరణించిన నిట్టి విపరీతములు నాకనులఁ బడకపోవునుగదా! పాలవలె నిష్కల్మషమైవచ్చిన బులుసువారి వంశమున కీనాటి కీతుచ్ఛులవలన నిట్టి దుష్కళంకము సంభవించినది. మొదట వీని కింగ్లీషు నేర్పింపవలదని యెన్నోవిధముల యేడ్చి చెప్పినాను. నా సోదరులది వినక వీని కింగ్లీషు చెప్పించినారు. పోనిమ్ము. మాపేరయ్య చదివినను ఆచార సంపన్నుఁడై యుండుటచే విచారము లేకపోయినది. వాఁడిప్పుడు పెండ్లము మాటలకు లొంగిపోయి యది చెప్పినట్లుచేసి ముదుసలినైన నాకుఁ బలు దుఃఖములు కల్గించుచున్నాఁడు, ఏమిచేయుదును? ప్రారబ్ధ మనుభవింపక తీఱునా?" అని మనస్సులో గొణుగుకొనుచు వచ్చెను.

పే—అమ్మా! ఏమి గొణుగుకొను చున్నావు?

స—నీవంటి కొడుకు, అట్టి కోడలు నాకుఁగల్గ నాఁబ్రతుకునకు సుఖమెక్కడ నాయనా?

పే—తల్లీ! నీవు కోపింపక, దుఃఖింపక చెప్పవలసిన మాటలు చెప్పుము.

స—మాటలు చెప్పిన లాభమేమి? నీవు వినుదువా? నీభార్య విన నిచ్చునా?

మం—అత్తయ్యా! అదేమండీ? ఇట్లందురు. నేనేమి చేసితినండీ.

స—నీవు, నీకోడలు కలిసియే యీ ప్రళయమంతయుఁ దెచ్చి పెట్టితిరి.

పే—తల్లీ! చెప్పవలసినది చెప్పుము.

స—రాజ్యలక్ష్మిని బాబునకిచ్చి పెండ్లి చేయుము. అంతకట్న మిచ్చుకొనలేనప్పుడు దానిని మఱియొక నెలనాటి పిల్లనికిచ్చి పెండ్లి చేయుము. లేనిచో నీదురంతము చూడలేక మరణించెదను.

పే—తల్లీ! రాజ్యలక్ష్మికి ఈడువచ్చినది. బాగుగా జదువుకొన్నది. లోకజ్ఞాన సంపన్నురాలు. లోకపరిస్థితులు చక్కగా నెఱిఁగినది. అట్టిది తనకిష్టుఁడైన వరుని వరించుకొనఁగా వలదనుటకు మన మెవ్వరము.

స—(చేతులు త్రిప్పుచు) తెలిసినదా! నేనందులకే నీచెవి నిల్లు గట్టుకొని పోరాడితిని. పిల్లకు వేగముగా వివాహము చేయుమని. నీవు నీ పెండ్లము పడనిచ్చినారా? దాని కింతలేసి కొమ్ములిచ్చినవారు మీరే? మొక్కై వంగనిది మ్రానై వంగునా? మీవంటి దురాచారుల వలన పాలవంటి కులము దుష్కళంకమైనదని యేడ్చుచున్నాను.

పే—అమ్మా! లోకపరిస్థితు లాలోచింపకున్నావు. మమ్ము నిందించిన లాభమేమి?

స—కారకులయిన మిమ్ము నిందింపక మఱెవరిని.

పే—మేమేమి చేయుదు మమ్మా!

స—రాజునకుఁ జిన్నతనములోఁ బెండ్లిచేసిన యింత వచ్చునా?

పే—దానికిఁ జదువో!

స—నేను జదువుకొనక పోయిన నాకువచ్చిన లోపమేమి!

పే—అమ్మా? కాల మెుక్క రీతిగా నుండునా? మీకాలము వేఱు! ఇప్పటి కాలము వేఱు.

స—అదేమన్నమాట! కాలమెప్పుడు నొక్కటియే. మీవంటి దురాచారులవలన నిట్టి దురంతములు జరుగుచున్నవి.

పే—అమ్మా! నీవు పొరపడుచున్నావు. బ్రాహ్మణులందఱు నొక్కటి. బ్రాహ్మసంఘములో యజుశ్శాఖ, ఋక్శాఖ, సామశాఖ యను భేదములు మాత్రము కలవు. ఆశాఖలవారు అందఱును బరస్పరసంబంధములు గావించుచున్నారు. అది దోషముగా ధర్మశాస్త్రములు చెప్పలేదు. మఱియు ధర్మశాస్త్రములలో నా డీభేదము లేనే లేదు. మన రా జెంచుకొన్న రామారావు ద్రావిడి. మనము వెలనాటి వారము. వారిది యజుశ్శాఖ, మనదియు యజుశ్శాఖయే. ఇందేమి తప్పునులేదు. అవియన్నియు నూహించియే నే నాసంబంధమున కంగీకరించియున్నాను.

సర—ఎందులకు నాయనా! ఈ వేదాంతములు. నీతండ్రి తాతల కెవ్వరికిని దెలియదందువా? వారెవ్వరైనను శాఖాంతరవివాహములు చేసినారా? పెండ్లము చెప్పినట్లు చేయక నీకుఁ దప్పినదికాదు. అట్లనక వేదాంతము మొదలు పెట్టితివి. పోనీ! ఏమి చేయుదును.

పే—తండ్రితాతలు చేయని పనులేవియుఁ జేయరాదందువాయేమి? నాతండ్రియుఁ దాతయు నుద్యోగము లెరుగరు. నేఁ జేయుచున్నాను.

సర—అందులకే విచారించుచున్నాను. ఉద్యోగములు చేయక పోయిననేమి? నీ తండ్రితాతల కేమి కొదువవచ్చినది. నీవు ఒక విశాఖపట్టణమందే ప్రభుత్వోద్యోగులలోనే పేరొందితివి. నీతండ్రితాతలా సేతుహిమాచలము పేరొందిరి.

పే—అమ్మా! పేరు ప్రతిష్ఠకు నేను జెప్పలేదు. ఆచారవ్యవహారములు మాఱుచున్నవని చెప్పితిని. అట్లే సాంఘికధర్మములు మాఱవచ్చును. బ్రాహ్మణశాఖలవా రందఱును బరస్పరమును సంబంధములు చేసికొనవచ్చును. దోషములేదు. ధర్మవిరుద్ధము కాదు.

స—నాయనా! నీకు నీ పెండ్లమునకు విరుద్ధముగా నేదియుఁ దోపదు. నా ప్రారబ్ధము నా కంటికి విరుద్ధముగా నున్నది. మీ యిష్టము వచ్చినట్లు చేసికొనుఁడు, ఇఁక నే నిట నుండను. కాశీనగరము పోయి యక్కడ నుందునని గోపముతో నేమియో సంభాషించుకొనుచు వెడలిపోయెను.

పే—పెద్దది. మూర్ఖురాలు. మనమన్నది దానికి బోధపడదు. ఇది యొక చిక్కువచ్చినది.

మం—ఏ చిక్కులును లేవు! పెద్దదని, మూర్ఖురాలని పిల్లదాని శ్రేయస్సు చెడగొట్టు కొందుమా!

పే—చూడు మంగా! మఱియొక చిక్కున్నది.

మం—ఏమిటి?

పే—అతఁడు సహాయనిరాకరణవాది, మనము ప్రభుత్వోద్యోగులము. మనము పెండ్లిచేసినచో దొరతనమువారు శిక్షింతురేమో.

మం—ఒకటి చేయుదము. మన పిల్లనైనను మీ తమ్ముఁడుగారికిఁ బెంపుడిచ్చినట్లు నడిపింతము. ఆయనయే కన్యాధారవోసి సింహాచలములో నేకరాత్ర వివాహముచేయును. పెండ్లికి మనము వెళ్లనేవలదు. ఇట్లు మనమా వివాహముతో సంబంధములేనట్లు నటింతము. అప్పుడు మనకెట్టి కష్టములును రావు.

పే—ఇప్పటి కిప్పుడట్టికల్పనము విశ్వాసార్హమగునో, కాదో! అయినను వివాహాదికమంతయు నీవు చెప్పినట్లే చేయుదము. అప్పటికిని ప్రభుత్వమువారు బాధించిన ననుభవింతము.

మం—ఇంక నోరుయేదు మీరు పనిచేసినగాని నిండైన విశ్రాంతి వేతనము రాదు కాంబోలు!

పే—పోనిమ్మ! ఎంతవచ్చిన నంతే చాలును.

మం—ఊరకుండుము.

పే—మనపిల్లను వరించుటకు వరుఁడిష్టపడెనా?

మం—ఇష్టపడ కేమి?

పే—నీది మొదటినుండియు మొండివిశ్వాసము, మనరాజునుగూర్చి చెప్పినప్పుడెల్లను ఏదో మసిపూసి మారెడుకాయను చేసితివి. తుదకెట్లయినదో చూచితివా?

మం—అది యట్లుకాదు.

పే—అతఁడు ప్రస్తుత మిష్టపడెననుకో! మన బ్రాహ్మణసంఘములో నింకను యువతీవివాహములు బాహాటముగా జరుగలేదు. రామారావు తల్లిదండ్రులు పూర్వాచారపరాయణులని విన్నాను. తల్లిదండ్రుల నిర్బంధముచే వివాహమునకు సిద్ధపడియు విముఖుఁడై వెడలిపోయిన మనకెంత యప్రతిష్ఠవచ్చునో యెఱుఁగుదువా!

మం—ఆ సంశయములు మీరు పడవలదు. మన కమల యతనితో మాటాడి సర్వము సన్నద్ధము చేసినది.

పేరిశాస్త్రి మఱునాఁడు సిద్ధాంతులను రప్పించి ముహూర్తము నిశ్చయము గావించెను. సింహాచలములో వివాహము చేయ నిశ్చయింపఁబడెను. పేరిశాస్త్రిగారు మిక్కిలి పలుకుబడి గలవారగుటచే గుమాస్తాల సాయమున సర్వము సమకూర్పబడెను. సాయంకాలము భుజించి పెండ్లివారు రెండుబస్సులపై బయలువెడలిరి. మంగమ్మ, రాజు కమలాంబయుఁ బుష్పవేణియు దమ మోటారుబండిలో బయలుదేరిరి. ఉభయపక్షముల వ్యయమును భరించి పేరిశాస్త్రిగారతివైభవముతో రాజ్యలక్ష్మి రామారావులకు వివాహముగావించిరి.

తుమపాలగ్రామము మా చదువరుల కపరిచితముకాదు. అది కుగ్రామ ముకాదు. కాని పట్టణమును గాదు. అందు బ్రాహ్మణవీధిని శివావధానికిఁ బిత్రార్జితమగు చిన్న తాటాకులవాస యిల్లుకలదు. అందొక గదియు, దాని ననుసరించి చావడియుఁగలవు. వంటకు వేఱే ప్రక్క గదిగలదు. అక్కడ వంటచేసికొని గదిలోనే భుజించుచుందురు. భోజనానంతర మది పడకగదిగా మాఱును. ఆ కుటుంబము వారు సర్వదా చావడిలోనే వసింతురు. శివావధాని వితంతుకుమారిక లిరువురును గతిలేక యచ్చటనే యుండిరి. ఆఱుగురు పిల్లలతల్లియయిన, పెద్దకూతురు గూడ నత్తింటఁ దినతిండిలేక పుట్టినింటికి వచ్చియుండెను. ఇట్లు శివావధానియిల్లు మిక్కిలి యిఱుకటమై, నిలువఁబడుట కైన నవకాశము లేక యుండెను. ఇంతేకాక శివావధాని భార్యకుఁగాని కూఁతులకుఁ గాని వలసినంత లోకజ్ఞానములేదు. ఆ యిఱుకుటింటిలో నెక్కడి వస్తువు లక్కడ నుండక విడజల్లి నట్లుండుటచే మఱింత పాడుగా గానవచ్చుచుండెను. శివావధాని కూతులు సర్వదారోగగ్రస్తురాండ్రవలె మంచములపై పండుకొనువారే కాని యేవస్తువులను సరిగా నుంచుతలంపు గలవారు కారు. నిర్వ్యాపారులై యుండువారికిఁ జీలికయ్యములు తప్పవు. ముదుసలితండ్రి ముష్టియెత్తి తెచ్చుచుండ ముదుసలితల్లి వండిపెట్టుచుండగాఁ గూఁతుండ్రు ముగ్గురును చావడిలో పండుకొని చీలికయ్యము లాడుచుందురు. పెద్దకూతురు పిల్లలందఱును జిన్నవారగుటచే సర్వదా కలహించుకొని కొట్టుకొని యేడ్చుచుందురు. అట్టిసమయములందుఁ దల్లిచూచి యూరకుండునే కాని యింతయును వారింపదు. సర్వదా సోమరులై వారు గృహకృత్యముల జోలికిఁబోవక

వర్తింతురు. తల్లికూతులకు సంభవించిన విపత్తున కేడ్చుచు వారిచేఁ బనిచేయింపకుండెను.

ఒకనాఁ డప్పచెల్లెండ్రు ముగ్గురును గూడిగూర్చుండి కలహించుచుండిరి. ఆకలహకారణమిది. తొలినాఁటి రాత్రి గంగమ్మ మైలబట్టతో సంట్లు ముట్టుకొన్నది. అట్లు చేయలేదని గంగమ్మ వాదము. నీవలన సంటిలో కేవలము మైలకూడె తినవలసి వచ్చుచున్నదని కాంతమ్మ సత్తెమ్మలు వాదించుచుండిరి. అది క్రమముగాఁ బెరిగి, పలువిధముల తిట్టుకొన సాగిరి. తల్లివచ్చి వారించినను వారు కలహము మానలేదు. ఇది యిట్లుండగా కాంతమ్మ పిల్లలొకరి నొకరు కొట్టుకొని యేడ్చుచుండిరి.

ఇట్టి సమయమున మహాధ్వనులచే దిక్కుల బిక్కటిల్లఁజేయుచు మోటారుబండివచ్చి శివావధాని యింటిముందు నిలిచినది. అది చూచి శివావధాని కుమారికలు మనుమలును నిశ్చేష్టితులై కలహములు, ఏడ్పులు, పెడబొబ్బలు విడిచి కిక్కురుమనకుండిరి. ఇంతేకాదు. బండి నుండిదిగిన రామారావును గాంచి పిల్లలు "మామయ్య, మామయ్య" అని కేకలిడుచు బండిచెంతకుఁ బర్విడిరి. రామారావు విన్నదనముతో రాజ్యలక్ష్మితోఁగూడ చావడిలోనికివచ్చి యచ్చటనున్న వస్తువుల నొకమూలకుఁజేర్చి చోటుగావింప డ్రైవరు పెట్టెయుఁ బరుపును, మఱి కొంత సామానును దెచ్చిపెట్టెను. రాజ్యలక్ష్మి సామాను సరిపుచ్చు చుండ "లక్ష్మి! నీవు నిజముగా మోసపోయితివి. కూర్చుండుటకుఁ జోటయినను జూపఁజాలని నిరుపేదను బెండ్లాడితి" వనెను.

రాజ్య—"నాథా! మీరా విచారమును బూర్తిగా విడువవలెను. నేనేమియు మోసపోలేదు. నేను మీధనసంపదలను దివ్యభవనములను జూచి వరింపలేదు" అనెను. పిల్లలు మోటారుబండియెక్కి మిక్కిలి యల్లరిచేయుచుండిరి. రాజ్యలక్ష్మి డ్రైవరునిఁబిలిచి పిల్లల నెక్కించి కొంచెము దూరము త్రిప్పుకొనిరా నాజ్ఞాపించెను. అతఁడు పిల్ల

నెక్కించి బండి నడిపించుకొనిపోయెను. అవధాని కూతుండ్రు చిరకాల మునకుఁ దమ సోదరుఁడు వచ్చినట్లు తెలిసియు నీక్రొత్తయువతినిజూచి లోపలికరిగిరి కాని యెక్కనును బల్కరింపరైరి. అంతేకాక గంగమ్మ యనెడి వితంతువు "అమ్మా? అన్నయ్య బోగపుదానిని దీసికొని వచ్చినా" డని చెప్పెను. అదివిని యచ్చెరువడుచు జాలియుఁ జాలని తడిపంచె కట్టుకొని వండుచున్న నరసమ్మవచ్చి తొంగిచూచి దేవకాంతవలె నున్న యకాంతనుగాంచి నివ్వెఱపడి యాబట్టతో నామెచెంత కరుగ సిగ్గుపడి "రామా?" అని పిలిచెను.

రామారావు లోనికరిగెను.

నర—అబ్బాయీ! ఆమె యెవ్వరు?

రా—అమ్మా? నీకోడలు.

గం—అన్నయ్యా! అది సంసారియా సానిదా?

రా—చెల్లీ! నాభార్య! నీవేమనుకొన్నను సరే.

న—చెట్టంత యున్నను వాలుజడ వేసికొన్నది. సానిదియే కావలెను.

గం—అంతతోనైనదా! అరమర సిగ్గులేకుండఁ బట్టపగలు మగనితో మాటాడుచున్నది.

నర—(కూతులను దిట్టి వారించి) అబ్బాయీ! వృత్తాంతము చెప్పువరా!

రా—అమ్మా! విశాఖపట్టణపు జడ్జీగారి కూతురు. బాగుగా జదువుకొన్న విద్యాంసురాలు. మంచి ధనసంపన్నురాలు. ఆమె తనంత తాను ప్రేమించి నన్నుఁ బెండ్లియాడినది.

గం—బిడ్డల తల్లివలెనున్నది. ఇప్పుడా పెండ్లి చేసికొన్నది.

రా—అవును. ఇప్పుడు చిన్నపిల్లలకు వివాహములు చేయరాదు. అందుచే నీడేటి పెండ్లి చేసికొన్నది.

గం——క్రొత్తకుండ మంచిదేకాని కుక్క ముట్టుకొన్నది.

రా——(కోపముతో) ఓసీ. వెఱ్ఱిముండ! నోటికివచ్చినట్లుఅవకుము. గతిలేనప్పుడాకుండనే వాడుకొందురు.

నర——(గంగమ్మను గసరించి) అబ్బాయీ! ఊరివారు మనలను బహిష్కరింపరు గదా?

రా——అంతటను బాహాటముగా నీ వివాహములు జరుగుచుండ బహిష్కరించువా రెవ్వరమ్మా!

నరసమ్మ వంట యింటిలోని కరిగెను.

రా——(రాజ్యలక్ష్మిని లోనికిఁ గొనిపోయి) "ఈమె నాజనని" యని చూపించెను.

రాజ్యలక్ష్మి నమస్కరించెను.

రా——"ఈమె నాపెద్దక్కగార"ని కాంతమ్మను జూపెను.

రాజ్యలక్ష్మి ఆమె పాదములకు నమస్కరించెను.

రా——వీరు. నాచెల్లెండ్రు. చిన్నతనముననె భర్తలు చనిపోవుటచే వితంతువులై యిచ్చటనున్నారు.

రాజ్య——(ఇంగ్లీషుతో) "చూచితిరా" "అందుచేతనే బాల్యవివాహములు వలదని పెక్కండ్రు వాదించుచున్నారు." అనిపలికి వారినిరువురను చెఱియొకచేతితోను గౌఁగలించుకొని బంధుప్రేమను వెల్లడించెను. ఇంతలో నెవ్వరో చూడవచ్చినందున రామారావు భార్యతో జావడిలోనికివచ్చి కూర్చుండి ప్రసంగించుచుండెను.

రాజ్యలక్ష్మి వినయమునకుఁ దల్లియుకూతుండ్రును మిగుల నాశ్చర్యపడిరి. వారిభావములు మార్పుచెందినవి.

నర——(కూతుండ్రతో) అబ్బా! ఎంతవినయమే. ఎంతమర్యాదయే.

కాం——అవునమ్మా! ఆ వేషముచూడగా మనతో మాటాడునో మాటాడదో యనుకొన్నాను.

నర—అట్టియున్నతే వంశసంభవురాలికి, ఉత్తమత్వమేల కలుగదు ?

తుమపాలలో రంగమ్మయను బ్రాహ్మణ వితంతువుగలదు. ఆమె కొంచెము చదువుకొన్నది. ఆమె దివ్యజ్ఞాన సమాజమునకుఁజెంది సంఘ సంస్కరణమునకై పాటుపడుచున్నది. యువతీవివాహములే ముఖ్యముగాఁ గావలయునని వాదించువారిలో నామెయొకతె. ఆమె రాజ్యలక్ష్మినాదరించి వృత్తాంతమంతయుఁ దెలిసికొని సంతోషముతో లోపలికరిగి "నరసమ్మా! నీ వెంత యదృష్టవంతురాలవో చెప్పఁజాలను. కేవలము మహాలక్ష్మియేనీకుఁ గోడలై వచ్చినది. అదృష్ట మట్లుత్రోసికొని రావలెను" అని యన్నది.

నర—మీవంటి పెద్దలయాశీర్వాదమమ్మా!

గం—ఏమి ? యదృష్టము ! కుక్కముట్టుకొన్న కుండ ?

రం—(కుపితురాలై) ఓసీ! ముడుకుముండ! నీబ్రతుకున కాక్షేపణము లెందుకు ? కురూపీ, కురూపీ! ఎందుకుఁబుట్టితివనగా సురూపములను వెక్కిరించుటకని యన్నదట! అట్లున్నది నీయవస్థ! అవును గర్భదరిద్రులకట్టి కాంతయా ?

నర—రంగమ్మా! ఊరకుండుముతల్లీ! చిన్నది. దానికేమి తెలియును.

రం—"తెలియనిది తెలియనట్టు లుండవలెను. అంతేకాని, "పిట్ట చిన్న, కూతఘనము" అన్నట్లు ఆపెడసరపు మాటలేల! నరసమ్మా! నిజముగాఁ జెప్పుచున్నాను. వినుము. నేటితో మాశివన్నకష్టములు— శివన్నకష్టములేకాదు, శివన్నకుటుంబపు కష్టములన్నియు గతించినవి" అని చెప్పి చావడిలోనికివచ్చెను.

మఱిరెండు గడియలగునప్పటికి ఊరంతయువచ్చి యచ్చట నిలిచినది. ప్రజలిట్లు గుమిగూడుటకు మొదటికారణము యువతీవివాహము, రెండవది నిరుపేదయగు శివావధానికి ధనసంపన్నురాలగు కోడలు

లభించుట. మూడవది రాజ్యలక్ష్మి లోకాతీత సౌందర్యవతియగుట. అందుచేఁ బ్రజలు క్రిక్కిరిసియావింతను జూచుచు నాయెండలో నిలువఁబడియుండిరి.

ముష్టియెత్తిన బియ్యమొకమూటగట్టి బుజానవేసికొని మిడుగురులు గురియించు నెండకుఁ దాళజాలక తలపై ముసుఁగిడి కాళులు పొక్కులెక్కుచుండ, చెమ్మటలొడల యేరై పాఱుచుండ శివావధాని వచ్చి తన యింటిముందటి జనసమ్మర్దమునుగాంచి యాపద యేదయినను ఘటిల్లెనేమోయని భయపడుచు, వడబడునడుగులతో వచ్చుచు దారిలోఁ గొందఱనుగాంచి యాసమ్మర్ద మేమనియడిగెను. వారు "అయ్యా! నీవు మంచియదృష్టవంతుఁడవు. ధనికురాలగు కోడలితోఁ గూడ నీకొడుకువచ్చినాఁడు. వానిని జూచుటకుఁ బ్రజలట్లుకూడిరి, అంతేకాని మఱేమియులేదనిరి. శివన్న యందులకాశ్చర్యముచెందుచుఁ బ్రజలనొత్తిగించుకొని లోనికరిగెను. రామారావతనినిగాంచి భార్యతో నరిగి నమస్కరించెను. శివన్న వారిని దీవించి యాదరించెను. ఇంతలో నతని మనుమలు "తాతా, తాతా! మేము మోటారెక్కేము. మోటారెక్కేము" ని చప్పటులు చరచుచు, గెంతులువేయుచు చుట్టును మూగిరి.

తనకాకస్మికముగా సంభవించిన యమ్మహాశ్రేయస్సున కాత్మలో సంతోషించుచు నవధాని చావడిలోనికివచ్చిన యూరివారగు మనుష్యుల కందఱకును దగినమర్యాదలాచరించెను. వారంత నతని యదృష్టమును మిక్కిలిగాఁ బొగడి వెడలిపోయిరి. అప్పుడవధాని వెడలిపోగా మిగిలిన సామాన్యజనముతో "అయ్యా! మేమీనాఁడీ చావడిలో భుజింపవలెను. దయచేసితొలఁగిపొం" డనిచెప్ప వారును వెడలిపోయిరి.

అప్పుడురాజ్యలక్ష్మి డ్రైవరునకొక యుత్తరము వ్రాసియిచ్చి "యనకాపల్లిలోఁ బూటకూటింట భుజించిపొమ్మని" చెప్పి యొక

రూపాయిచ్చి పంపివేసెను. రామారావు భుజించిపోవచ్చునని యెంతయోచెప్పెనుకాని రాజ్యలక్ష్మి "మన యందఱ భోజనములు కాకుండ నతనికన్నముపెట్ట వీలులేదు. ఇప్పటికేచాల వేళయయిన ద"ని చెప్పుటచే నూరకుండెను.

శివావధాని స్నానముచేసి జపము పూర్తియయ్యెను. అతఁడును భార్యయు, కూతుండ్రును గుసగుసలువోవఁ దొడగిరి. కొడుకును గోడలిని దమ పంక్తిని గూర్చుండనిచ్చుటయూ, మానుటయూ, యనువిష యమైయెంత చర్చించినను గర్తవ్యమును స్థిరపఱుపలేకపోయిరి. రాజ్య లక్ష్మి యదియంతయు నూహించి, భర్తతో "నాథా! నిజముగా వీరికి మనము గట్టిచిక్కు దెచ్చిపెట్టితిమి. మనకుఁదమ పంక్తిని భోజ నము పెట్టుటయూ, మానుటయూ, అను సందిగ్ధావస్థలోఁజిక్కి బాధ పడుచున్నారు. కావున మీరు వారిని రహస్యముగా, బిలిచి మనకీ చావడిలో నన్నముపెట్టు నేర్పాటుచేయుడ"నెను. రామారావు తల్లి తోను, దండ్రితోను మాటాడి యట్లుగావించెను. రెండుగంటలు కొట్టు నప్పటికి మధ్యాహ్నభోజనము లయినవి. రాజ్యలక్ష్మి రామా రావుతో భుజించి యిర్వురమెంగిలెత్తి యచ్చటనే విశ్రమించెను.

శివావధాని భుజించి యీ గదిలోనే కొంచెము శయనించెను. కాని మనుమలు మనుమరాండ్రును, ఆతనిమీఁదఁబడి క్రుమ్ములాడుటచే శయనింప లేక లేచిపోయెను. కాంతమ్మ యది చూచియు దనపిల్లలను వారింపక యూరకుండెను. శివావధాని యుదయమునఁ దొమ్మిదిగంటలకు నిద్ర నుండి లేచినది మొదలు రెండుగంటలవఱకు నూరంతయుఁదిరిగి ముష్టియెత్తు కొని వచ్చినాఁడు. కాలాతీతమైన పిమ్మట భుజించెను. అప్పుడైనను గొంచెము విశ్రమింపచోటులేదు. అందులోనే యెట్లో విశ్రమింత మన్న పిల్లల్లరిచేయుచుఁ బండుకొననియ్యరు. ఇన్నియుఁ దెలిసిన కాంతమ్మ పిల్లలను వారించి తండ్రికి సదుపచారములు చేయు వివేక వతికాదు. ఇవన్నియుఁ జూచి రాజ్యలక్ష్మికి మిక్కిలి భారముగాఁ దోచెను. వీవనతో విసరికొనుచుఁ దామున్న చావడిలోనికి వచ్చుచు న్నమామగారి యవస్థనుజూచి సంతప్తహృదయురాలై రాజ్యలక్ష్మిలేచి నిలువఁబడెను. శివావధాని యొకచో గూర్చుండి రాజ్యలక్ష్మిని గూర్చుండుమన్నను, ఆమె కూర్చుండక యుతనిచేతిలోని వీవనగొని మామగారికి వీవ నారంభించెను.

గంగమ్మ లోపలనుండి చూచి "అబ్బో, అబ్బో! మామగారికి సేవచేయుచున్నదే" అక్కయ్యా! చూచితివా? అని నవ్వెను.

సత్తెమ్మ—అంతేకాదు. లేచి నిలువఁబడి మామగారికి మర్యా దలుకూడఁ జేసినది.

తల్లి వారి వేళాకోళములు విని "మీ కంటె నెవ్వరైనను మంచి వారే! మన కోసమై యూరూరఁదిరిగి ముష్టి యెత్తికొని వచ్చిన ముదు సలి తండ్రి కుపచారములు చేసిన తప్పా? మీరు కాక్షేపణచేయుట తప్ప రెండవది యెఱుఁగరు. పట్నవాసపు పిల్లలు పెంకెవారు, పనిచేయరం

దురు. కాని పల్లెటూరిపిల్లల కంటె వారే యెన్నోవిధముల మంచి వారు. వారు చదువరులు. వివేకవతులు, యుక్తాయుక్తజ్ఞానము గల వారు. మాన మర్యాదలు గలవారు. వారికిని మనకును సాటియెక్కడ? అని గట్టిగాఁ దిరస్కరించి పలికెను.

గం—అబ్బో! అప్పుడే కోడలిపక్ష మవలంబించినదే!

న—వెఱ్ఱి యుండకాన! కోడలిపక్షమేమి? కూతురుపక్షమేమి? నీకుఁ గన్నతండ్రి గదా! పెద్దవాఁడైన కన్నతండ్రి కుపచారములు చేయవలెనన్న బుద్ధియైనను మీకుఁగల్గినదా! కూతురేమి? కోడలేమి? నా కందఱు నొక్కటియె.

అక్కడ మామగారెంత వలదన్నను రాజ్యలక్ష్మి తనపని తాను మానలేదు.

శి—(కోడలినిజూచి) అమ్మాయీ! నీవు మా యింటికోడలివగుట మా పూర్వపుణ్యము.

రాజ్య—మీ వంటి సాధుసంసేవ లభించుట నా పూర్వపుణ్యమును గూడ నెన్నికోవలసియున్నది.

శి—ఉత్తమశీలవగుటచే నట్లనుచుంటివి కాని యది నీ వనవలసినది కాదు.

రాజ్య—నా యందుత్తమత్వమే యుండి, యది మీ మన్ననకుఁ బాత్రమైనచో నిజముగా నేనుకృతార్థను. అట్టి నా కోర్కులను దీర్చుట తమకు విధి.

శి—మా యింటికోడలివై మా వంశమును బవిత్రీకరించిన నీ కోర్కె దీర్చుట విహితకృత్యముకాదా! తప్పక చెప్పుముతల్లీ!

రాజ్య—మీరు పెద్దలైనారు. కొడుకునుగోడలును దగిన ప్రాయము వారై యున్నారు. నేటినుండి కుటుంబపోషణ భారమంతయును గొడుకుపైని గోడలిపైని నిలిపి మీరు విశ్రమింపవలయును.

శి—నా కంతటి యదృష్టమా? తల్లీ! మా వానికి ఎక్కడనైన ఉద్యోగము దొరకువఱకును నేను నా వృత్తి మానినచోఁ గుటుంబ మునకుఁ దిండియేది. "తండులాలు గృహమందు నసంతి, తిండికైతే పదిమంది వసంతి" అను నట్లున్నది మా స్థితి.

రాజ్య—అట్టి లోపము రాకుండఁజేయు పూచీనాది.

ఆ మాటలూఁకొట్టుచునే శివావధాని నిద్రవోవఁజొచ్చెను.

మామగారికి బాగుగా నిద్రవట్టుటఁజూచి రాజ్యలక్ష్మి యచ్చట నల్లరిచేయుచున్న పిల్లలకందఱకును దలకొక కాని యిచ్చి యూరి లోనికిఁ బంపివేసెను. నిశ్శబ్దముగా నుండుటచే నవధాని సుఖముగా నిద్రించెను.

అపుడామె భర్తను బిలిచి తన పెట్టెలోని నూరు రూపాయిల నోట తని చేతికిచ్చి బియ్యముకొని తెమ్మని కోరెను. రామారావూరిలోని కరిగి స్వల్పకాలములోనే యెనిమిది బియ్యపుబస్తాలు బండితోఁ దెప్పించెను.

అదిచూచి నిద్రనుండి మేల్కొనిన యవధానియు నింటిలోని వారును మిగుల నాశ్చర్యపడిరి.

అవధాని కూర్చుండెను. అదిచూచి రాజ్యలక్ష్మి పెట్టెలోనుండి వెండి పళ్లెరముదీసి మిఠాయియును, మఱికొన్ని దినుబండములు దానిలోఁ బెట్టి మామగారి ముందుఁబెట్టెను.

శి—అవి యెందుకమ్మా. నాకు!

రాజ్య—ఇవి బజారుపదార్థము కాదు. ఇంటిలో వంటబ్రాహ్మణు నిచేఁ జేయించినవి. పిమ్మట నెక్కడ నెట్టిసంపర్కమును గలుగలేదు. మీరు తినవచ్చునని చెప్పెను.

రామారావు వెండిచెంబుతో మంచినీళ్లు దెచ్చిపెట్టును.

అదిచూచి లోపలనుండి గంగమ్మ "నాయనా! ముందువచ్చునది తెలిసికొనకుండఁ గోడలిచేతి ప్రసాదము తినుచున్నావా" అని కేక వేసెను.

శివావధాని చేతిలో తీసికొన్నది యట్లనిలిపి యూరకుండెను.

రాజ్యలక్ష్మి యదిగాంచి "అయ్యా! ఇది యన్యముకాదు. మంచి మంచి మాచారవంతులే బజారుమిఠాయి తినుచున్నారు. నే నుత్తమ బ్రాహ్మణవంశ కన్యకను. ఎటుచూచినను నిందు మైలసంపర్కము లేదు. తనుడు తినవచ్చు" ననెను.

అవధాని తినుటకుఁ బ్రారంభించెను. బెల్లము చుట్టును జేరిన చీమల వలెఁ బిల్లలువచ్చి యతని కంచమును మూగిరి. రాజ్యలక్ష్మి యది చూచి పిల్లలను వేఱుగాఁబిలిచి యుండఱకును దలకొక రెండేసి మిఠా యియుండలిచ్చి లోనికిఁ బంపివేసెను. పిల్లలందఱును లోనికిఁ బాఱి పోయిరి. అవధాని సుఖముగా భుజించుచుండెను.

ఇంతలో నొక బాలుఁడు గంగిపిన్ని నా మిఠాయియుండ తినివేసిన దని విలవిల యేడ్చుచుండ రాజ్యలక్ష్మి యది గ్రహించి వానికి రెండుండలిచ్చి యేడ్పు మాన్పించి "తండ్రికి బుద్ధిచెప్పిన గంగమ్మ బాలునిచేతి యుండలు దినివేసినది" నీరి యాచారమంతయు బూట కము. మన మిఠాయి యూదరముతోఁ దినువారే యనుకొని మఱియొక వెండికంచములో మిఠాయియుంచి లోనికిఁ బంపించెను. అవధాని తృప్తిగా భుజించి కోడలితో "అమ్మా! నాజీవితకాలములో నిది సుది నము. నేఁడు నా యాత్మ తృప్తిగాంచిన" దని పలికెను.

మఱునాఁడు నాలుగు గడియల ప్రొద్దెక్కినది. నరసమ్మ! కూతుం డ్రతో "అమ్మాయీ! మీరుపోయి రెండుబిందెల నీరుదెచ్చి వదినెకు, అన్నయ్యకును స్నానమునకిం" డని చెప్పెను. గంగమ్మ, మాతిత్రిప్పుచు, మేమెందులకుఁ దేవలయును. అదే తెచ్చి మగనికిచ్చునా చేయును తేలే

మమ్మా" అని పలికెను. అది రాజ్యలక్ష్మమ్మవిని "అంతశ్రమ మీకెందుల
కమ్మా! భగవంతుఁడిచ్చిన శక్తినాకుఁగలదు. నాపతికి నేనే యుపచా
రములు చేసెదను" అని పలికి బిందెపట్టుకొని నీళ్లకరుగుచుండెను. అవ
ధాని యామెను వారించి కూతుండ్రతో "అమ్మాయీ! దీనికి నీళ్ళు
మోయు నలవాటులేదు. మీరు తెచ్చి యియ్యండి తప్పులే" దని యెంత
చెప్పినను వారు వినలేదు. రామారావు భార్యచేతి బిందెను దీసికొని
నీళ్ళు నేఁదెచ్చెద నుండుమనెను.

రాజ్య—చాలు. చాలు. మీరునీళ్ళుదెచ్చి నాకిచ్చుటయా. అక్కఱ
లేదు. నేనే తెచ్చెదనని నూతి కరిగెను. రామారావామెను వెంబడించి
యామె చేదియిచ్చిన నీళ్లతో స్నానముచేసి భార్యను గూడ స్నానము
చేయుమని వట్టిబిందెతో నింటికి వచ్చిరి.

నాఁటి మధ్యాహ్నము రామారావుతో రాజ్యలక్ష్మి యిట్లనియె.
"అయ్యా! యుక్తవయస్కురాండ్రగు స్త్రీలు వీధిలోని నూత స్నాన
మాడి వచ్చుట మిక్కిలి యమర్యాద. మన పెరటిలో నూయి తీయిం
చుట కెంత సొమ్మగును?

రా—ఏఁబది రూప్యములకుఁ దక్కువగాదు.

రాజ్య—సరియే నేనిచ్చెదను. రేపే నూతిపని ప్రారంభింపఁజేయుఁడు.

రామారావు నూతి పనివాండ్ర కాజ్ఞాపించెను. మూఁడు దినము
లకు నూయి పూర్తియయ్యెను. అందులకుఁ జుట్టుప్రక్కల వారంద
ఱును సంతోషించుచుండిరి. కాని గంగమ్మ సత్తెమ్మలు మాత్రము
"ఇదెక్కడనూయమ్మా! పిల్లలు దిరుగుచుందురు. ఎవ్వరికెట్టి ప్రమా
దము సంభవించునో" యని లక్ష్మమ్మమీది కోపమున దిట్టుకొనక పోలేదు.

ఇది జరిగిన మూఁడవనాఁడు పదిగంటలకు పేరిశాస్త్రిగారి గుమాస్తా
రాజ్యలక్ష్మమ్మని దరిశించి "తల్లీ! మీరువ్రాసిన యుత్తరమును జూచి
యావేయి రూపాయిలును మీకిమ్మని యీ యుత్తరము నిచ్చిరని

యామెకిచ్చెను. రాజ్యలక్ష్మి భర్త నాసొమ్ము పుచ్చుకొమ్మని చెప్పి యాయుత్తరమును దనలోనిట్లు చదువుకొనెను. "అమ్మాయీ! నీవు నిజముపేద గృహమును బొందినను నిత్యసంతోషమును వదలక వర్తించు చున్నట్లు విని సంతసించితిని. నీవు కోరుటచే సొమ్ము పంపితిని. అది నీదేకాని నూదికాదు. మనయింట జరిగిన శుభకార్యములందు మంగళ హారతికై నీకుదొరకిన సొమ్మంతయు జాగ్రత్తచేసియుంచితిని. అది యిప్పటికి వేయిరూప్యములయినది. అవియే నీకిప్పుడు పంపినవి. నేనును మీనాన్నగారు నీవు కోరినంత ధనమును బంపుటకు సిద్ధముగా నున్నాము. నీయత్తింటివారిని సంతసింపఁజేయుచు నీవు సుఖజీవనము చేయుచున్నట్లు తెలిసినచో మేము పరమానందము చెందెదము. సొమ్మునకుఁ గొఱఁతవడి నీవు కష్టపడినచో నన్నుఁ జంపుకొని తిన్నట్టే సుమా!

ఇట్లు భవదీయ సుఖాభిలాషిణి—మంగమ్మ.

అది చదివికొని మాతృదేవత ప్రేమాతిశయమును గొనియాడు కొనుచు నాయుత్తరమును భర్తకిచ్చెను. అతఁడును జదివికొని మాతృ వాత్సల్యమున కమితానందము నొందెను.

అవధానిగారి యింటిని గలిసియున్న యొకపెంకుటింటినాసొమ్ముతో రామారావు కొనెను. శివావధాని యందులకు మిగుల సంతసించి పంచమీ గురువారము గృహప్రవేశమునకు మంచిది. ఇఁక రెండుదినము లోపిక పెట్టుఁడని చెప్పుటచే రాజ్యలక్ష్మియును రామారావు సతని వాక్యమును మన్నించిరి. రాజ్యలక్ష్మి తొంటివలె సావడిలోనే విడిసి యుండెను. రామారావున కిప్పుడు గృహస్థాశ్రమమే కాకుండ నుత్తమ గృహము కూడ లభించెను.

అష్టకష్టములలోను ముఖ్యమైనది దారిద్ర్యము. మానవు నధోగతి పాలుచేయుటలోఁ బేదతనమును మించినది మఱిలేదు. అది మానవుని సర్వశ్రేయములను నశింపఁజేయును. అది మానవునిచే సకలపాపములను జేయించును. అది మానవుల బుద్ధులనుగూడ సంకుచింపఁజేయుచుండును. సామాన్యముగా ధనికకుటుంబ స్త్రీలకుండు నుదారబుద్ధులు దరిద్ర స్త్రీలకుండవు.

రాజ్యలక్ష్మి నిజముగా శివావధానిగారి కుటుంబము పాలిటి భాగ్యదేవతయని గ్రామస్థులందఱును జెప్పుకొనసాగిరి. శివావధానియు, భార్యయుగూడ నట్లె తలంపఁజొచ్చిరి. ఆ విషయమై రామారావును గుఱించి వేఱ చెప్పనక్కఱయే లేదు. శివావధాని పెద్దకూతురు కాంతమ్మ మాధ్యస్థ్యమును వహించి యూరకుండెను, కాని గంగమ్మ సత్తెమ్మలు మాత్రము రాజ్యలక్ష్మి పొడను సహింపలేరైరి. అందులకు వారి సంకుచితభావములే కాని వేఱుకారణము కనఁబడదు. ఏ విషయమున నాలోచించినను వారు రాజ్యలక్ష్మి యెదుట దిగదుడుపునకైనను బనికిరాదు. అయినను వారు సర్వదా రాజ్యలక్ష్మిని తృణీకరించుచునే యుందురు. రాజ్యలక్ష్మి రూపవతి, విద్యావతి, ధనవతి, ఔదార్యవతి, క్షమావతి, వివేకవతి. అట్టి యుత్తమురాలు తమయింటి కోడలైనందులకుఁ దమయదృష్టమును బొగడుకొనవలసినది. అందులకు బదులు వారామెను నిందించుచుందురు. ఆమె యువతియై వివాహమాడుటయే యీ నీచత్వమునకుఁ గారణమని యీ వితంతువుల యుద్దేశము. పోనిండు, "యువతీవివాహమంత నీచమా" అని యడిగినచో దానికి సంఘము ప్రత్యుత్తర మీయవలెను. ధర్మశాస్త్రములు సమాధానము చెప్పవలెను. అంతియే కాని యీ వితంతువు లెవ్వరు?

వీరి కేమి తెలియును? తలిదండ్రుల చాటున బ్రదుకుచున్నవారు. కావున వారి యాజ్ఞానుసారముగా వర్తించినను బాగుగానే యుండును. కాని వారట్లును నడువరు. చిన్నతనమందే దురదృష్టమువలనఁ బతి విహీనలై తమయిల్లు చేరినవారికి విరుద్ధముగా నడుచుట కిష్టపడక తల్లిదండ్రులు వారికి స్వేచ్ఛనొసఁగిరి. అందుచే మంచిచెడ్డ లాలోచింపక తాఁబట్టిన కుందేటికి మూఁడే కాళ్లని మూర్ఖత్వము బూను దురు. మూర్ఖుల నెవ్వరు త్రిప్పఁగలరు? నాటిరాత్రి రాజ్యలక్ష్మి రామారావు చావడిలో నిద్రించిరి. నాఁడు నరసమ్మ జ్వరపీడితురాలగుటచే గదిలో మంచముపైఁ బండుకొనెను. కూతుండ్రును భర్తయు మంచము చుట్టును గూర్చుండిరి. వారలకీ క్రింది విధమునఁ బ్రసంగము నడిచెను.

శివా—దివ్యభవనములలో సంచరింపవలసిన యుత్తమురాలు మన యదృష్టవశమున మన యింటికోడలై వచ్చియుండఁ దుదకుఁ బండు కొనఁదావైనను జూపఁజాలకపోయితిమి?

నర—పట్టణములలోను, ధనికులయిండ్లలోను, నింతటి యుత్తము రాలుండునని యనుకొనలేదు.

శి—నేను బేరెన్నికగన్న స్త్రీలను గాంచితినిగాని యింతటి సత్తము రాలిని జూడలేదు. ఆహా! ఎంతటి యాదరము! ఎంతటిగౌరవము! ఎంతటి మంచితనము! ఎంతయుదారాశయము!

నర—అందతిశయోక్తి యేమియును లేదు. మనయిల్లు ప్రవేశించి నది మొదలు లోపములను దిద్దుటకే సర్వదా యాలోచించుచుండును.

గం—ఏమున్న నేమిలాభము! మనకుఁ బనికిరానిది, అన్నియుఁ గలవు. అంచునకుఁ దొగరులేదన్న సామెతకు సరిపడును.

శి—ఏమిలోప మున్నది. తల్లీ!

గం—నాయనా! ఈ దినము బయ్యావారి సుందరమ్మ చెప్పినది. ఆ కోడలినింటఁ బెట్టుకొన్న సంఘము మనల బహిష్కరించునఁట!

శి—ఈ విషయమాం సుందరమ్మ కుండకేమి తెలియును. అంతగా వచ్చిన మనమే సంఘమును బహిష్కరింతము. అంతేకాని యట్టి కోడలిని వదలజాలను.

కాంత—అట్లయిన నేలాగు. నేను మీతో బహిష్కృతనైనచో నా గతియేమి? నాపిల్లలగతి యేమి? సంబంధములు మాకు దొరక వలదా! మీ రట్లు చేసిన నేడో రేపో మీ యిల్లువిడిచి పోయెదను.

గం—మీరును గోడలును గలిసియుండుడు. నేను అక్కయ్యతో వెడలిపోయెదను.

న—గంగా! అక్కయ్యకు దనపిల్లలకుఁ బెండ్లిండ్లు కావేమో యన్న భయము. కాని నీ కేమి భయమే.

గం—మహాపాప భయము.

న—అది పాపమో కాదో సంఘము నిర్ణయింపవలెను.

సత్తెమ్మ—భాగ్యవంతురాలైన కోడలబ్బినదని నేడు నీ విట్లను చున్నావు. కాని యీ విషయమై యిదివఱకే సంఘము నిర్ణయించి నది.

శి—ఏమి నిర్ణయించినది. ఎక్కడజూచినను నిట్టి వివాహములే జరుగుచున్నవి. వారి నెవ్వరు బహిష్కరించినారు.

స—ఏమో! అదంతయు నాకుఁ దెలియదుకాని యూరిలోని యమ్మలక్క లందఱును దప్పనుచున్నారు. మీరాలోచింపక కోడలి నింటఁబెట్టుకొన్నచో అక్కయ్యతోఁ గలిసి మే మిరువురమును వెడలి పోయెదము. మీరును గోడలును హాయిగా నుండుఁడు.

న—అదేమే! అట్లందువు. మీ నాయనగారి కంటె నీ కెక్కువ దెలియునా? ఏమి! వారికి లేనిపాపము నీకే వచ్చినదా! మీ రిష్టము వచ్చినట్లు మాటాడక మీ నాన్న నడిచినట్లు నడువుఁడు.

గం—ఈ మహాపాపమును బ్రుంగి చెడుటకు నీకును మా నాన్నకును దప్పదు. కాని మా కేమి? వెంటనే యెచ్చటికో పోవుదుము.

న—పోవుదుము, పోవుదుము. అందురు. ఎచ్చటికిఁ బోవుదురు! పోయిన భోజనమో!

గం—మీ కేల పెట్టుదురు? ఎవరికోసము పెట్టుదురు?

న—మీ కెత్తుబత్తె మీయఁగలమా? మాతో నుండిన నన్నును బెట్టఁగలము. మీ తండ్రి రానురాను అస్వస్థులైనారు. ఇఁకఁ గుటుంబయాత్ర యెట్లునడుచునో యని భయపడుచునే యున్నాను. కోడలా యాపదనుండి యుద్ధరించినది. పాపము.

గం—కోడలు కాకపోయినఁ గొడుకుద్ధరించును.

న—కొడుకు నా వలనఁ గాదన్న నేమిచేయఁగలము!

గం—అట్లేందుల కనును? మమ్మమ్మిన సొమ్ముతోఁ జదువుకొని యింతవాఁడైనాఁడు.

న—చదువుకొన్నాఁడు. నిజమే. ఈ కాలములో నుద్యోగములు లేవు ఏమిచేయును. మీరు లేనిపోని కలహములు పెంచకుఁడు. అట్టి కోడలు మనకుఁ గలుగఁబట్టియె తినుటకు, ఉండుటకు నెట్టిలోపము లును గలుగలేదు. అది మీరాలోచించి మన కుటుంబస్థితి నెఱిఁగి, మీ తండ్రిగారి స్థితి దెలిసికొని మాతోఁ గలిసియుండుఁడు. మాకు లేని పాపము మీ కే వచ్చునా? ఇట్టి బీదలమై యుండుటచే మన రామునకు వివాహమగునన్న యాశయే లేదు. వాని యదృష్టమువలన నట్టి సుశీలవతి, యట్టి ధనసంపన్నురాలు లభించినది. అందుల కానందించుటకు బదులుగా నిట్లు వర్తించుటకు తగునా? మన మందఱమును గలిసియున్న నెవ్వరు నేమియు మనలఁ జేయఁజాలరు. కుటుంబకలహములు లేకున్నఁ జాలును. మీ రిందులకు విరుద్ధముగా వర్తించి మమ్ము దుఃఖసముద్రములో ముంచకున్నఁ జాలును,

గం—ముందు వచ్చెడి దుఃఖములు తొలఁగించుటకే యిప్పుడింత చెప్పుచున్నాము.

శి—ముందువచ్చెడి దుఃఖము లేమమ్మా?

గం—ఊరివారు మనలను బహిష్కరింతురు.

శి—అందువలన మన కేమి దుఃఖమమ్మా!

గం—మనయింటి కెవ్వరునురారు.

శి—వారినిబిలిచి భోజనముపెట్టుటకు మనకు శక్తియేది? పోనిమ్మా.

గం—వారు మనలను బిలువరు.

శి—పోనిమ్మా! ఒక్కనాఁడు వారు పెట్టినభోజనముతో గడవదు కదా!

గం—అట్లయిన మీ యిష్టము.

శి—(భార్యతో) నిన్నఁగాక మొన్నపుట్టిన యీ గుంటముండల కెంతపట్టుదలయో, చూచితివా? వయస్సుజారినది. ఇఁక నా కెన్నటి కైనను గష్టములు గట్టెక్కునాయనికొడుకుపై గొండంతాస పెట్టు కొని యుండవాఁడు విపరీతుఁడై నాఁడు. ఇఁక నేను నిరాశచేసికొని యుండ నా యదృష్టలేశవశమున నుత్తమురాలగు కోడలు లభించి నా కష్టము తొలఁగింపగా వీరు శనిగ్రహములవలె నెట్లడ్డుచున్నారో చూడుము. నేటికి మూడుదినములై వచ్చి వీధివాకటిలో పడిసియు నుంతేనియుఁ జింతింపక మనయందత్యంత పూజ్యభావముంచి నాకు మహోపకారము చేసినది. మనకష్టములను జూచి వెంటనే నూయి త్రవ్వించినది. దివ్యభవనమును గొని మనలను రక్షించినది. అట్టిదానిని లోనికిఁ బిల్చి యింతయన్నమైనను బెట్టలేకపోతిమి. కొంచెమైనను నాదరింపలేకపోయితిమి. అని యేదో చెప్పుచుండ.

సత్తె—(అడ్డువచ్చి) నాయనా! భాగ్యవంతురాలగు కోడలువచ్చి నప్పుడు కూతుండ్రు శనిగ్రహములు కాక మఱేమగుదురనెదు.

శి—(తల పటపట మొత్తుకొనుచు) "ఓసీ! నీచురాలా! ఆ మాటలనుటకింటె, ఆ మూలనున్న కత్తిపీటతో నా పీకకోసి వేయరాదా! ఓసీ ముండకాన! పెద్దలలక్ష్యములేకుండ మాటాడుచున్నావు. నిజముగా మీరు శనిగ్రహములే కాకున్న నా కిట్లు విపరీతముగా నేల వర్తింతురు" అని తిట్టుకొనుచుపోయి శయనించెను. సరసమ్మ గంగమ్మను జీవాట్లుపెట్టి పంపివేయగా నామె సత్తెమ్మతోఁగూడఁ బోయి పండుకొనిరి. అప్పటికిఁ జాలరాత్రి యగుటచేఁ బక్కనవారును శయనించిరి.

తెల్లవాఱి నాలుగు గడియలైనది. నరసమ్మ కింకను జ్వరము వదల లేదు. శివావధాని యూరిలో నొకవైద్యుని చెంతకరిగి మందుదెచ్చి భార్యకిచ్చెను. రాజ్యలక్ష్మి స్టవువెలిగించి కాఫీ సిద్ధముచేసి, గంగమ్మను గాంచి "వదినె! ఇదిగో ఈ వేడికాఫీ తీసికొనివెళ్ళి మీ యమ్మగారి కిందుము. దానివలన శ్రమయు నీరసము తొలఁగుటయేకాక జ్వరము గూడఁ దఱుగును" అనెను.

గం—ఈదిన మాదివారము. నీవు కాచిన కాఫీ ముట్టను.

రా—ముట్టక పోవుటకుఁ గారణము, ఆదివారమా! నేను గాచుటయా!

గం—రెండును గారణములే.

రా—అందు ముఖ్యమైనది.?

గం—సంఘ బహిష్కృతురాలవగు నీవు కాచినది మేమెట్లు ముట్టఁగలము. ఎట్లు త్రావఁగలము.

రా—నేను బహిష్కృతురాలను. కాను, కాలేదు.

గం—సంఘధర్మ మతిక్రమించి మహాపాప మాచరించితివి. మహాపాపులు దండ్యులు గాఁ దగినవారు. ఈనాఁడు కాకపోయిన రేపయిన బహిష్కృతురాలవు గాక మానవు.

రా—వదినె! మీరు పొరపడుచున్నారు. దీనిని గుఱించి యింత పట్టుపట్టుచున్నారు. కాని నిజముగా నిది పాపముకాదు. కాని మొన్న సాయంకాలము మీరు సత్తెమ్మవదినెగారును గూడి యమాయికురాలగు కూరలదానిని వంచించియేఁబది బీరకాయలును, ఇరువది బీరకాయలుగా లెక్కించి రెండణాలిచ్చుటకు మాఱుగా ఒకయణా యిచ్చి యది వలవలయేడ్చుచుండఁ దిట్టియుఁ, గొట్టియుఁ దఱిమివేసి

నారు. నిజముగా నట్టిది పాపము. కాని సంఘములోఁ బలువురంగీక రించిన యువతీ వివాహము పాపముకాదు.

గం—నేమగుట్టు తెలిసికొన్నందులకుఁ జిన్నవోయి లోనికరిగెను.

అత్తగారున్నగదిలోనికి కగుగుటకుండుట కనుమతిలేదు. అందుచేఁ దానువెళ్లక భర్తచే కాఫీ యత్తగారికంపెను. ఆమెయూ వేడికాఫీత్రావి కొంచెము శక్తికలదై, గంగమ్మ సత్తెమ్మలను బిలిచి "అమ్మా! జాముప్రొద్దెక్కినది. ఇంకను బొయిలోనిప్పు వేయలేదు. మీలోనొకరు మడిగట్టుకొని యీపూటకు వండుఁడు. సుళువుగానున్నచో రాత్రినేనే వంటచేసెదను" అని పలికెను.

గం—నాకుఁదలనొప్పిగానున్నది. నేను స్నానముచేసి వండలేను.

నర—పోనీ! సత్తీ! నీవువండవే!

స—ఈయందఱకును నేను వండిపెట్టలేనమ్మా.

నర—అందఱనుచున్నావు. బైటవారెవ్వరు?

స—ఏమో! అదియంతయునాకుఁ దెలియదు. నేను వండలేను.

న—నేను, మీ నాయనయుఁ బరులముకాము, అక్కయ్యయుఁ బిల్లలుమాత్రము పరులా? అవతల వదినెయు అన్నయ్యయుఁ బరులా? కావలసినవారు కష్టములు వచ్చినప్పుడు తోడుపడకపోయిన నెట్లు?

స—నే నంత వంట వండలేనమ్మా!

న—మ రెంత వంట వండుదువు?

స—మనకు మాత్రమే వండెదను.

న—అనఁగా!

స—అనఁగా ఏమిటి, అనఁగా!

న—నీ యుద్దేశమేమో చెప్పుము, తల్లీ!

స—దొరకుండును.

న—దానియుద్దేశము మఱేమియులేదు. అన్నవస్త్రము నదినచే వండించి పెట్టింపుమని.

న—అట్లుచేయుట బాగుండదు తల్లీ! వారి నీనాఁడు వేఱుపెట్టి వండుకొనుచుండంటే లోకులు నల్వురును మనలను దిట్టకమానరు.

న—తిట్టినను, మానినను సరియే. నేనువండి వారికిఁబెట్టను.

రా—సత్తెమ్మవదినే! పోనిండు నేను వండిపెట్టుదునా?

న—మేము నీచేతియన్నము తినము, కావున నిట్టిగడుసుమాట లనుచున్నావు. నిజముగా వండుమనిన నేమిచేయుదువో!

ఇంతలో శివావధాని యూరిలోనుండి వచ్చి భార్యవలన జరిగినదం తయును విని పడపడ, తలమొత్తుకొనుచు "ఈ పాడుకొంపలోనే నుం డను. మీ కిష్టమువచ్చినట్లు ఏడువండి" అని బట్టలు మూటగట్టుచుం డెను. నరసమ్మ, వణుకుచు మంచముమీఁదినుండి లేచి "మీరు వెళ్లు టకు నే నంగీకరింపను. మీతో నన్నుఁగూడఁ గొనిపొండు." అని పలుకుచు భర్తచేతిలోని మూటను లాగుకొనఁబోయి జాఱి నేలఁ బడెను. అట్లుపడి నీరసముచే మూర్ఛిల్లెను. ఆమె చనిపోవుచున్నట్లు భావించి కూతుండ్రును భర్తయుఁ బలువిధముల వాపోవసాగిరి. రాజ్య లక్ష్మి యదిచూచి యత్తగారిని సమీపించి చేతినాడిని బరీక్షించి మూర్ఛిల్లినట్లు గ్రహించి చల్లనినీరు కొంచెము మొగముపైఁ గొట్టి తుడిచి తానుగాచిన పాలు గొనిపోయి యామె గొంతుకలోఁ బోసెను.

అందువలన నరసమ్మ కొంచెము సేదదేఱి కన్నులు విచ్చి తాను కోడలియొడిలోఁ బండుకొనియున్నట్లు గ్రహించి చేతులతో నామె కపో లములు పుడుకుచు "తల్లీ! ఈదీనురాలి నెందులకు రక్షించితివి? ఈ నిఱుపేద నెందులకుఁ బ్రదికించితివి? చచ్చిపోయిన నింతకంటె సుఖింతునేమో!" అని పలికెను.

రా—అమ్మా? అట్లనకుము. మీరింకను బదికాలముల పాటు బ్రదుకవలయుననియే కోరుచుందుము. మేమందఱమును మీకుపచారములు చేయవలసిన వారమే. ఇది మావిధి. మీరు మఱియొకలాగున అనుకోకండి.

స—ఎంతమంచిదానవే తల్లీ! కనిపెంచిన కూతుండ్ర కాపాటి బుద్ధి లేకపోయినది.

రాజ్యలక్ష్మి యత్తగారిని గొనిపోయి మంచముపై శయనింపఁ జేసినది.

గం—ముందు వచ్చిన చెవులకంటెఁ దరువాత వచ్చిన కొమ్ములు వాఁడి యన్నట్లున్నది.

శి—ఓ పాపిసకూతురా! అట్లందువేల? నేలఁబడి చావసిద్ధముగా నున్న తల్లి కుపచారము చేయలేకపోయినావేమి?

గం—ఆమెయలామె చేతిపాలు త్రాగినఁగాని యమ్మ బ్రతుకదా యేమి? ఆమె రాకపోయిన నేను పాలు పోయలేకపోవుదునా?

శి—(కోపముతో) పోయుటకు పాలేవి?

గం—పాలు లేకపోయిన, మంచినీళ్లు పోయుదుము.

శి—(కోపముతో) నీళ్లుకాదు. నిప్పులు పోయుదువు. లోకములో నందఱును జచ్చినపిమ్మట నిప్పులు పోయుదురు. నీవు బ్రతికియుండగనే నిప్పులు పోయుదువు.

తండ్రి కోపమునకు వెఱచి గంగమ్మ లోని కరిగినది. జాము ప్రొద్దెక్కినది. కాని యెవ్వరును వంటప్రయత్నము చేయలేదు. తల్లి చెప్పినను, తండ్రి చెప్పినను, ఆవితంతువులది యొక్కటియే పట్టు. తమతోఁబాటు రాజ్యలక్ష్మికి అన్నము పెట్టమని వారియూహ.

తమపాలిటి భాగ్యదేవతవలెఁ దమగృహమునకువచ్చి తమకు సకల సదుపాయములొనర్చు కోడలికిఁ బండుకొనుటకుఁ దగిన తావైనను

జూపలేకపోతిమని విచారించు నవధాని నాఁ డన్నముకూడఁ బెట్టమని పలుకుచున్న కూతుల మాటలువిని సహింపలేకపోయెను. కాని యతఁ డేమి చేయఁగలఁడు. కూతుల నింటినుండి తఱిమివేసినచో లోకులు తన్ను మిక్కిలి నిందింపక మానరని తెలియును. ఎంత బతిమాలినను గూతులు తాను చెప్పినట్లు వినరు. అవధాని యిట్టి విషమావస్థలోఁ జిక్కి యేమియుఁ జేయఁజాలకుండెను.

రాజ్యలక్ష్మి యిది యంతయు గ్రహించి యత్తమామలకుఁ జేతులు జోడించి "మీరు మాకుఁ బూజ్యులు. మీరు మాయం దాదర ముంచి మాచెప్పినది మన్నింపవలయును. మీరు కోపతాపము లూని నచో మీయెదుట మాటాడఁజాలము. గంగమ్మ సత్తెమ వదినెలు చిన్నవారు. మోయరాని కష్టమును మోయుచున్నవారు. ఆపన్ను లయినవారి కేమాత్రపు భారమును గల్గింపరాదు. వంటి వడ్డించుట సామాన్యముకాదు. నల్వురకుఁ జేసిపెట్టుట కష్టము. అందుచే మీరు వేఱొకవిధముగా భావింపక యీ దుఃఖమునకుఁ గారకురాల నైన నన్ను వండుకొననిండు. ఇందుఁ దప్పేమియును లేదు. నేను వండి నా పతికింతపెట్టి నేను భుజింతును. మీరు సుఖముగా భుజింపుఁడు. ఇందుల కంగీకరింపుఁడ"ని పలికెను. చేయునదిలేక ముదుసలి దంపతు లూర కుండిరి.

రాజ్యలక్ష్మి వితంతు తోఁబుట్టువులపై మండిపడి పటపట పండ్లు కొరుకుచున్న భర్తను వారించి వంటకుఁ గావలసిన దతనిచేఁ దెప్పించి యైదునిమిషములలో స్టవుమీద వండి భర్తకుఁబెట్టి తానును దినెను. పిమ్మట బిందెడు నీళ్లు తెచ్చి వండిన స్థలమంతయును శుద్ధికావించి యచ్చట విశ్రమించెను.

ఒంటిగంట కొట్టునప్పటికి సత్తెమ్మ వండిపెట్టగా నింటివారును భుజించిరి. నాఁడు శివావధాని కోడలిమోముచూడఁజాలక పైకిరాలేక

పోయెను. అంతట సత్తెమ్మ పేడగలిపిన నీళ్లు చల్లుచుఁ జావడిలోనికి వచ్చి "ఇల్లువాకిలి యంతయు నంటుమయమే. కాలుపెట్టుటకైనను అవకాశము లేదమ్మా! ఎట్లు మసలుదుమో తెలియ" దని పలికి పేడనీళ్లతో శుద్ధిచేయ నారంభించెను.

రాజ్యలక్ష్మి యదివిని "వదినె? ఇదివఱకే యంతయు శుద్ధిగావించితిని. మీచేతినీళ్లు పడిఁగాని శుద్ధికాదని మీరనుకొన్నచో మఱియొకమాఱు నీరు జల్లుఁడ"ని పలికెను.

గం—వదినే! ముందునీవు శుద్ధిగలదానవైనఁ గదా. నీచేతి నీళ్లవలన శుద్ధిగల్గును.

రాజ్య—నేను శుద్ధురాలను గానని మీరొక్క రనుచున్నారు. తక్కినవారెవ్వరు ననలేదు.

గం—అవసరము వచ్చినప్పుడు వారును అందురు.

రాజ్య—చూతము కాదు.

ఆవాదము విని సరసమ్మయు, అవధానియు గంగమ్మను లోనికిఁ బిలిచి చివాట్లు పెట్టిరి.

నాఁడు సాయంకాలము. రంగమ్మ రాజ్యలక్ష్మిని జూడవచ్చెను. అప్పుడు వారికిట్లు సంభాషణము జరిగెను.

రాజ్య—రంగమ్మా! మనసంఘము విజ్ఞానసంపన్న మగుదాక మనము సంఘసంస్కరణములకుఁ బూనుకొనుట చాలతప్పు.

రం—నీవు పొరపడుచున్నావు. ఇట్టి సంస్కరణములు జొనిపినఁ గాని సంఘము విజ్ఞానసంపన్నముకాదు.

రాజ్య—నేనందుల కంగీకరింపను. నాప్రియుఁడు సంఘసంస్కర్తయే. అతఁడు నన్ను సంశయింపక వరించినాఁడు. అతని కుటుంబమంతయు నిందులకు విరుద్ధము. అతఁడిప్పుడు నన్నును వదలలేడు. పిత్రాది బంధుజాలమును విడువలేఁడు. పలుచిక్కులు పడుచున్నారు.

రం—ఏమా చిక్కులు.

రాజ్యా—నాయత్తవారు నాతోఁగూడఁ గుమాగుసి లోనికి రానీయరు ప్రమాణించి తెచ్చిన నన్నాయన వదలలేరు. పోనిమ్ము, మే మిర్వురము కలిసి వేఱుగా నున్నచో, వారి కుటుంబమును విడదీసిన దాననగుచున్నాను. కడకాలమునఁ దల్లిదండ్రులకుఁ బుత్త్రిసాహాయ్యము లేకుండఁ జేయుట మహాపాపము గదా!

రం—అందఱును గలిసి యున్నచో మహాపాపము లేదుకదా?

రాజ్యా—కలియుట యెట్లు?

రం—అవలీలగా,

రాజ్యా—సంఘ మంగీకరించునా!

రం—తప్పక.

రాజ్యా—నాకు నమ్మకము లేదు.

రం—మీరిల్లుకొన్నారఁట. గృహప్రవేశము ఎప్పుడు?

రాజ్యా—రేపు.

రం—సంతర్పణము చేయుదురా!

రాజ్యా—వచ్చువారెవ్వరు?

రం—నేఁ జెప్పినట్లు నడుతువా!

రాజ్యా—తప్పక.

రంగమ్మ! వెడలిపోయెను. సాయంకాల మాఱుగంటలుకొట్టు సమయము నొకపురుషుని గొనివచ్చి రాజ్యలక్ష్మితో “అమ్మాయీ! ఇతఁడెవ్వరో తెలియునా! ఈయన ఈయూరికి గిరీటము. గొప్పపండితుఁడు ఇతని పేరు చలమయ్యశాస్త్రి. నిన్ను జూచుటకు వచ్చెను. ఇట్టి పండితుని సత్కరించుట నీకుమేల”ని చెప్పెను.

రాజ్యలక్ష్మి యతనికి నమస్కరించి రంగమ్మయనుమతిని పది రూపాయిలు తాంబూలములోఁ బెట్టి యిచ్చెను.

రంగమ్మ చలమయ్యశాస్త్రికి రాజ్యలక్ష్మి వృత్తాంత మంతయును విన్నవించి మఱునాడు వీరియింట గృహప్రవేశమును సత్యానారాయణ వ్రతమును జరుగును. నీవు గ్రామస్థులతో వచ్చి కార్యముజరిగించి, సంతర్పణ భోజనముచేసి తృప్తిచెంది వీరినిసంతృప్తులనుగాఁ జేయవలయును అని పలికెను.

చల—అట్లేచేసెదనమ్మా! ఇట్టియుత్తమురాండ్రు సత్కార్యము గావించెదమనిన నిర్బంధింతుమా! కాని నాదియొకమనవి. సత్కార్యమాచరించునప్పుడు కొన్ని దానములు చేయవలయును.

రం—అభ్యంతరమేమి? తప్పకచేయుదము.

చలమయ్యశాస్త్రి వెడలిపోయెను. రంగమ్మయుఁ గొంచెముసేపు లక్ష్మితోఁ బ్రసంగించి వెడలిపోయెను.

రాజ్యలక్ష్మి భర్తతో నాలోచించి గృహప్రవేశమునకును, వ్రతమునకును సంతర్పణమునకును, దగిన సంభారములు సమకూర్చించెను.

రాజ్యలక్ష్మి తొలినాఁడే వంట బ్రాహ్మణులను రప్పించి వారడిగినంత సొమ్మిచ్చెదనని చెప్పి మఱునాఁడు పదిగంట లగునప్పటికి నాల్గు పిండి వంటలతో భోజనము సిద్ధపఱుపవలయునని చెప్పెను. దానికి వారంగీకరించి తెల్లవాఱుజాముననే వంట ప్రారంభించిరి. రాజ్యలక్ష్మి వారికిఁ గావలసిన సంభారమంతయు వారల కప్పగించి యుదయము కాఁగానే భర్తతో వెళ్లి యూరివారి నందఱను భోజనమునకుఁ బిలిచివచ్చెను.

సూర్యోఁదయి దాఱు గడియల ప్రొద్దెక్కునప్పటికి రాజ్యలక్ష్మియు భర్తయు నభ్యంజన స్నానములాచరించి పట్టుబట్ట ధరించి మంగళధ్వనులు చెలరేఁగ గృహప్రవేశ కర్మార్థము కూర్చుండిరి. ఆధ్వనులు విని యూరిలోని బ్రాహ్మణబృందము "క్షత్రియుల యిండ్లలోను వైశ్యుల యిండ్లలోను శూద్రుల యిండ్లలోను శుభాశుభములు జరుగునప్పుడు పోయి సంభావనలు తెచ్చుకొనుచున్నాము కామా! అట్లేసంభావన తెచ్చుకొన్న నేమి నష్టమని కూడఁబలికికొని శివావధానిగారి యింటికి వచ్చి కూర్చుండిరి. చలమయ్యశాస్త్రి కూడ వారితోవచ్చి గృహప్రవేశము ముగించి వెంటనే సత్యనారాయణ వ్రతమును గూడ నారంభింపఁజేసి ముగింపఁజేసెను. పిమ్మట బ్రాహ్మణాశీర్వాదము కూడ జరిగెను.

అనంతరము చలమయ్యశాస్త్రి సభలో నిలువఁబడి యందఱును విననిట్లు బలికెను. "ఓసభాసదులారా! ఓపండిత వర్యులారా! మన మిత్రుఁడు శివావధాని నిజముగా శివుఁడే. అతని యదృష్టవశమున నుత్తమురాలగు కోడలు లభించినది. ఆకోడలు నిజముగా లక్ష్మియపరావతారమే. కాని మానవికాదు. మన మిత్రునకట్టి శ్రేయస్సు లభించినందులకు మన మందఱము సంతసింపవలసినది. యువతీ వివాహము సంఘమునకు గర్హ్యముకాదాయని యడుగవచ్చును. కాని

కాదు. రజస్వలా వివాహము సంఘ మంగీకరించినది. దాని నందఱును జేయుటయే దానికి నిదర్శనము. మన ధర్మశాస్త్రములు పదేండ్లు మీఱిన కన్యక రజస్వలయనియే నిర్ణయించినవి. ఈసదుఘ జరిగిన వివాహములందుఁ గన్యలకుఁ బదేండ్లకుఁ దక్కువనగా నెక్కుడను లేదు. దీని నాలోచింప సంఘమంతయు ధర్మశాస్త్రమునకు విరుద్ధముగా నడిచినదని స్పష్టమయినది. సంఘమంతయు ధర్మశాస్త్రమునకు విరుద్ధముగా నెప్పుడు నడచెనో యప్పుడు శాస్త్రమునకుఁ బ్రాబల్యము లేదన్నమాట. ఆశాస్త్రము సంస్కరింపఁ బడవలెనని స్పష్టమగుచున్నది. మన మన్నివివాహములందును సంకోచము లేకుండ భుజించి యిప్పుడీ నిర్బంధ మేల? కావున మీరందఱును భోజనమునకు శీఘ్రముగా దయచేసి మండపదాన సమయమున దంపతులుచేయు దానములను స్వీకరించి వారిని కృతార్థులను జేయ వేడుచున్నాను'' అని పలికి దానముల కర్హులగు వారి పేళ్లును గూడఁ జదివెను. ఆగ్రామమందు ముఖ్యులగు వారి పేళ్లు చదువఁబడుటచే వారందఱు నిండ్లకుఁ బోయి స్నానాదు లాచరించి కొంచెము కాలములోనే వచ్చిరి. ఈవిషయమై కొంచెము పట్టుదలచూపెడు పెద్దలకుఁ దలకొక దానమును జేయించి పదేసి రూపాయ లిచ్చుటచే వారందు అత్యానంద భరితులైరి. ఇఁక యువతీ వివాహము పేరెత్తినవారే లేరు. పలువిధములగు పిండివంటలతోఁ గంఠ పూర్తిగా భుజించి రాజ్యలక్ష్మి కేవలమును సావిత్రీ దేవియేయని పొగడుచు నామె యొసఁగిన దక్షిణాతాంబూలములు స్వీకరించి వెడలిపోయిరి. నాటి సంతర్పణములో బయ్యావారి సుందరమ్మయు గంగమ్మ సత్తెమ్మలు మాత్రము భుజింపలేదు. కాని యూరివారందఱునువచ్చి భుజింపక యుండలేదు. గంగమ్మయు సత్తెమ్మయుఁ బ్రత్యేకముగా వచ్చి భుజింపకపోయినను తల్లిచేఁ బిండివంట తెప్పించుకొని వంటయింటివెనుకాలనక్కి గుటార్చ్చుకొని తినకపోలేదు.

నాటితో నరసమ్మకును శివావధానికిని గూడ సంశయము తీఱినది. నాటిరాత్రియే కోడలిని లోపలికిఁబిలిచి యామె వడ్డింపగా గొడుకుతోఁ గూడఁగలిసి భుజించిరి. ఊరివారందఱునువచ్చి భుజించుటచేఁ గాంతమ్మ గాని గంగమ్మ సత్తెమ్మలు గాని యేమియు ననఁజాలకపోయిరి.

అనంతరము రాజ్యలక్ష్మి సంతుష్టురాలై తాముకొన్న పెంకుటింటికిని దాటాకుల యింటికిని బ్రాకారపు గోడ పెట్టించి దాటాకులిల్లు వంటయిల్లుగాఁజేసికొని పెంకుటిల్లు పడకటిల్లుగాఁజేసికొని యాఁడుపడుచులతోను, అత్తమామలతోను, భర్తతోను సుఖజీవనముచేయుచుండెను.

హిందూసంఘమునకు వృద్ధికరమో హానికరమో సరిగా నిర్ణయింప లేము, కాని శారదాశాసనము మొత్తముపై హిందూదేశమునంతటిని యూటాడించి విడిచినది. కొందఱుసంఘాభివృద్ధికిఁ గారణమని పొంగిపోవు చుండిరి. కొందఱది సంఘనాశమునకుఁ గారణమని విచారింపసాగిరి. మఱియు నవనాగరకు లీశాసనము నాదరించి యెంతసంతసించు చున్నారో, పూర్వాచార పరాయణులంత సంతాపమునందుచున్నారు, ఏమయినను దొరతనమువారు దీనికనుకూలురగుటచే శారదాబిల్లు చట్టమై నిరంకుశముగా వర్తింపసాగినది. ఏవిషయమందును స్వాతంత్ర్య ములేని హిందూసంఘమునకుఁ దమపిల్లలకు వివాహము చేసికొనునట్టి స్వాతంత్ర్యముకూడ లేకుండఁ జేయుట దొరతనమువారికిఁ దగదనియు, నిది శాసనబద్ధముగాఁ జేయుట యక్రమమనియు దేశనాయకులు కొందఱు వాదింపసాగిరి. కాని లాభము లేకపోయినది. బాల్య వివాహము లొనర్చుటవలన సంఘము హానిగల్గుచున్నది. కాని నీదురాచార మును శాసనమూలముగా నిర్మూలింపక తీఱదని నవనాగరకుల వాదము.

మనదేశమున సంఘమునకును, మతమునకు, అవినాభావసంబంధముఃకలదు. కాన సాంఘిక కృత్యములన్నియు మతవిషయములే యనియు మతవిషయమై జోలికల్గించుకొనుట దొరతనమువారి నిరంకుశత్వమును వెల్లడించుచున్నదనియుఁ, గావున శారదాబిల్లును జట్టముగాఁ జేయుట యన్యాయమనియు, ఈ విషయములోఁ బరదేశములను సాటిగొనివచ్చుట తగదనియుఁ బూర్వాచారపరాయణుల వాదము.

ఈరెండువాదములను జర్చింప నవనాగరకవాదము స్థూలదృష్టిచే మాత్రము పరిశీలింపఁబడినదనియుఁ, బూర్వాచార పరాయణుల వాదము సూక్ష్మదృష్టిపరిశీలితమనియుఁ దోఁపకపోదు. నాగరకవాద మాపాతరమణీయముగా నున్నను, సనాతనుల వాదమంత హేతుమంతమై చూపట్టదు. సనాతనుల వాదమిది.

హిందూసంఘమునకు జాతీయతాధర్మము మతము. హిందూమతం వేదశాస్త్రప్రబృంహితము వేఱుచెప్పనక్కఱలేదు. జాతీయత నశించిన జాతినశించును గాన జాతీయతను ప్రత్యేకముగా నుంపక ఋషులు ప్రతివిషయమునందును మతముతో సంబంధింపఁ జేసినారు. అందుచే హిందూసంఘ కృత్యము కేవల మైహికములుగాక యాముష్మికములు గూడ నైనవి. మనముచేయుఁ బ్రతికార్యమును శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థమై చేయుచున్నట్లు మొదటనే సంకల్పించుకొనుచున్నాము. తుదకు గర్భాధానము నంటిదికూడ మతముతో సంబంధించినది. ప్రతిసాంఘిక కృత్యమును, బ్రతిసాంఘిక ధర్మమును, మతముతో సంబంధించుటచేతనే మన హైందవ మతము దృఢపడి పరదేశీయుల నుండి యెట్టియాపదలు సంప్రాప్తమైనను, చెక్కు చెదరకుండ యిప్పటి వఱకొక్క విధముగా నలరారుచున్నది. సాంఘికములగు షోడశకర్మములవలెనే షోడశదానములును మతముతో సంబంధింపఁ జేయఁబడినవి. ఇంతేకాక షోడశమహాదానములును మహాఫలకములని ఋషులు నిర్ణయించిరి. ప్రతిహిందువును దానియందుఁ బరమవిశ్వాసముగలవాఁడై యున్నాఁడు. అందుచేఁ దానొక దానముచేసినచోఁ బరలోకమునఁ దనకది శ్రేయస్కరమగునని నమ్ముట సహజము.

ఇంతేకాక ఋషులు దానమునకుఁ గావలసిన దేశకాలపాత్రములనే కాక దానముచేయఁబడు వస్తువు యోగ్యతనుగూడ నిర్ణయించినారు. గోదానము చేయఁబడినచో గోవు సవత్సమై క్షీరదాయినియై యుండ

వలెననిరి. అట్లే కన్యాదానవిషయమై కూడఁ గొన్నియంశములు నిర్ణయించిరి. కావుననే "అష్టవర్షాభవేత్కన్యా" యను శాసనము పుట్టినది. అట్టికన్యను దానముచేసినచో "దశపూర్వేషాం, దశాపరేషాం, పితౄణాం బ్రహ్మలోకసిద్ధ్యర్థం సాలంకృతాం కన్యాదానమహం కరిష్యే" యని సంకల్పించుకొనుచున్నారు. నిజముగా నట్టి ఫలముగల్గునని నమ్ముచున్నారు. పితృదేవతాముక్తికై కన్యాదానము చేయవలెనని శాస్త్రము నుడువుచున్నది. హిందువులు దానిని నమ్మికొని కన్యాదానము చేయుచున్నారు. ఈ పద్ధతి సంఘమందుఁ జిరకాలమునుండి వచ్చుచున్నది. ఇట్లుండ నాముష్మికఫలసిద్ధి కోరువారు కన్యాదానము మాని యువతీదాన మెట్లు చేయఁగలరు? వైతరణీనద్యుత్తరణార్థము గోదానము చేయవలసియుండ అజాదానమో మహిషీదానమో చేసిన నిష్టసిద్ధి పడయఁగలరా? కన్యాదానమువలనఁ బితృదేవతలకు ముక్తిగల్గునని నమ్ముట మూఢవిశ్వాసమనుట యనాలోచితము. వేదశాస్త్రచోదితములగు ప్రత్యంశమును నమ్మి పనిచేయుచున్న మనమీ విషయమొక్కటియు విశ్వాసార్హమనుట తగదు. సనాతను లిన్నివిషయము లాలోచించి మానవునకుఁ గల్గుశ్రేయస్సును విడిచి పుచ్చుట తగదని చెప్పుచున్నారు.

నవనాగరకులు బాల్యవివాహములవలనఁ బెక్కురు వితంతువులగుచున్నారు. అందువలన వారు సర్వశ్రేయములకును జెడుచున్నారు, కావున యువతీవివాహములే కావలెననుచున్నారు. బాలికలకుఁ గాక యువతులకు వివాహము గావించినచో అప్పుడుమాత్రము వితంతువుల సంఖ్య తీఱుగునా! బాలవితంతువులకు బదులుగా యువతీవితంతువులు సంఖ్యయందు హెచ్చుగా నుందురు; ఇందువలన సంఘమునకుఁ గల్గు మేలేది? ఏ విధమైన లాభమును గల్గనప్పుడు సనాతన ధర్మమెందులకు మార్పవలెనని సనాతను లడుగుచున్నారు.

ఈ వాదములందేది ప్రబలమో యేది దుర్బలమో నిర్ణయించువారు చదువరులు.

శారదాబిల్లు చట్టమగునని తెలియఁగనే హిందువులు చెందిన యాందోళనమునకు మేరలేదు. పట్టణములందును, పల్లెలయందును, జరిగిన బాల్యవివాహములకు హద్దులేదు. తమమతమునకు మహాప్రమాదము వచ్చినదని భావించి పండితులును, బ్రాహ్మణులును, ధనికులును, దరిద్రులును నాల్గయిదేండ్లకుఁ దరువాతఁ జేయవలసిన వివాహములన్నియు నప్పుడే చేసినారు. ఘట్టకుటీప్రభాతన్యాయమునవలె బాల్యవివాహముల నిర్బంధింపఁదలచిన శారదాశాసన మత్యంతబాల్యవివాహములకుఁ గారణమైనది.

రాజ్యలక్ష్మి చేయించిన గృహప్రవేశసంతర్పణమున దరమరలేకుండ నా యూరివారందఱును భుజించి వెళ్ళినప్పటినుండియు గంగమ్మ నత్తెమ్మలభావములు మాఱినవి. ఇఁక వదినెగారి విషయమై యేమియు నాడక క్రమముగా నామె చెంతకువచ్చి కూర్చుండి యేదియో సంభాషించుచుండిరి. రాజ్యలక్ష్మితో కలహించి వేఱుపడియుండుట కంటె నామెతోఁ గలసి కావలసినప్పు డర్ధమో, రూపాయియో పుచ్చుకొని కావలసినవస్తువులు కొని యనుభవించుట మేలని భావించిరి. రాజ్యలక్ష్మి వారి పేదతనమును గాంచి జాలిపడి వారడిగినప్పు డిచ్చుచుండెడిది. అదిచూచి కాంతమ్మగూడఁ బిల్లలేడ్చినప్పుడు రాజ్యలక్ష్మి గదిలోనికరిగి పిల్లలకేమైన నిప్పించుచుండెడిది. కాంతమ్మ పెద్దకూతున కైదేండ్లు, రెండవదానికి మూఁడేండ్లు. రాజ్యలక్ష్మి కాంతమ్మతో నిట్లు ప్రసంగించెను.

రాజ్య—ఈ పిల్లలకిద్దరకును బెండ్లియైనదా?

కాం—అవును. శారదాబిల్లునకు భయపడి ముడిపెట్టినాము.

రాజ్య—ఏమమ్మా! శారదాబిల్లంత భయంకరమైనదా!

కాం—సంఘసాంప్రదాయములకు విపరీతముగా వర్తించుట భయంకరము కదా?

రాజ్య—ఈమూఁడవపిల్ల ఏమాటయో? దీనికిఁగూడ వివాహము చేయవలసినది.

కాం—అప్పటికిది పుట్టలేదు. లేకపోయిన నట్లే చేసియుందుము.

రాజ్య—ఆహా! హిందూసంఘమింకను నెంత యధోగతిపాలయియున్నదో చూడుఁడని యింగ్లీషుభాషతో భర్తతో ననెను.

రా—రాజూ! నీవుచెప్పిన దానియందు గొంతసత్యము లేకపోలేదు. కాని కొందఱకు యువతీవివాహములు కిట్టవు. ఏమి చేయఁగలము.

రాజ్య—వదినె! మీమూఁడవపిల్లకు శారదాచట్టము ప్రకారముగా నెట్లయినను వివాహము చేయకతీఱదు. అట్టిచో ఈ యిరువురకును బెండ్లిజేసినంతమాత్రమున నేమిలాభము? ఎట్లయినను సంప్రదాయవిరుద్ధముగా నడవక తీఱినదికాదు కదా!

కాం—అవును, ప్రస్తుతమాగండము గడచినచోఁ దరువాతచూచి కొందము. మన సంఘమంతయుఁ గలసి దొరతనమువారితో వాదించి శారదాశాసనము రద్దుచేయింపక మానదని యనుకొన్నాము.

రాజ్య—హిందువులలోఁ బెక్కండ్రందుల కనుకూలురై యుండగా నది యెట్లు రద్దుచేయఁబడును? ఇంతేకాదు. అట్లు చిన్నపిల్లలకు వివాహమొనర్చినవారలు శిక్షాపాత్రులగుచున్నారు.

కాం—ఇదేమి ఘోరమమ్మా! మన పిల్లలకు మనము పెండ్లిచేసికొనుట యపరాధమఁట!

రాజ్య—మనయిల్లు మనము తగులఁబెట్టుకొనుట యపరాధము కాదా? శాసనోల్లంఘనము మహాపరాధము.

అంతలోఁ బోలీసువారిచే వెంబడింపఁబడిన యొక పురుషవ్యక్తి యచ్చటికి వచ్చెను. వేషమునుబట్టి కాని భాషనుబట్టి కాని యతఁడు బ్రాహ్మణుఁడనుట కవకాశములేదు. అతఁడు మలినవస్త్రధారియై చుట్టగాల్చుచు, కన్నులు రక్తకాంతుల నుమియుచుండ, బాగుగా బెంచి ముడివేయఁబడిన కేశపాశమును, చేతుల వెండిమురుగులును, చెవుల నెఱ్ఱపోగులదుద్దులును, అతని యనాగరకత్వమును జాటుచుండ శివావధానిగారి చావడిలోనికి వచ్చెను. పోలీసువారికి భయపడి పిల్లలింటిలోనికిఁ బర్వేత్తకపోయినచో వారివలన వచ్చినవ్యక్తి యెవ్వరో రాజ్యలక్ష్మికి స్పష్టముగాఁ దెలిసియుండునుగాని యట్లు జరుగలేదు. రాజ్యలక్ష్మియు తనరూపమును గాంచి, యతఁడును, అతని యనాగరకవేషమును జూచి రాజ్యలక్ష్మియుఁ బరస్పరమును వింత పడఁజొచ్చిరి. కాంతమ్మ మొదలగువారు లోపలనుండుటచే నితనిని జూడలేదు. ఇంతలో రామారావు పేటనుండియో వచ్చి "ఓయీ! బావా! యిప్పుడే వచ్చుచున్నట్లున్నది" అని పల్కరించి యతని సమాధానమునుఁ బ్రతీక్షింపకయే "రాజూ! ఇతనిని నీ వెఱుఁగవు. ఇతఁడు మా పెద్దబావ" అని చెప్పెను. రాజ్యలక్ష్మి యతని నెగాదిగఁ జూచి "బాగున్నది. కాంతమ్మకుఁ దగినభర్తయే" యనుకొని యీ కుటుంబములోఁ దనభర్త తప్పఁ బుట్టెనని భావించుకొనుచుండెను. అంతటఁ గాంతమ్మయుఁ, దల్లియుఁ, బిల్లలును చావడిలోనికి వచ్చిరి. పిల్లలు తండ్రిని కౌగిలించుకొని చుట్టుముట్టిరి. "ఏమోయి, సుబ్బయ్యా! చాలకాలమునకు వచ్చితివి" అని నరసమ్మ పల్కరించెను.

కాం—పెండ్లము పిల్లలును ఇంతకాలమునకు జ్ఞాపకమునకు వచ్చిరి కాఁబోలును!

సు—ఇప్పుడును జ్ఞప్తికి రాకయుందురు. కాని గట్టిచిక్కు సంభవించినది.

న——అంతచిక్కేమిటి?

సు——చిన్నపిల్లలకు పెండ్లిచేసినందులకు శారదాశాసనమును బట్టి నన్ను శిక్షించినారు. ఏబదిరూపాయిలు జుల్మానా యిచ్చినను సరియే లేక యారుమాసములు ఖైదులోనున్నను సరియే.

న——అయ్యో! అయ్యో! యని యేడ్వనారంభించెను.

కాం——జుల్మానా యిచ్చుటకు సొమ్మెక్కడ! పోయి ఖైదులోనే యుండండి.

సు——ఓసి! భానిసిముండ! నన్ను ఖైదులోనికిఁ బొమ్మనుచున్నావా?

కాం——సొమ్ములేనప్పు డేమిచేయుట!

సు——సొమ్మెందుకులేదు. నీమెడలో నానుపట్టెడయున్నది కాదా!

కాం——ఉండదుగాక! అది నేనియ్యను.

సు——ఇయ్యకపోయిన బలాత్కరించికొని పోవుదును.

కాం——నా నగలన్నియు సమ్ముకొనగా నీ పట్టెడే కాదండీ! మిగిలినది. ఈయొక్కటియుఁ గూడఁ బట్టుకొని పోవుదురా! ఇది న్యాయమా!

సు——న్యాయమో, అన్యాయమో! అదంతయు నాకుఁ దెలియదు. నా సౌఖ్యముకంటె నీనగలు హెచ్చాయేమి? నేనిప్పుడు పెండ్లిండ్లు వలదనగా బలాత్కరించి చేయించినదానవునీవు, కారాగృహావాసమనుభవించుట నేనా?

కాం——రెండువేల రూప్యములు వచ్చునుగదాయని పెండ్లిండ్లు చేయుఁడన్నాను. వెఱ్ఱిదాననై చేయుఁడనలేదు.

సు——ఆ రెండువేలును పిల్లలు పెద్దలైనప్పుడు మాత్రమ్ము రావాయేమి!

కాం—అప్పుడు వివాహములు చేయుటవలనఁ గల్గిన లాభమింకను మీకు బోధపడనేలేదు.

సు—ఏమి ?

కాం—ఏమందురేమి ? శారదాబిల్లునకు భయపడి ముమ్మరముగా వివాహములు జరుగుటచే కర్చులెంతయో తక్కువ ! ఏమందురా ! అందఱిలోపలను పెండ్లిండ్లగుటచేఁ బెండ్లికొడుకు నాత్మబంధువులుకూడఁ బెండ్లికి రాఁ బోసఁగలేదు. ఉభయపక్షములువారును గలిసినను, పదిమంది నైనను లేరు. ఆ పదిమందికైనను, అప్పడములు, ఒడియములు, మినుపసున్ని, అడుకులు బెట్టనక్కఱలేకపోయినది. అంతతో నయినదా ! పల్లకీ బాజాభజంత్రీలు మొదలగునవి లేకపోవుటచే మనము బత్తెములియ్యనక్కఱ లేకపోయినది. ఇన్ని లాభములు మనకెట్లుగల్గును ?

సు—అగుఁగాక ! ఇప్పు డేఁబది రూపాయిలు జల్మానా యిచ్చుకొనవలెగదా ?

కా—మూఁడు నాల్గువందలు మనకు లాభించునప్పు డేఁబది రూపాయిలిచ్చుకొన్న మనకు నష్టములేదు.

సు—నష్టములేదు. కాని యిచ్చుకొనుటకు సొమ్మో.

కాం—పిల్లలదగ్గర తిండికై పుచ్చుకొన్న రెండువేలును మీదగ్గర నున్నవికావా ! అందులోనివి యేఁబదిరూపాయిలు పరిహారమిచ్చుకొందు.

సు—ఆ రెండువేలు నప్పుడే వ్యయమైనవి. అవి యెక్కడనున్నవి ; కావున నేనీనాను పట్టెడ ఇమ్మనుచున్నాను.

కాం—ఏమైనను సరియేకాని నేను నానియ్యనండి ?

సు—ఇయ్యకున్న నెటు ? నేను జైదులోఁ నుండవలసినదే !

కాం—ఉండండి, పైనుండిమాత్ర మేమిలాభము. మీరు పెండ్లము ను బోషింపనా! పిల్లలను బోషింపనా! అంతేకాని జుల్మానా యియ్యకండి.

సు—వెఱ్ఱిముండ! ఇదియా! నీపతిభక్తి?

కాం—భక్తిచూపవలసినంత యోగ్యత పతియందు లేనప్పుడు?

సు—న్యాయం దేమి లేదు?

కాం—ఏమి లేదని ప్రశ్నించుచున్నారా? ఏమియును లేదు. పిల్లల దగ్గఱ పుచ్చుకొన్న రెండువేల రూపాయిలలోను నొకదమ్మిడియైనను గుటుంబమునకు వెచ్చించినారా! రమారమి ఒక సంవత్సరమైనది నన్ను బుట్టినింటికిఁబంపి. పెండ్లము పిల్లలు బ్రతికినారో, చచ్చినారో యొకసారియైనను జూడవచ్చినారా? ఆముసలివాఁడు ముష్టియెత్తి యేదో యింత తిండిపెట్టుటచే బ్రతికినాము, కాని లేకపోయిన మాగతి యేమగును? ఇప్పుడు జుల్మానా సహాయ్యములకై నాయొక్క వస్తువును గొనిపోవచ్చినారా! మీనడత యేమి బాగుగా నున్నదండి! చాలు, చాలు, వచ్చినదారిని బొండి.

అంతసుబ్బయ్య కుపితుఁడై కాంతమ్మ కొప్పు పట్టుకొని కొట్టి "ఓసి ముండకాన! నీప్రాణములు పుచ్చుకొనసయైన నీమెడలోని వస్తువు తీసి కొకుండ వెళ్లువాఁడనుగా"నని యామె మెడవంచి నానునీల త్రిప్పు చుండెను. అది చూచి పిల్లలు గోలుగోలున నేడువఁజొచ్చిరి. కాంతమ్మ తల్లియుఁ జెల్లెంద్రునుగూడ నేడ్చుచుండిరి. అంతలో రామారావువచ్చి తన యక్కయ్యను విడిపింపనెంచెను. కాని యెంతపెనఁగులాడినను లాభము లేకపోయెను.

అప్పుడు రాజ్యలక్ష్మి సుబ్బయ్య చేతినిబట్టుకొని "అన్నా! ఇది తగదు. కళత్రము నిట్లు పరాభవించుట తగదు. నిండుచూలాలి నిట్లు ప్రయాసపెట్టుట న్యాయముకాదు. వదలుము. వదలుము" అని గట్టిగాఁ

బల్కఁగా, సుబ్బయ్యభార్య కొప్పును విడిచెను. అంత కాంతమ్మ భర్తను నెట్టుచు లోనికిఁబోయెను. ఈ కలహము విని యూరివారందఱును మూగి సుబ్బయ్యను బలువిధములఁ దిట్టనారంభించిరి.

తమ స్త్రీజాతికి సంభవించిన పరాభవమును జూచి సహింపలేక రాజ్యలక్ష్మి తనపెట్టెలో నుండి యేఁబదిరూప్యములు తీసి సుబ్బయ్య కిచ్చెను. అతఁడవి పోలీసువారికిచ్చి విముక్తుఁడయ్యెను. రాజ్యలక్ష్మి తనకొనర్చిన మహోపకారమున కానందించి యామెను దీవించుచు నా పూట భుజించి పొమ్మని యెంత చెప్పినను వినక సుబ్బయ్య యా యెండలో వెడలిపోయెను.

అంత కాంతమ్మ వెలుపలికివచ్చి రాజ్యలక్ష్మినిగాంచి "అతనికి సొమ్మెందుల కిచ్చితివి? ఒక నిమిషముండి యతఁడే వెడలిపోయెను" అనెను.

రాజ్య—అదెట్లమ్మా! ఏబదిరూప్యము లియ్యకపోయిన కారాబద్ధుఁ డగును.

కాం—కానిమ్మ. అది యిప్పుడు గౌరవాస్పదమే కదా!

రాజ్య—(నవ్వుచు) కాదు. అపరాధులకు అది దుష్కళంకమే. కేవలము దేశమునిమిత్తము వర్తించి కారాబద్ధులయినవారికి మాత్రమే గౌరవము.

కాం—ఊరకుండెను.

న—తల్లీ! ఇట్లెందఱ యాపదలు తీర్పఁగలవు.

రాజ్య—నాపతికి సంబంధించిన వారందఱును నాకుఁ బూజ్యులు. వారియందు గౌరవము చూపుట ధర్మముకదా!

న—నీవు సొమ్మియ్యఁబట్టి యతఁడు కదలెను. కాని లేకపోయిన శనిగ్రహమువలె మా యింటివారి నందఱను బాధించును.

రాజ్య—పాపమతఁడేమి చేయును? ఇచ్చుట కతనియొద్ద సొమ్ము లేదు. వదినెగారా యొక్క వస్తువునిచ్చుటకు సమ్మతింపలేదు. అతఁడు మంచిచెడ్డ లాలోచింపక ముదుకరియై నిండుగర్భిణియగు నామెను గొట్టించుచున్నాఁడు. ఆప్తబాంధవియగు సమానజాతి స్త్రీయట్టి యిక్కట్టులు పడుచుండఁజూచి యెట్లు సహింపఁగలను?

ఆమె మాటలకా కుటుంబమువారు మాత్రమే కాక యూరివారు గూడ మిగుల సంతోషించిరి.

గృహప్రవేశసంతర్పణము నాటనుండియు గంగమ్మ సత్తెమ్మలు గర్వమడంచుకొని రాజ్యలక్ష్మి నాదరగౌరవములతోఁ జూడసాగిరి. ఇంతే కాక తమబావకు సొమ్మిచ్చి కారాగారమునకుఁ బోకుండఁజేసినందులకు వారు మఱింత సంతసించి యామె యుత్తమోత్తమోదార స్వభావమునుగాంచి తామొనర్చు పనులకుఁ దమలోఁ దామె సిగ్గుపడఁ జొచ్చిరి. తామెంత యనాదరము చూపుచున్నను సరకుగొనక తమ కుటుంబమునకే కాక తత్సంబంధులను గూడ గౌరవించి యామె చూపుచున్న యాదరమునకు వారు తలయెత్తలేకపోయిరి. అందుచే వారు రాజ్యలక్ష్మి నాదరించి యిదివఱకుఁ దామొనర్చిన తప్పును దిద్దికొన నిశ్చయించిరి. వారు క్రమముగా రాజ్యలక్ష్మిని జేరి వదినే, వదినే అని పిలుచుటయే కాక యామెకు బలువిధముల నుపచారములు చేయసాగిరి. ప్రస్తుతము శివావధాని కుటుంబమంతయును గలిసి భుజించుటచే రాజ్యలక్ష్మిచే గృహకృత్యములు చేయనీయక యావితంతువులే సర్వమును నెఱవేర్చుచుండిరి. చిన్నతనమందె వైధవ్యదుఃఖ మనుభవించుచున్నందులకా వితంతువులు రాజ్యలక్ష్మికి దయనీయులైరి.

ఇప్పుడు వారు తన్నాదరించుచు సకలోపచారము లొనర్చుచుండుటచే మఱింత దయనీయులైరి. చిన్నాడుపడుచు లిరువురును, ఇప్పుడు రాజ్యలక్ష్మి స్నానాదులకుఁ గావలసిన నీరు తోడి యిచ్చుటయే కాక యామె కట్టువిడిచిన వస్త్రములను దడిపి యాఱవేయుచుండిరి. రాజ్యలక్ష్మి మనస్సిప్పుడు మంచిదే. గంగమ్మ సత్తెమ్మల మనస్సుగూడ నిప్పుడు నిర్మలమైన దగుటచే వారిలో భేదముపోయి యైకమత్యము నెలకొనియెను.

వారుకొన్న పెంకుటిల్లు మూడుగదులును, ఒకచావడియును, రెండు వరండాగదులును గలది. వానిలో నొకగది యీ నూతనదంపతులకు శయనాగారము. ముదుసలిదంపతుల కొకటి, తక్కినగదిలో ముగ్గురు తోఁబుట్టువులును పిల్లలతోఁ బండుకొనుచుండిరి. వరండాగదులలో నొకటి వంటకు, రెండవది సామానున కుపకరించుచుండెడిది.

ఒకనాఁడు రాజ్యలక్ష్మి తనగదిలో గూర్చుండి భర్తతో నేదియో సంభాషించుచు నూలు పంటికఱ్ఱకుఁ జుట్టుచుండెను. వెనుక కొన్న బియ్యము సరిపోయినవి. నాటివంటకు బియ్యము లేవు. గంగమ్మ సత్తెమ్మలే ప్రతిదినమును వంటకుఁ గావలసినబియ్యము కొలిచి యిచ్చుచుండుటచే బియ్యము సరిపోయినవిషయము రాజ్యలక్ష్మికిఁ దెలియదు. వారువచ్చి రాజ్యలక్ష్మితో నేమని చెప్పఁగలరు. వారు ప్రత్యేకముగా రామారావును బిలిచి చెప్పిరి. కాని యతఁడుమాత్ర మేమి చేయఁ గలఁడు. భార్యను బియ్యముకొనుమని చెప్పలేఁడుకదా! వారి సంభాషణములు, పిలుపులు, గుసగుసలు మొదలగు నవన్నియుఁ గనిపెట్టియు రాజ్యలక్ష్మి కారణము తెలియనేరక పతిని బిలిచి నూలు చుట్టుచునే విశేషము లేమి యని యడిగెను. అతఁడు చెప్పలేక చెప్పెను. రాజ్యలక్ష్మి ధనమిచ్చి బియ్యము కొని తెమ్మని పతిని బంపెను. అతఁ డట్లు చేసివచ్చి గదిలోఁ గూర్చుండి భార్యతో నిట్లు ప్రసంగించెను.

రా—రాజూ! ఇది బాగులేదు?

రాజ్య—ఏది?

రా—నీవి ట్లెంతకాల మీ పెద్దకుటుంబమును బోషింపఁ గల్గుదు?

రాజ్య—చేతిలో సొమ్మున్నంత కాలము.

రా—పిమ్మట.

రాజ్య—ఈలోపున జీవనోపాధిమార్గ మరయుదము.

రా—ఏమి? అరయుదమో, నాకేమియుఁ దోపదు.

రాజ్య—నాథా! సమర్థులై యుండియు, విద్వాంసులై యుండియు నిట్లధైర్యపడెద రేల?

రా—నేను శక్తిమంతుఁడనే, కాని సామాన్యులవలె రోజుకూలి చేయలేను. చేసితిననుకో, రోజంతయుఁ గష్టపడిన నాల్గణాలు దొరకును. దానితోఁ గుటుంబపోషణమెట్లు?

రాజ్య—ఆనర్సు తరగతియందు ప్రప్రథములుగా జయమందియు, రోజుకూలి చేసికొనవలయునా! ఇన్ని కళాశాలలును, ఇన్ని యున్నత పాఠశాలలు నుండఁగా మీకుద్యోగము లభింపదా!

రా—ఏమో! నాకునమ్మకములేదు. యమ్మేలకుఁగూడ ముప్పది రూపాయల నౌకరీదొరకలేదు. అప్పటికిని బేరములు తప్పలేదు. యమ్మేలును బీయేలును, ఇప్పుడసంఖ్యాకులుగలరు, సంతలోఁ బశువుల బేరమట్లున్నది. ఏపశువుతక్కువ వెలకువచ్చునో దానిని బిలిచికొనిపోవుదురు. అట్లే యెవ్వారు తక్కువజీతమునకు వచ్చెదరో కళాశాలాధ్యక్షులు వారికే యుద్యోగము లిచ్చెదరు. అంతటితోనైనదా! దానికెన్నియో మొగమోటములు. ఎన్నియో యాశ్రయించుటలు. ఎన్నియో సిఫార్సులు కావలెను. ఈబాధలు నేపడలేను. నాకుద్యోగమెట్లు వచ్చును. అంతేకాక చిన్నప్పటినుండియు స్వాతంత్ర్యాభిలాషినై వర్తించు నేను ఇప్పుడు పొట్టపోషణకై తలనమ్ముకొననా? "పొట్టకై తలనమ్మకొన్నట్టి వారి కకట! స్వాతంత్ర్యమలవడునయ్య చెపుమ" అనియొక కవి వ్రాసినాఁడు. పోనిమ్మందుల కంగీకరింతమన్నను, "నాన్కోవాపరేటరునకుద్యోగమా" యని నిరసించెదరు.

రాజ్య—నాథా! అంతవిచారమేల? నాచెంతనింకను సొమ్మున్నది.

రా—ఉండుగాక! ఇంతకుటుంబమును బోషించుట సామాన్యమా, ఊరకకూర్చుండి తిన్నచో సంస్థానములు కూడఁజాలవు. నీచేత

సొమ్మున్నపుడే ధనాదాయమార్గము మఱియొకటి చూచుకొనవల యును.

రాజ్య—నాథా! నాకొకటి తట్టుచున్నది. కాంగ్రెస్సువారి విధానములలో ఖద్దరుపరిశ్రమ యొకటి. అది రెండువిధముల నుపకరించును. అందు ధనాదాయము, దేశసేవ రెండు నిమిడియున్నవి. కావున మన మీయూర స్వదేశవస్త్రనిలయము నెలకొల్పుదము. అందు బట్టలు కొని తేక, మనము నూలువడికి పలువిధములగు వస్త్రములు నేయింతము. ఎట్లనగా, రెండువందల రూపాయిలు ప్రత్తికొని నిలువచేయుదము. అది దూదిచేయించి యేకులు కట్టింతము. మనయింటఁ బెద్ద లేడుగురు గలరు. మన పేడువురమును నూలువడికి బట్టలునేయించినచో మనకుమంచి లాభముండును. ఇందువలనఁ బదుగురు బీదలకుఁ బని కల్పించిన వారమగుదుము. సోమరితనముతోఁ గాలముగడపు మన మందఱమును బనిచేయుటయేగాక మనమందరము కలిసి దినమున కధమపక్షము రెండురూపాయిలు సంపాదించుకొన లేకపోము. మఱియును కద్దరువస్త్రములు కొనియమ్ముటవలనఁ గూడఁ గొంతలాభము రాకపోదు. అందువలన మనకుటుంబయాత్ర సుఖముగా జరుగును. మనకుటుంబము వారందఱును ధనార్జన పరులమగుదుము. ఇంతేకాక దేశసేవ చేసినవారమగుదుము. స్వాచ్ఛంద జీవనము గలవారమగుదుము.

రా—రాజా! బాగు, బాగు, నీచెప్పినది మిక్కిలి కొనియాడదగినది. కాని సొమ్మో!

రాజ్య—మాతల్లిదండ్రులు నాకింకను ఒకవేయి రూపాయలిచ్చుట కవకాశమున్నది. తెప్పించెదను.

రా—పరమసంతోషము.

రాజ్యలక్ష్మి మఱునాఁడు తనతల్లి కొక యుత్తరము వ్రాసెను. మంగమ్మ యదిచూచికొని పేరిశాస్త్రిగారితో మాటాడి "అమ్మాయికి నగలు చేయింతమనుకొన్న సొమ్ము మనయొద్దనున్నది. దానికి రొక్కమేకాని నగలక్కఱలేదట! అందుచే నాసొమ్ము దానికిఁ బంపుదమని" చెప్పెను. అదివిని పేరిశాస్త్రి కానిమ్ము. దానిపెండ్లికిఁ బది వేలకుఁబైగా కర్చుచేయఁ దలఁచితిమి. కాని యందులో వేయిరూప్యములయిన వెచ్చముకాకుండఁ జేసినది. అట్టిచో మన మిచ్చినను నష్టములేదు. సొమ్ముపంపు మనెను.

మఱునాఁడు మంగమ్మ గుమాస్తాచేతికి సొమ్మిచ్చి కూతునకుఁ బంపెను. రాజ్యలక్ష్మి యాసొమ్ము పుచ్చుకొని సంతసించి పతిసాయమునఁ బ్రత్తికొని నిలువఁజేసినది: తమయింటి కెదురుగా నొక తాటాకుల సాల కట్టించెను. ఇంతేకాక యాయూరు సంతలో నెనిమిది రాట్నములు కొన్నది. రెండు ప్రత్తియొలిచికొను రాట్నములు గొన్నది. దూదేకులవారిచే నేకులుకట్టించి చావడిలోఁ గూర్చుండి నూలు వడక నారంభించెను. అత్తగారు వండిపెట్టుచుండఁ దక్కిన యార్వురును నూలువడక నారంభించిరి. మొదట వారికిఁ గొంచెము తడబాటు గల్గినది కాని క్రమముగా మిక్కిలి సన్ననూలు వడకఁ గల్గిరి. రామారావు నాల్గుమగ్గములు పెట్టించి బట్టలు నేయింపసాగెను. పదునేను దినములు గడవగా రాజ్యలక్ష్మి యాదాయ వ్యయములను లెక్కింపగా నిట్లయ్యెను.

పీసె దూదివెల ఎనిమిదణాలు.

అది నూలువడుకుటకు వ్యయములేదు.

ఒకపీసె నూలుతో పదాఱుమూరచాపు సిద్ధమయ్యెడిది.

చాపువెల మూడురూపాయలకుఁ దక్కువ లేదు.

చాపు నేతకూలి పం(డెండణాలు, పోగా రెండురూపాయల నాల్గ ణాలు వచ్చుచుండెను. దూదివెల నందులోనుండి తీసివేయగా చాపు నకు రూపాయి పం(డెండణాలు లాభము గల్గుచుండెను. ఇట్లు నెల యగునప్పటికి ముప్పదియో నలువదియో యాదాయము గల్గుచుం డెను. రాజ్యలక్ష్మి భర్తకా వైనమంతయును దెలిపి యొకనెల కాగానే వారినందఱను జూచి యీ నెలలో వడికిన నూలున కిట్లు సొమ్ము వచ్చినది.

సత్తెమ్మవదినె నూలు ఎనిమిదిరూప్యములు.
గంగమ్మవదినె దేడురూప్యములు.
కాంతమ్మవదినెదియు ఏడురూప్యములు.
మామగారిది పదిరూపాయిలు.
అత్తగారి నూలు ఆఱురూపాయిలు.
నా నూలు పదిరూప్యములు.
నా పతిది యెనిమిదిరూప్యములు.

అని యెప్పటికప్పుడు నూలుతూచి లెక్కించి వెలయేర్పాటు చేయుటయే కాక తొలినెలలో వారివారి కాసొమ్ము పంచిపెట్టినది. అందువలనఁ బ్రతివారికిని బ్రోత్సాహ మెక్కుడుగాకా మఱింత శ్రద్ధ పూని ప్రతివారు నొకరికంటె నొకరు మించుటకుఁ బ్రయత్నించి సన్న ముగాను, ఎక్కువగాను నూలుదీయ నారంభించిరి. అందువలన సొమ్మునుకొనుటకంటె నధికముగానే రానారంభించెను. దానివలన శివావధాని కుటుంబము సుఖముగా జీవింపఁగల్గెను. కుటుంబములోని ప్రతివారును నెలకింతోయంతో ధనమార్జించుటచేఁ గొన్ని నెలలగు నప్పటికి సమస్తవ్యయములును పోగా గొంతసొమ్ము మిగులుచుండెడిది. రాజ్యలక్ష్మి యది మామగారి కిచ్చుచుండెడిది.

కుటుంబమం దొకరైనను, బుద్ధిమంతులును సముత్సాహవంతులు నున్నచో నాకుటుంబ మెప్పుడును కష్టములపాలుకాదు. రాజ్యలక్ష్మి యట్టిపని ప్రారంభించినది కనుకనే శివావధాని కుటుంబము బాగుపడి నది. సర్వదా చావడిలోగూర్చుండి గోళ్లు చిదుముకొనుచుఁ జీలికయ్య ములాడుకొను శివావధాని కూతుండ్రందఱును ధనార్జనపరురాండ్ర యిరి. శివావధాని యాచనవృత్తి తొలఁగినది. రామారావునకు సేవావృత్తి తొలఁగినది. ఇతరుల సాయమక్కఱలేకుండ కుటుంబ పోషణము నిరాటంకముగా నడిచినది. అనవరతము దేశసేవచేయఁ బడినది. ఇన్నిలాభము లుండుటను గ్రహించి యూరివారు మొట్ట మొదట వారు వెఱ్ఱివారని భావించిరి. కాని పిమ్మట వారుగూడ కద్దరుపరిశ్రమ చేయకపోలేదు.

రామారావు భార్యసాయమునఁ కద్దరుమూలమున దేశమున కమితముగాఁ బాటుపడుచు మంచికీర్తిని సంపాదించెను. అదివిని దేశ సంచారముచేయు దేశనాయకు లతనిఁ జూడగనే యాదంపతులచే గౌరవింపఁబడి పోవుచుందురు.

తునుపాలలోఁ 'స్వదేశవస్తుపరిగ్రహణము, విదేశవస్తుబహిష్కారము మహాత్మాగాంధిగారి సహాయనిరాకరణోద్యమము, అస్పృశ్యతానివారణము' ఈవిషయములను గూర్చి చర్చించుటకు సభ గావింపఁబడెను. ఆ విషయమై రామారావు మిక్కిలి యత్నించి దేశనాయకులను బలువురను రప్పించెను. అటు చోడవరము, మాడుగులు మొదలగు చోట్లనుండి పలువురు వచ్చిరి. ఇటు విశాఖపట్టణము రాజమహేంద్రవరము మొదలగుస్థలముల నుండియుఁ బలువురు వచ్చిరి. ఈసభ కధ్యక్షురాలు రాజ్యలక్ష్మి గా. ఆమె యుపన్యాసమునకు సభ్యులందఱును సంతసించిరి. ఆమె యీక్రిందివిధమున నుపన్యసించెను.

"సకలశ్రేయస్సులలోను స్వదేశాభిమాన మొకటి. దేశమును ధనసంపన్నముగాఁ జేయవలెనన్నచో స్వదేశాభిమాన ముండవలెను. దేశమును విజ్ఞానసంపన్నముగాఁ జేయవలెనన్నచో స్వదేశాభిమానము గావలెను. స్వదేశాభిమానము లేనిచో నెన్నిసదుపాయములున్నను దేశము బాగుపడదు. స్వదేశాభివృద్ధిని మదిగోరుచు, స్వదేశమందుత్పన్నములగు వస్తువులనే వాడుకొనుచు, స్వదేశమందుఁ బండిన వస్తువులనే భుజించుచు వర్తించుటయే స్వదేశాభిమానము. ఒకప్పుడు స్వదేశవస్తుపరిశ్రమాభివృద్ధికి విదేశవస్తుబహిష్కారముచేయవలసి యుండును. రూపమునందును గుణమునందును విదేశవస్తువులు మంచివై వెలలయందుఁ దక్కువవై యున్నను సరకుగొనక స్వదేశవస్తుపరిగ్రహణము చేసి వర్తించుటయే స్వదేశాభిమానము. ప్రస్తుతము నవనాగరకతావిశిష్టములైన పశ్చిమదేశము లన్నియు నొకొకప్పుడు విదేశవస్తుబహిష్కారము కావించి స్వదేశ పరిశ్రమాభివృద్ధికి సాయము చూపినవి. పశ్చిమఖండవాసులలో నెల్ల నగ్రగణ్యులని యనిపించుకొని ప్రస్తుతము

భారతదేశమును బాలించుచు స్వదేశాభిమానము మహాపరాధముగాఁ బరిగణించు నాంగ్లేయులుకూడ నొకప్పుడు స్వదేశపరిశ్రమాభివృద్ధికై విదేశవస్తుబహిష్కారము గావించినట్లు చరిత్రవలన దెలియుచున్నది. తమతమ దేశాభివృద్ధికై సకలదేశములవారు నవలంబించిన మార్గము భారతీయులకేల గర్హ్యమో తెలియకున్నది. విదేశవస్తుబహిష్కారము గావించి స్వదేశపరిశ్రమ నభివర్ధించుటయు, స్వసంఘమును బాడు చేయు దురాచారములను దొలఁగించుకొనుటయు ఎల్లదేశములవారికిని, ఎల్లసంఘములవారికిని అనుసరణీయములె. సర్వదేశసామాన్యములగు నివి భరతఖండవాసులకు మహాపరాధములుగా నిర్ణయించుట దొరతనమువారి నిరంకుశత్వమును వెల్లడింపకమానదు.

"మఱియు నీయెడ గమనింపవలసిన వింతవిషయ మొకటి కలదు. దొరతనమువారుకూడఁ దగిన ధనసహాయ మొనర్చి స్వదేశపరిశ్రమల నభివర్ధింపఁ దలంచినట్లు సభాసమాచారములఁ బట్టి తెలియుచున్నది. నిషాగల్గించు 'మత్తుపదార్థములను వాడవలదని' ప్రతిమండల మందును 'ద్రావుడు మానుఁ' డని గుమ్మడికాయలంతలేసి యక్షరములు గలవాక్యములను బస్సులకంటించి దొరతనమువారు ప్రచారము చేయుచున్నారు. లోకములో వివేకవంతులు తాముచేయుచున్న పనులకుఁ బ్రోత్సాహము చూపువారి నమితముగా నాదరింతురు. ఇట్లుండ కాంగ్రెస్సువారు స్వదేశపరిశ్రమాభివృద్ధికిని, మద్యాదిమధకర పదార్థవిసర్జనమునకుఁ బాటుపడుచుండ దొరతనమువారు వారినాద రించుటకు మాఱుగా నేలదండించుచున్నారో తెలియదు.

"మఱియొకసంగతి. మద్యపానము, మహాపాపము. మహాపాప మొనర్చువారు దండనార్హులు. మహాపాపమును బ్రోత్సాహపరుచు వారుగూడ మహాపాపులుగానే ధర్మశాస్త్రములు నిర్ణయించినవి. ప్రస్తుతస్థితిగమనింపగా, కాంగ్రెస్సువారు మద్యపాన నివారకులైరి.

పోలీసువారు మద్యపానప్రోత్సాహకులైరి. అందుచేఁ పోలీసువారు మహాపాపులైరి. కాంగ్రెసువారు పుణ్యాత్ములైరి. ఇట్టిచో దొరతనము వారికి నిజముగా దండనార్హులు పోలీసువారుగాని కాంగ్రెస్సువారు కారు.

"మఱియు దొరతనమువారి కభిమతములగు స్వదేశపరిశ్రమాభి వృద్ధియు మద్యపాననిషేధమును కాంగ్రెస్సు వారవలంబింపగా నవి మహాపరాధములైనవి. ప్రభుత్వమువారి పద్ధతిని బరిశీలింపగా నొక కథ స్మృతిపథమునఁ బడుచున్నది.

"ఒకగ్రామమున బ్రాహ్మణదంపతులు గలరు. ఆబ్రాహ్మణుఁడు దేశాటనముచేసి ధనముసంపాదించి భార్యతో సుఖజీవనముచేయు చుండువాఁడు. అతఁడు దూరదేశమున ధనసంపాదనముచేయుచు నొక పల్లెటూరిలో నొక కంసాలికిఁ గొంత ధనమిచ్చి చెవులకుఁ గుండల ములు చేయుమనెను. వాఁడట్లుచేసెను. వానిని జెవులకుఁ బెట్టుకొని మఱొకదేశమునకరిగెను. మఱియొక నెలయగునప్పటికా కుండలము లపై బంగారము కరిగిపోయి లోనిలక్కకనఁబడఁజొచ్చెను. అదిచూచి బ్రాహ్మణుఁడు తన్నుకంసాలి మోసపుచ్చెనని విచారించుచుఁ గొన్ని దినములకింటికి వచ్చెను. అతఁడు వచ్చునప్పటికి భార్యయొకగేదెనుగొని పాలుపెరుగు ద్రావుచు సుఖముగానుండెను.

అంతబ్రాహ్మణుడు స్నానముచేసి భుజించుచు నిట్లు ప్రసంగించెను.

బ్రా—పెరుగుచాల రుచిగానున్నది. ఎక్కడిది?

భా—మీరువెళ్లగానెయొక గేదెనుకొన్నాను. పాలుపెరుగు త్రావ లేకవిసిగిపోవుచున్నాను.

బ్రా—గేదెనెక్కడఁ గొన్నావు?

భా—ఈయూరనె యుచ్చాబత్తుఁడను కంసాలిదగ్గర గొన్నాను.

బ్రా—సరి. సరి. నావలెనీవును మోసపోయితివి. నీవుకొన్న లక్క గేదేకాని గేదెకాదు.

భా—దానినొకమారు చూచినారా ?

బ్రా—చూడనక్కఱలేదు. అది లక్కగేదెయే.

భా—కాదండీ. అది మనయింటనే యీనినది.

బ్రా—అగుఁగాక,

భా—చిట్టుతవుడు తినుచున్నది.

బ్రా—తినినను లక్కగేదెయే.

భా—కుడితి త్రావుచున్నది.

బ్రా—అయినను లక్కగేదెయే.

భా—ఇదేమిటండి ! ఇట్లందురు. పూటకు రెండుసేర్లపాలిచ్చుచున్నది. లక్కగేదె పాలిచ్చునా ?

బ్రా—నీవెన్నిచెప్పినను సరియే. అచ్చాబత్తునియొద్ద గొనినదిలక్కగేదెయె.

ఈ దంపతుల సంభాషణమువిని యిరుగుపొరుగు వారలువ బ్రాహ్మణునిఁ-జీవాట్లు పెట్టిరి. అదివిని యతఁడు వారితో 'అయ్యా మీరందఱును నాభార్యవలెఁ బొరపడుచున్నారు. కంసాలులు వ కులు. వారియొద్దఁ గొనినయీకుండలములు లక్కవైనప్పుడు రొయొద్దనుగొన్న గేదెమాత్రము లక్కదికాదా' యని పల్కెను.

"ప్రజలదివిని నీవుమోసపోయితివి. ఏకంసాలియోనిన్ను మె పుచ్చినాఁడు. అంతమాత్రమున నందఱును మోసగాండ్రేయుందు ప్రాణముతో వర్తించిమేయుచుఁ బాలిచ్చుచున్నది లక్కగేదె గు"నని యనేక నిదర్శనములు చూపిరి.

"ఆ బ్రాహ్మణుఁడు వారికిఁ జేతులు జోడించి 'అయ్యా ! మీ నిదర్శనములుచూపి యెంతచెప్పినను నేనునమ్మను. అది నడుచుచున్న

మేయుచున్నను బాలిచ్చుచున్నను కంసాలియొద్దఁ గొనుటచే లక్క-గేదెయే” అనిపల్కెను. అతని మూర్ఖతకు విసివి ప్రజలు వెడలిపోయిరి. మనప్రభుత్వమువారిచర్య మూర్ఖబ్రాహ్మణునిచర్యకు సరిపోవుచున్నది. స్వదేశపరిశ్రమాభివృద్ధి వారికిష్టమే. మద్యపాననిషేధము వారికిష్టమే. అవి కాంగ్రెస్సువారు చేపట్టుటచే మహాపరాధము లైనవనుట స్పష్టము. దీనివలన దొరతనమువారికిఁ గాంగ్రెస్సువారియందుఁ గల ద్వేషము వెల్లడికాకపోదు.

“ప్రాణికోటిలో దేవమనుష్యతిర్యగాది భేదము లెన్నియో కలవు. బడులలో బాలుఁడు క్రమముగాఁ జదివి బుద్ధిమంతుఁడై యధికగుణవంతుఁడై పైతరగతులలోఁ జేరినట్లు ప్రాణులు దమసత్ప్రవర్తనముచే దమ తరగతివిడిచి పైతరగతి కరుగవచ్చును. మానవులు దేవతిర్యక్కులకు నడుమనున్నారు. వారుత్తమగుణము లార్జించి దేవత్వము నంద వచ్చును; దుష్ప్రవర్తనులై మానవత్వము పోఁగొట్టుకొని పశుత్వమును జెందవచ్చును. మనచరిత్రములు పరిశీలింప గొందఱు పశుత్వము నందినట్లును, మఱికొందఱు దేవత్వ మందినట్లును గూడఁ దెలియును. అధములైనవారిని గుఱించి మన కేల? దేవత్వమును గాంచిన వారినే పరిశీలింతము. మానవస్త్రీ గర్భజనితులైనను, శ్రీరాముఁడు, కృష్ణుఁడు, బుద్ధుఁడు, శంకరుఁడు, క్రీస్తువు, మహమ్మదు, మొదలగు వారు తమసత్ప్రవర్తనమున మానవాతీతగుణములను సంపాదించి దేవతలైరి. సంస్కృతభాగవతమున వ్యాసుఁడవతారములను లెక్కించుచు విద్యావిజ్ఞానవిక్రమాదులచే సామాన్యమానవాళి నతిక్రమించిన వారం దఱవతారపురుషుల నిర్ణయించినాఁడు. ఆ సూత్రమును విమర్శించి చూడఁగా బైని బేర్కొన్న వారందఱవతారము లనుట కభ్యంతరము లేదు. వారిలో నించుమించుగా నందఱును భూతకాలగతులగుటవలన గ్రంథాదులవలన వారి యుత్తమగుణములు విని యానందింపవలసినది.

“ మహాత్మగాంధి మనకు సమకాలికుఁడగుటచే నతనిదివ్యగుణములు, ఉత్తమప్రవర్తనమును కనులారఁగాంచి యానందించి పవిత్రులమగు భాగ్యము నిజముగాఁ బ్రపంచమునకుఁ బట్టినది. ఆధ్యాత్మికగుణము లనుబట్టి చూచినను లౌకికగుణములను బరిశీలించి చూచినను, అతఁడు మహోత్తరపురుషుఁడనియు, అవతారపురుషుఁడనియు, మానవత్వ మునువిడిచి దేవత్వ మొందినవాఁ డనియు నమ్మకతీఱదు. అతఁడు తక్కినవారివలె, ఆధ్యాత్మికవిషయమును, మతవిషయమును మాత్రము చేకొనలేదు. అతఁడు చేకొనినది కేవలము లౌకికవిషయము. అందులో స్వదేశీయవిషయము. అయిన నది స్వల్పవిషయముకాదు. ప్రపంచ మందత్యంతోత్కృష్టతగన్న బ్రిటిషుప్రభుత్వముతో డీకొనుట! బ్రిటిషు ప్రభుత్వమునకుఁ జాలినంత పరికరమున్నది. సైనికులు, తుపాకులు, ఫిరంగులు, మరఫిరంగులు, నౌకాబలము, విమానములు, కోట్లకొలఁది పోలీసువారు. ఇంక మహాత్మునకో; రాట్నములు, పంటికఱ్ఱలు, కదుళ్ళు, మగ్గములు, బడిలోఁ జదువుకొను బాలురు. అంతఃపురములలో నుండు పుష్పకోమలులు, కొండగుహలలో వసించు కోదువాండ్రు. ఇంతయసమానకక్షగా నున్నను మహాత్ముఁడు నిజముగా బ్రిటిషుసింహము మీసములు పట్టుకొని యూపినాఁడు. అంతటి సింహమును గర్జనలు చేయ ప్రారంభించినదే కాని పరాక్రమము చూపలేకపోయినది. ఆ గర్జాధ్వనులు విని పశ్చిమఖండ మల్లలనాడినది. తన మీసములను విడిపించుకొనఁగల శక్తి తనకు లేదని యధైర్యపడినది. ఇఁకఁ బ్రళయమే యని భావించినది. ఎండిపోయిన బక్కమానవుని సాహసమున కాశ్చర్యము చెందినది. దేశీయప్రజలు, మంత్రులు, సైనికులువచ్చి విడిపించు నాశకూడఁబోయినది. ఇట్లధైర్యపడి బ్రిటిషుసింహము హాహాకారములు చేయుచు నలుదిక్కులు చూచుచుండ మనసహాయవాదులు సింహము

వెన్నుతట్టి భయముమాన్పి మహాత్మునిని మంచి మాటలాడి మీాన ములు మహాత్మునిచేతనుండి విడిపించిరి.

"పట్టు తప్పించుకొని బ్రిటిషుసింహము సహాయనిరాకరణవాదులను గాయబడునట్లు కఱచి మహాత్ముని నిర్బంధించి కారాగారమం దుంచఁ గలిగెను.

"మహాత్మునుద్యమము నశించినదని పరదేశీయులును, మనవారును దలంచిరికాని యట్లెన్నటికిని జరుగదు. మహాత్ముఁడు స్వరాజ్యమును సంపాదింపలేకపోయెనని కొందఱనుచుందురు. భారతదేశమున కదృష్ట దినములు పట్టనప్పు డతఁడేమిచేయఁగలఁడు? పదునాల్గుభువనములను గరతలామలకములుగాఁ జేయఁజాలిన భగవంతుఁడు 'కాలకర్మములు కూడినఁగాని హిరణ్యకశిపునిఁ జంపలేను. అంతదనుక వేచియుండుఁ' డని బ్రహ్మాదులకుఁ జెప్పెను. అట్టిచో మహాత్ముఁడు మాత్రమేమి చేయఁగలఁడు.

"అతఁడు నెలకొల్పిన సహాయనిరాకరణోద్యమమే యతని యపార బుద్ధి విశేషమును దెలుపుచున్నది. అది మొదట సామాన్యమనీ భావించుకొనిరి. కాని రానురాను దానిబలము లోకము సాధనత్వము విశదమైనది. అది దేశమందేకాక యొకకుటుంబములో నొకరితో నొకరు పడక కొట్టుకొనియుఁ, దిట్టుకొనియు వర్తించుచుండిరి. బడిలోఁ జదువుకొను బాలుఁడు తనకుఁ గావలసిన వస్తువియ్యకపోయిన గోలు గోలున యేడ్చెడివాఁడు. ఇప్పుడాపద్ధతిలేదు. భోజనము మాని యింట నెవ్వరితోను మాటాడకయుండును. దానివలన వారివారి కార్యములు నెఱవేఱును, సహాయనిరాకరణఫలితములు భారతీయులకుఁ దెలిసినవి. అది నిజముగా నారాయణాస్త్రము. ఆ యస్త్రమునకు నమస్కారము తప్ప మాఱులేదు.

“ సహాయనిరాకరణ మెల్లప్పుడు నవలంబింపఁబడలేదు. నిజమాలోచింప దొరతనమువారు తమధర్మమును విడిచి యక్రమముగా వర్తించునప్పుడు మాత్రమే యవలంబింపఁబడుచున్నది.

సహాయనిరాకరణమందెన్నియో సమస్య లిమిడియున్నవి. విదేశవస్తు బహిష్కారము, శాసనసభా తిరస్కారము, మద్యపాననిషేధము, స్వదేశవస్త్రాభివృద్ధి, అస్పృశ్యతానివారణము, పీనిలోఁగొన్ని ప్రభుత్వమున కనుకూలములే. అయినను సహాయనిరాకరణోద్యమ సంబంధముచే నన్నియు నిషేధ్యములైనవియే.

“ మహాత్ముఁడవలంబించిన మహాసమస్యలలో అస్పృశ్యతానివారణ మొకటి. అది కేవలము సాంఘికమైనను స్వరాజ్యసమస్యకు హేతువగుటచే మిక్కిలి ప్రాధాన్యము వహించినది. ప్రస్తుతమున సకలప్రపంచ మానవదృష్టియు నటు ప్రసరింపఁ దొడఁగెను. శారదాశాసనమువలె నిదియు సకల సనాతనస్వాంతములను జంచలింపఁజేసినది. మహాత్ముఁడాసమస్యను కేవలము రాజకీయముగ భావించి యుపన్యసించుచుండెను. అది కేవలము సాంఘికమని సనాతనులు వాదించుచుండిరి. అది సాంఘికమైనను స్వరాజ్యసమస్య కాధారమగుటచే స్వరాజ్యసమస్యవలె నదియు నాదరణీయమే కాని నిరాకరణీయము కాదని మహాత్మునివాదము. మఱియు మహాత్ముఁ డస్పృశ్యతవిషయమై అనేకపర్యాయము లీక్రిందివిధమున తన యభిప్రాయము వెలిబుచ్చియున్నాడు.

“ మనధర్మశాస్త్రములన్నియు సంఘాభివృద్ధి కుత్పన్నములైనవి. సంఘహానికరములగు నవి నిజముగా ధర్మశాస్త్రములుకావు. ధర్మశాస్త్రమునకు సంఘము వ్యతిరిక్తమైనప్పుడు, ధర్మశాస్త్రము సంస్కరింపవలసినదే. మఱియు ధర్మశాస్త్రరచయితలు వింశతిశతాబ్దము

నాటి సంఘమును గుఱించి నిబంధింపలేదు. ఆకాలమునాటి సంఘమున కనుకూలముగా నిబంధనలుచేసిరి. అట్టిదానిని బురస్కరించుకొని ప్రస్తుతకాలసంఘశ్రేయస్సును జెడగొట్టరాదు. ఇప్పటి సనాతను లస్పృశ్యతను అక్రమపద్ధతిని బాటించి సంఘహానికిఁ బూనుకొనుట తగదు. మఱియు నస్పృశ్యత కల్పితము గాని జాతినంటిపెట్టుకొని వచ్చినది కాదు. సనాతన మతప్రకారము మనసంఘమున నాలుకోట్లమంది చండాలశబ్దవాచ్యులున్నారు. వారు హిందూమతావలంబులైనప్పుడు మాత్రమే మనము అస్పృశ్యతను బాటించుచున్నాము. కాని వారు క్రైస్తవమహమ్మదీయ మతావలంబులై మనయిండ్లకు వచ్చినప్పుడాదరించి యస్పృశ్యతను బాటింపలేదు. దీనివలన హిందూమతావలంబనము వారికి హానికరమగుచున్నది. హిందువులాదరింపకపోవుటచే నస్పృశ్యులు క్రైస్తవులుగానో మహమ్మదీయులుగానోః మాఱినచో హిందూసంఘమునకు గొప్పహాని కల్గుచున్నది. దానివలనఁ గల్గునష్టమపారము. అస్పృశ్యత సక్రమముగాఁ బాటించు సనాతనులు సక్రమముగాని పిచ్చినమ్మకములను బాటించి సంఘహాని కంగీకరింపరాదు. మనమందఱమును గూడి యస్పృశ్యుల నాదరింపవలెను. మనసంఘమందున్న హక్కు వారికిని పంచిపెట్టవలెను. కల్పితమగు నస్పృశ్యతను బాటించి శాశ్వతమగు సంఘమునకు హానిగల్గించుకొన్నచో పైసంఘములవారు ప్రబలి మనలను అణగఁద్రొక్కుదురు. అప్పుడు మనమేమియును జేయఁజాలము. అట్లయిన మనపూర్వు లస్పృశ్యత నేల తొలగింపలేదని ప్రశ్నింపరాదు. ఆకాలము వేఱు. ఇప్పటికాలము వేఱు. అప్పుడు స్వదేశప్రభువుల పాలనమందుండుటచే మనకుఁ గావలసినంత స్వేచ్ఛగలదు. అందుచే మనము చండాల సంపర్కము లేకుండ వర్తింపగల్గితిమి. ఇప్పుడు మన మెచ్చటికేగినను చండాల సంపర్కము తప్పదు. నూడుడను, కార్యస్థానములందును, బజారులందును, ఉత్సవము

లందును ఇంతేల? మనము దినుకూరగాయలందును మనకది తప్ప నప్పుడది మనమేల యంగీకరింపరాదు? అందువలన మనకుఁగల్గు మహాపాతక మేదియును రాదు. చండాల సంపర్కము లేకుండ మనము జీవించుటకే యవకాశము లేనప్పుడు బుద్ధిపూర్వకముగా నంగీకరించుట యుదారతను వెల్లడించును గదా?

"పూర్వము మన బ్రాహ్మణ సంఘమునకుఁ తపస్స్వాధ్యాయములు ముఖ్యవృత్తి. తపస్సున శౌచము ముఖ్యాంగము. ఆకాలమునఁ జండా లురు ఆహారవిహారములందుఁ బరిశుభ్రతలేక వర్తించెడువారు. అందుచే వారికిఁ దపోభంగకరమగు చండాలస్పర్శను త్రోసిపుచ్చుట యవస రము. ఇంతేకాక వారప్పటికిని లౌకికసంబంధము వదలి నిర్జనారణ్య ములం దాశ్రమములు కల్పించుకొని మనువారు. ఇప్పటి మన బ్రాహ్మణసంఘ మట్టిదికాదే. ప్రతికార్యస్థానమందును బ్రతికార్యము లందును బ్రాహ్మణులే. మన హిందూమత ప్రకారము తెల్లదొరలును, క్రైస్తవులును, మహమ్మదీయులును అస్పృశ్యులుగాఁ బరిగణింపఁ బడవలసినవారే కదా? వారి సంపర్కము లేకుండ మనమేపనియు నెఱవేర్పఁజాలము. అందుచే మీరుదారహృదయులై చండాలురను మనసంఘమం దుండనిండు. హిందువులకున్న హక్కులు వారికిని గలుగనిండు. ప్రకృతిసిద్ధములగు నదులలోను జెరువులలోను మనవలె నీరు త్రావనిండు. మనపూర్వులు నిర్మించిన దేవాలయములలోనికి వారిని రానిండు. తెల్లదొర కలెక్టరై దేవాలయమును జూడవచ్చిన మనము చేతులు జోడించి వానినిగొనిపోయి దేవతాదర్శనము చేయింతుము. జాతిచే మనకిఁ దుల్యుఁడగు మాలఁడువచ్చిన తఱిమివేయు చున్నాము. భగవంతుఁడు పరమపవిత్రుఁడు. అతని దర్శనము వలన మలినులు గూడఁ బవిత్రులగుచున్నారు. వక్రకాష్ఠ గతవక్రత్వాదు లగ్నిని బొందనట్లు పాపుల పాపములు పరమేశ్వరునంటవు. చండాల

సంపర్కము వలన దేవుడుగాని దేవస్థానముగాని మైలపడదు. పూర్వముకంటెఁ జండాలు రిప్పుడు పలువిధములఁ బారిశుద్ధ్యమును బాటించుచున్నారు. చండాలురు వెనుకటికంటె నాహార విహారాదిక మునందుఁ బరిశుద్ధులైనప్పుడు వారి మాలిన్యము వలన భంగపాటు చెందు తపోనియమాదులు తమకులేనప్పుడు సనాతను లస్పృశ్యతను దొలఁగించి వర్తించుట పరమవివేకము గదా?

"మఱియును సంఘసంస్కరణము మహాప్రవాహమువంటిది. దాని నడ్డుట కెవ్వరికిని శక్యముకాదు. దానికి ధర్మశాస్త్ర రచయితలు నమస్సుచేయవలసినదే. రాజశాసనములు విముఖములు కావలసినదే! చూడుఁడు, యువతీ వివాహము శాస్త్రీయమనియుఁ గాదనియు వివ రించుచున్నారు. ఇప్పుడు మహిళాసంఘమువారు యువతీవివాహములే చేయవలెనని తీర్మానించుచున్నారు. స్త్రీసంఘమట్లు వర్తింప యువతీ వివాహములు కాకుండ సనాతనులు చేయఁగలరా? అట్లేవారు చండా లురనుచున్న సంఘము క్రమముగాఁ బ్రబలుచున్నది. విద్యావివేక వేషభాషలచే మిగిలిన సంఘములతోఁ దులదూగుచున్నది. మఱి కొంత కాలమునకు వారు ప్రబలులై హిందూమతమందలి యన్ని హక్కులును మాకుఁ గావలెనని పంతముపట్టినచో సనాతనులు చేయు నదేమి? నమస్కారమె. కావున సనాతనులు వివేకవంతులై వారిని దమలోఁ జేర్చుకొని గౌరవించుట మేలు. చండాలు రెట్లయినను మఱి కొంతకాలమునకుఁ దమహక్కులను బలాత్కరించి పుచ్చుకొందురని చెప్పవలసివచ్చినప్పుడు సనాతనులా గౌరవము తమయందుంచుకొని వారిని దమలోని కేలచేర్చుకొనరాదు. కొడుకులు తండ్రితో వివదించి తమ భాగములను దాము పుచ్చుకొనఁదలఁచినప్పుడు తండ్రియే వారి భాగములను వారికిఁ బంచిపెట్టిన మహాగౌరవము కదా?"

అని యిట్లు మహాత్ముడు పలువిధములుగా బోధింప సనాతను లది కాదని మొండిపట్టు పట్టుచున్నారు. సనాతనులమాటలు యుక్తి యుక్తములుకావు. శాస్త్రసమ్మతములు కావు. ధర్మశాస్త్రరచయి తలు నిర్ణయించిన చండాలత్వ మిప్పటివారికి జెందదు. అందుచే ధర్మ శాస్త్రనిబంధనలు ఇప్పటివారిని నిషేధింపజాలవు. సనాతను లింకను వివేకహీనులై వర్తించినచో సంఘమునకును దేశమునకును గల్గులాభ ములను జెడగొట్టగలరు. కాని యస్పృశ్యతను నిలువబెట్టలేరు.

"మఱియు నస్పృశ్యతను వదలుకొన్నంతమాత్రమున జండాలుర పంక్తిని భుజింపనక్కఱలేదు. వారికి మనపంక్తిని భోజనము పెట్టమన లేదు. వారితో జుట్టఱికములు చేసికొనమనలేదు. మఱియేమి? మన సంఘముతో బాటు వారికిని దేవతాదర్శనము చేయింపుడు, చెరువు లలోను, నూతులలోను నీరు వాడుకొననిండు. శూద్రజాతివారు మన యిండ్లలోనికి వచ్చునట్లు వారిని రానిండు. వీనికి సనాతను లంగీకరిం చుట న్యాయము."

ఆమె యుపన్యాసము నందర రంజింపజేసెను. అస్పృశ్యతానివారణము ముఖ్యముగాఁ గావలయునని సభవారంద ఱేకగ్రీవముగా నంగీకరించిరి. అంతతో సభ ముగిసినది. అప్పటి కింకను నాల్గుగడియల ప్రొద్దున్నది. తునుపాలకు సమీపముగానున్న కల్లంగిడిని మూయింప నిశ్చయించిరి. రామారావును రాజ్యలక్ష్మియును, మూడుగులుజట్టుతోఁ గలిసిరి. వారేకాదు. సభకు వచ్చిన కాంగ్రెస్సువారందఱు నేకమైరి. రాజ్యలక్ష్మి భారతమాతకుజై యని కేకలిడుచు, జండా పట్టుకొని మహిషాసురమర్దనివలె నడువఁదొడఁగెను. తక్కినవారంద ఱామెను వెంబడించిరి. ఆమె యిట్లుపాడగాఁ దక్కినవారందఱును బాట కనుగుణముగా నడుగులు వేయుచుఁ బాడనారంభించిరి.

"రఘుపతి రాఘవరాజారామ్,
పతీతపావన సీతారామ్,
గంగాతులసీ సాలిగ్రామ్,
సుందర మాధవ మేఘ శ్యామ్"
"రఘు.

వీరు కల్లంగడికి దరికరుగునప్పటికి రెండు లారీలతో బోలీసువారు వచ్చి సిద్ధముగానుండిరి. అయినను రాజ్యలక్ష్మి యాగక యంగడి ద్వారముచెంత నిలువఁబడి త్రావుబోతులను, సోదరులారాయని సంబోధించి యీయక్రమకృత్యమును మానుఁడని బతిమాలెను. ఆమె యుపన్యాసమునకును, ప్రార్థనమునకును బెగ్గడిల్లి యక్కడఁ గూర్చున్న త్రావుబోతులొక్కొక్కరే పైకివెడలి పోవనారంభించిరి. రాజ్యలక్ష్మి దూకాణదారులను గూడఁ బ్రార్థింప వారు చిన్నపుచ్చుకొని దుకాణము మూయసిద్ధపడిరి. ఇంతలో ఇనస్పెక్టరుగారి యాజ్ఞవలనఁ బోలీసువారు

తుపాకులును, లాఠీలును ధరించివచ్చి కాంగ్రెస్సువారిని మర్దింపఁ జొచ్చిరి. కాంగ్రెస్సువారికి ఘోరముగా దెబ్బలుతగిలినవి. రాజ్యలక్ష్మి యెంతతప్పించుకొన్నను లాఠీదెబ్బనొసటఁ దగులుటచే గాయమై రక్తముకారి యామె శరీరమును దడుపఁజొచ్చెను. అయిననామె యట్టనుండి కదలక "స్వారాజ్యమువచ్చుట కిదియేమార్గము. కానిందు ప్రాణములర్పించెదముకాని యిటనుండి కదలము. మీరు దయాళువులై బుద్ధిమంతులైనచో మీదుకాణములను మూసివైచి మీసోదరులను సన్మార్గవర్తనులనుగాఁ జేయుఁడు, లేనిచో మీకొఱకిమిత్తమై ప్రాణార్పణము కావించెద" మని దృఢముగాఁ బలికెను. ఆమె కెదురాడఁజాలక యావస్తువుల నటదిగవిడిచి దుకాణదారులు మెల్ల మెల్లగా వెడలిపోయిరి. కొంతసేపటికిఁ ద్రావువారును వెడలిపోయిరి.

అంత కాంగ్రెస్సువారు తమపని నెఱవేఱినందుల కానందించి వెడలి పోవుచుండఁగాఁ బోలీసధికారి "మీరందఱుఅపరాధులు" మిమ్మందఱను అరెస్టుచేసితి" ననెను.

కాంగ్రెస్సువారు మఱి కదలలేదు. పోలీసువారు వారిని లారీలలోఁ గూర్చుండఁబెట్టి విశాఖపట్టణము గొనిపోయిరి. లారీలు కదలునపుడు రామారావుతండ్రితో "మా కేమియు భయములేదు. తర్వలోనె వచ్చెదము. సభనిమిత్తమై వచ్చిన దేశనాయకులకు వలయుభోజనాది సదుపాయములు చేయింపు" మనెను. అతఁడందులకు సమ్మతించెను.

రామారావును, రాజ్యలక్ష్మియు దేశనాయకులయొద్ద సెలవుతీసికొనిరి. నిమిషమాత్రమున లారీలు మాయమయ్యెను.

తల్లులకు స్త్రీసంతానమం దమిత వాత్సల్యము. కుమారికలవలెఁ గుమారులును స్వగర్భజనితులైనను స్వజాతియగుటచేతనో, ముందుముందు పరుల గృహంబులకేగి కాపురము చేయుసన్న సానుభూతిచేతనో, తల్లులకది తప్పదు. కాకిపిల్ల కాకికిముద్దన్నట్లు సామాన్యగుణాలగు పిల్లలందే తల్లులకమిత వాత్సల్యమని చెప్పవలసినప్పు డసాధారణ గుణోపేతలగు కూతులందుఁ దల్లులకెంత ప్రేమముండునో వేఱచెప్పవలయునా!

పేరిశాస్త్రిభార్య మంగమ్మ విద్వాంసురాలు. అమితమగు లోకజ్ఞానముకలది. పతివ్రత, సంతానవతి, బుద్ధిమతి, సంఘసంస్కరణములందధి కాసక్తికలది. మహిళాసంఘమున కధ్యక్షురాలయి సంఘమును బాగుచేయఁబాటు పడుచున్నది. అందుచే నామె పూర్వాచార పరాయణ యనికాని యనాగరకురాలనికాని చెప్పలేము. మఱియు నింటఁ గోడుకలును, గోడండ్రును, మనుమలును, మనుమరాండ్రును గ్గలరు. అయిననామె మనస్సునకంతతోఁ దృప్తిలేదు. ఆమె మన స్సెల్లపుడును రాజ్యలక్ష్మివంకకే పరుగువాఱుచుండును. అసాధారణగుణములుగల రాజ్యలక్ష్మి సర్వజనాదరణీయ యనుటకు సందియములేదు. అట్టిచోఁ దల్లికిఁబిల్లయెట్టిదగునో వేఱచెప్పవలయునా? మంగమ్మ కూతునకు మంచిహోదాగల సంబంధముచేయవలెనని మిక్కిలి యత్నముచేయుచుండెను. ఎంతధనమైన నందువిషయమై వెచ్చింప నిశ్చయించియుండెను. తండ్రి పేరిశాస్త్రిగూడ నట్టి యభిప్రాయము కలవాడై యుండెను. అయినను రాజ్యలక్ష్మి వారియభిప్రాయములను ద్రోసిపుచ్చి తనకిష్టుఁడగు శాఖాంతరుఁడగు వరుని, నిఱుపేదను వరించినది. తమయభిప్రాయమునకు విరుద్ధముగా నడిచినందులకుఁ దల్లికి రాజ్యలక్ష్మిపై గోప

ముండవలసినది. కాని మంగమ్మకట్టి విపరీతాభిప్రాయము కూతునం దేమియును లేదు. రాజ్యలక్ష్మి యత్తింటికరిగి యయిదాఱు మాసము లగుటచే నామెనుజూడ మంగమ్మమనస్సు త్వరపడుచునేయుండెను. కాని యామె యేమిచేయఁగలదు? ఆమెను జూచుటకుఁగాని పుట్టినింటికిఁ గొనివచ్చుటకుఁగాని గారణమేమియు నగపడలేదు. ఇట్లుండ రాజ్యలక్ష్మి యొక్క యుత్తరములోఁ దనకు, నాల్గవమాసము గర్భమైనట్లు వ్రాసెను. అందులకామెకు పరమానందము గల్గెను. ఈ యానంద మామె కుతూహలమును మఱింతవృద్ధి నొందించెను. కూతును జూచుటకుఁగాని తమయింటికిఁ గొనివచ్చుటకుఁగాని యామెకుఁదగిన కారణ మలవడెను. కాని నాల్గవనెల కడచినఁగాని యందులకు వీలులేదు. తమ కూతురు గర్భవతియైనపుడు మూఁడవనెలనో, ఐదవనెలనో, లేక యేడవనెలనో పుట్టినింటి వారామెను జూడనేగి యాగ్రామస్థులకు భక్ష్యములు పంచిపెట్టి తమ్ము యింటికిఁ గొనివచ్చుట యాంధ్రుల యాచారము. అందుచే మంగమ్మ యైదవనెలనుగాని కూతును జూడనేగుట కవకాశము చిక్కలేదు. ఈ శుభవార్త మంగమ్మ భర్తకు విన్నవించి యతనియనుమతిపడసి సిద్ధాంతిచేనొక శుభదినమేర్పఱించి యానాటికి వచ్చుచున్నట్లు రాజ్యలక్ష్మికి వ్రాసినది. ఆదినముననే యామెను విశాఖపట్టమునకుఁ దీసికొని వెళ్లెదననియుఁ బ్రయాణమునకుఁ సిద్ధురాలవై యుండుమనియుఁ గూడఁ గూతునకు వ్రాసినది.

మంగమ్మ యా శుభదినమునకై వేచియుండ నదివచ్చెను. ఆమె తొలిదినమున మిఠాయిచేయించ సిద్ధపఱిచెను. కూతునకు విలువగల క్రొత్తచీర నొకదానిని విలిచెను. ఇవన్నియు మోటారుబండిలో బెట్టించి మంగమ్మ శుభదినమునాటి యుదయముననే బయలుదేఱెను.

డ్రైవరిదివఱకు రాజ్యలక్ష్మిని దిగబెట్టియున్నాఁడు గావున శివావధానిగారి యిల్లు తెలియును. పదిగంటలవేళ యగునప్పటికి భాంక్రు

తులు చేయుచు మోటారుబండి శివావధానిగారి యింటియెదుట నిలిచెను. అవధానిగారి కుటుంబమీమెను నెఱుఁగరు. ఈమె వారినెఱుఁగదు. బండిచప్పుడు విని యవధాని కూతుంఁడును భార్యయు వెలుపటికి వచ్చిరి. మంగమ్మ బండినుండి దిగి నిలిచెను. బంగారుజరీచీరకట్టి కనక రత్నభూషాలంకృతయైయున్న యామెనుగాంచి నివ్వెఱపడి స్తంభాకృతులైరి. కాని యామెను సమీపించి పలుకరింప వారికి సాహసము లేకపోయెను. అవధానియు నాశ్చర్యచకితుఁడై నిరీక్షించుచుండెనే కాని యేమియుఁ జేయఁజాలకపోయెను. బండినుండి దిగియుఁ దిగక మునుపే కూతురువచ్చి తన్నుఁ గౌఁగలించునని మంగమ్మ భావించెను. కాని యట్లు జరుగలేదు. అల్లుడుకూడ వచ్చి పలుకరింపలేదు. మంగమ్మ యవధానిగారి యింటిలోని కరుగలేదు. వారువచ్చి యీమెను దీసికొని వెళ్ళలేదు. ఇదిచూచి డ్రైవరు మంగమ్మతో "అమ్మా! వీరు మిమ్ము నెఱుఁగరు. అందుచే వారువచ్చి మిమ్మాదరింపలేకున్నవారు" అనిచెప్పి యవధానిని సమీపించి "అయ్యా! ఈమె మీకోడలి తల్లిగారు. మంగమ్మగారు. కూతునుజూచి తీసికొని వెళ్లుటకై వచ్చినారు" అని చెప్పెను. అవధాని త్వరపడి యీయంశము చెప్పి భార్యను గూతుంఁడను ఆమెను గౌరవింపనంపెను.

అంత వారు చటాలున నామెను సమీపించి యాదరించి లోనికిఁ గొనిపోయి రాజ్యలక్ష్మి పడకటింటిలోఁ గూర్చుండఁ బెట్టిరి. మంగమ్మకుఁ గూతుజాడ లేమియుఁ గనఁబడలేదు. అంత నరసమ్మయేడ్చుచు "వదినే! కొడుకును కోడలును నిన్న కల్లంగడియొద్ద కరిగి పోలీసు వారిచే నిర్బంధింపఁబడిరి, వారిని విశాఖపట్టణమునకే తీసికొని వెళ్లినారఁట! ఈ ముసలికాలమున నాకు కొడుకు మమ్ముద్ధరించునని పుట్టెడాశతో నుండఁగా మాకొంతుక యిట్లుత్తరించినాఁడ"ని యేడ్చుచుఁ గోడలి యుత్తమస్వభావమును, సద్గుణముల ననేకవిధముల నుతింప

నారంభించెను. అత్తగారు కోడలి గుణంబులను వర్ణించినందులకు మంగమ్మ సంతసింపవలసినదే కాని యామెకివి యేమియును వినఁబడ లేదు. మనస్సు దిగ్భ్రాంతమైనట్లయ్యెను. ఏమిచేయుటకును దోపలేదు. కూతునుజూడ మహాతురతతో వచ్చినందుల కది మఱింత దూరమగు టచే మంగమ్మ మిక్కిలి విచారింప నారంభించెను. మంగమ్మ నర సమ్మతో "వదినే! తొందరపాటుతోఁ గూతును జూడవచ్చినందులకు భగవంతుఁడు నాకుఁ దగినశాస్తి చేసినాఁడు. మాపిల్లను జూచినఁగాని నిలువలేను. నేనిప్పుడే వెడలిపోయెదను. గ్రామమునఁ బంచిపెట్టుటకై మిఠాయిచేయించి తెచ్చినాను. అది మీరును బిల్లలు నుపయోగింపు డనిచెప్పి యవధానికూతుండ్ర నంపగా వారా మిఠాయిబుట్టలు తెచ్చి లోపలనుబెట్టిరి. ఇఁక నేనరిగెదనని మంగమ్మలేచి మోటారుబండిలోఁ గూర్చుండనెంచెను. కాని యాకుటుంబము వారామెను గదలనీయ లేదు. నరసమ్మయు నామెకూతుండ్రును, మంగమ్మ చేతులనుబట్టుకొని "నాఁడు భుజించికాని కదలవీలులేదని పట్టుపట్టిరి. అవధానిమంగమ్మతో "అమ్మా! భుజించికాని మీరు కదలవీలులేదు. ఈమోటారుబండికి అడ్డముగాఁ బండుకొందును. మీరెట్లు వెళ్లుదురో చూతునుగాక యని పంతముపట్టి యుండెను. వారల యాదరణాతిశయమును ద్రోసిపుచ్చుట మర్యాదకాదని వారిప్రార్థన నంగీకరించెను. వంట సిద్ధమైయున్నది. గంగమ్మ సత్తెమ్మలు త్వరగా నీరుకాచి మంగమ్మకు స్నానార్థము తెచ్చిపెట్టిరి. మంగమ్మ స్నానముచేసి నరసమ్మ వడ్డించగా భుజించి డ్రైవరునకుఁ గూడ నన్నము పెట్టించి యెండశాంతింపక మున్నే బయలుదేరి సాయంకాలమునకు విశాఖపట్టణము చేరెను.

రాజ్యలక్ష్మిని గొనిరాకుండ మంగమ్మ వచ్చినందుల కింటివా రాశ్చర్యచకితులై చూచుచుండ మంగమ్మ కన్నులనీరు నించుచు జరి గిన సమాచారమును జెప్పెను. కమలాంబ మొదలగువారది విని

"నిజమే యమ్మా, యట్టిదే, ఏనాఁడో కారాగారబద్ధురాలగు నని యనుకొనుచున్నా" మని పలుకనారంభించిరి. ఇంతలోఁ బేరిశాస్త్రిగారు వచ్చుటచే మంగమ్మ దక్కఁ దక్కినవారందఱును లోనికరిగిరి. మంగమ్మ భర్తతోఁగూడ గచ్చేరిచావడిలోని కరిగి యతని కభిముఖురాలై కూర్చుండి కన్నులనుండి బాష్పకణములు దిగజాఱ నిట్లు ప్రసంగించెను.

మం—(వెక్కి వెక్కి యేడ్చుచు) ఇఁక నాకు గతియేది? మనబిల్ల యిట్లు చేయునని యెన్నఁడు ననుకొనలేదు.

పే—నీవనుకొనకపోవుట తప్పు. ఆమార్గ మవలంబించిన వారికది తప్పదు. మహావీరులకు యుద్ధమరణము తప్పునా!

మం—అయ్యో! అయ్యో! చిన్నపిల్ల గాదటండీ?

పే—చిన్న పెద్ద తారతమ్యత నుండదు.

మం—చేతులు నులుముకొనుచు నిట్లేడ్చుచుండవలసినదే.

పే—ఏడ్చుట కేవలము తెల్వితక్కువ.

మం—బాగు, బాగు, దీనికి సంతోషింపుమందురా? ఏమి?

పే—నిశ్చయముగా!

మం—మగవారిది మొండిమనస్సు కాన యట్లు చెప్పుచున్నారు. మేమట్లు చేయఁగలమా!

పే—మీరేమి? మేమేమి? ఆమె ధైర్యసాహసముల కానందింపవలసినదే. మహావీరులు యుద్ధమున నాయుధఘాతములకు జంకక ప్రాణములను దృణప్రాయముగాఁ జూతురు. అట్టి ధైర్యసాహసములు సామాన్యముగా నందఱకు నుండవు. చిన్నదైనను రాజునకున్న ధైర్యసాహసములు వర్ణనాతీతములు. ప్రయత్నించినను అవి యస్మదాదులకుఁ గల్గవు. ఈశాంతి సమరమున నెందఱో ప్రాణములను దృణీకరించి వర్తించినట్లు వినుచున్నాము. పోలీసువారి లాఠీదెబ్బలకు శరీర

ముల సర్పించుచున్నారు. మహావీరుల కాయుఘఘాతములవలెఁ గాంగ్రెస్సువారికి లాఠీఘాతములు తృణప్రాయములు. అందుచే నీక మనము రాజునిమిత్తమే ద్వాక యామె ధైర్యసాహసముల కానందించుచు నుండవలెను.

మం—దానికేమి. కాని మీకుఁ బోలీసువారందఱును మిత్రులఁట. కాదా! మనరాజును దప్పింప యత్నముచేయరాదా!

పే—ఒకవేళ మనమట్లు చేసినను రాజందుల కొప్పుకొనడు.

మం—అదేమటండీ! మీ వన్నియు విపరీతములే.

పే—కాదు. కాంగ్రెస్సువారు లాఠీదెబ్బలు దిని కారాగారమున కేగుట మహాగౌరవముగా భావింతురు. మనపిల్ల యట్టియగౌరవమును విడువగలదా?

మం—అదెంతయును మీ కెందుకు? నేను దానిచే నొప్పింతును గాదా!

పే—నీ తరముగాదు. నీ ప్రయత్నమంతయు నామె పెండ్లివిషయమునఁ జూచితిమికామా!

మం—అది వచ్చినఁగాని తిండితినలేను.

పే—మానివేయుము. లేక నీవుగూడఁ కాంగ్రెస్సువారిలోఁ జేరి కైదునకు వెళ్ళుదువేని యిద్దఱు నొక్కచో నుండవచ్చును.

మం—అమ్మో! నేను వెళ్ళలేనుబాబూ!

పే—అమ్మాయికున్న ధైర్యసాహసములు నీకులేవు?

మం—లేకపోయినఁ బోనిండు. కాని నేనాదెబ్బలను దినలేను బాబూ!

పే—చూచితివా! నీవాదెబ్బలకు భయపడుచున్నావు. కాని వారికవి పుష్పవర్షము.

మం—పోనిండు. అమ్మాయి ఒప్పుకొనుట కిష్టపడిన యెడల నేఁ జెప్పి నట్లు చేయుదురా!

వే—అది యొప్పుకొన్నఁ గదా!

మం—దాని నొకమాటు చూపింపరా!

వే—ఇది రాత్రిసమయము. రేపు వెళ్ళుదము.

మఱునాఁడుదయముననే లేచి మంగమ్మ భర్తను ద్వరపెట్టి కూతును జూచుటకు భర్తతోఁగూడ గారాగారమునకు వెళ్లెనుగాని యీదినము పదిగంటలకు విమర్శనార్థము వారందఱును గలెక్టరుగారి కచ్చేరికి వెళ్ళవలెను. గాన యిప్పుడు వలనుపడదని యధికారిచెప్పగా వారు మరలి వచ్చిరి.

కాంగ్రెస్సువారు చేసిన వపరాధములని దొరతనమువారు విమర్శించుటయు వారికి దండనములు విధించుటయుఁ గలదు. ఇది నిజముగా నాటకము. నాటకమువలె నిదియు దర్శనీయము. నాటకమునకువలెనే ప్రజలు వేనకువేలు దానిని చూడఁబోవుచుందురు. నాటకమందువలెనే యిందును బహురకములగు పాత్రములుండును. నాటకప్రదర్శనమందువలె నిందును బహుమాయలుండును. మాయను జూచినప్పుడే ప్రజలకు సంతోషము, ఆశ్చర్యము, కల్గుచుండును.

నేఁడు రామారావు ప్రముఖుల విమర్శనము కలెక్టరు కార్యస్థానమున జరుగునని తెలియఁగనే విశాఖపురీవాస్తవ్యులు పదిగంటలు కొట్టినప్పటినుండియు నటకుఁ బోసాగిరి. ధనికులు, దరిద్రులు, వర్తకులు, న్యాయవాదులు, స్త్రీలు, పురుషులు, పిల్లలు మొదలగు వారందఱును బెండ్లి కరుగు నట్లచ్చటి కరుగసాగిరి. వీరు వెళ్ళునప్పటికే పోలీసువారచ్చట సంసిద్ధులై ప్రజలను గచ్చేరీలోనికిఁ బోవకుండ నిర్బంధపఱిచిరి. కాని వారికిఁ గొంచెము పరిచయమున్నవారిని, అధికారి బంధువులను సిపార్సులను బొందినవారిని లోనికి విడిచిపెట్టకపోలేదు. విశాఖపట్టణపు కాంగ్రెస్సు సంఘమువారు జండాలుపట్టుకొని జాతీయగీతములు పాడుచు బారులుదీర్చి వాటకిరుప్రక్కలను నిలిచిరి. సరిగాఁ బదునొకండు కొట్టునప్పటికిఁ గలెక్టరుగారి మోటారుబండి వచ్చెను. మఱియొక పావు గంటలో రెండులారీలతోఁ గాంగ్రెస్సు ఖైదీలువచ్చిరి. వారల్లంత దూరముననుండగనే ప్రజలు ప్రోత్సాహవంతులై "గాంధీమహాత్మకుజై, భారతమాతకుజై" అని కేక లిడనారంభించిరి. లారీలలోనున్న కాంగ్రెస్సువారుగూడ నట్లే కేకలిడిరి. ఈ ధ్వనులచేఁ గలెక్టరు కచ్చేరినిండి ప్రతిధ్వను లీయఁజొచ్చెను. లారీలు నిలిచినవి. పోలీసువారు కాంగ్రెస్సు

వారిని దింపి వరుసగా నిలుపఁబెట్టిరి. క్షణకాలములోఁ బ్రతివాలంటీరు మెడయుఁ బూలదండలతోను, కర్పూరపుహారములతోను నిండిపోయెను. మెడత్రిప్ప వీలులేనంత దట్టముగాఁ బుష్పమాలాపరిశోభితులై పోలీసువారి ననుసరించి కలెక్టరున్నచోటికి నడచి కాంగ్రెస్సువారు వరుసగా నిలిచిరి. విచారచ్ఛాయయైనను ముఖములందు లేక పెండ్లి కరుగు పెండ్లికొడుకులవలె మహాసంతోషముతో నున్న కాంగ్రెస్సువారిని జూచి కలెక్టరు చకితుఁడై పోలీసధికారిని బిలిచి "ఇదేమి? యని యడిగెను.

ఇట్టి యపరాధులను విమర్శించుట కలెక్టరున కిదే ప్రథమపర్యాయము. ఇదివఱ కెతఁడెన్ని వేలమంది యపరాధములనో విమర్శించి యుండెను. కళావిహీనములైన మొగములతోఁ జూచియుఁ జూడకుండగనే యపరాధులయినట్లు వారు గన్పట్టువారు. వీరట్లుకాక మహాసంతోషముతో నున్నారు. అందుచేఁ దెలియక కలెక్టరడిగినాఁడు.

పోలీసధికారి మెల్లగా నింగ్లీషుభాషతో "మహాప్రభూ! కాంగ్రెసువారి యందున్న గొప్పతనమే యది. వారిమెడలలోని పూలదండలు తెచ్చి ప్రజలు వేసినారు."

క—ఎందుకు వేయవలెను?

పో—వీరందఱును స్వార్థముమాని దేశసేవకుఁ బ్రాణము లర్పింపవెంచి దేశభక్తులయినారు, వారియందలి గౌరవముచేఁ బ్రజలట్లు కావించినారు?

క—అది తగదు. అపరాధులట్లు గౌరవింపఁబడరాదు. అవి తీయింపుము.

పో—వాలంటీరులనుజూచి కలెక్టరుగారి యాజ్ఞను దెలియఁజేసెను.

కాం—"గాంధీమహాత్మకుజై" అని గంభీరధ్వనులు చేయుచు దండలనుదీసి నేలఁబడవైచిరి. అంత ప్రజలనుండికూడ "భారతమాతకుజై,

గాంధీమహాత్మకుజై" యను కేకలు బయలువెడలెను. పోలీసువారెంత వారించినను వారింపఁబడలేదు.

కలెక్టరు, "రామారావు, ఎవరు, రామారావెవ్వర"ని రెండు మారులు పిలిచెను.

రా—మాటలాడలేదు.

క—పోలీసువానితో ఏడీ, రామారావు పలుకఁడేమి? ఇంగ్లీషు రాదా వానికి,

పో—అతనికింగ్లీషువచ్చును, ఆనర్సు చదివినాఁడు.

క—తసలో ఆనర్సు, ఆనర్సు, చదివినాఁడా? మఱి మాటాడఁడేమి?

పో—ఏదోచెప్పఁబోవుచుండ,

క—అతనికిఁ జెవుడాయేమి?

పో—లేదు.

క—మఱి పలుకఁడేమి?

పో—కాంగ్రెస్సువారికి మనము తృణప్రాయులము. మనతో మాటాడుటయే యవమానముగా వారు భావింతురు.

క—ఓహో! అంతగర్వమా!

పో—(రామారావును జూచి) అయ్యా! వారి కేదో సమాధానమిండు.

క—మరల రామారావునుజూచి నీవు సరిగా సమాధానము చెప్పకపోయినచో వెంటనే శిక్షింతును.

రా—అందులకు మీ విమర్శనమందు మాకు నమ్మకములేదు. మీకుఁ బ్రత్యుత్తర మీఁదలచుకోలేదు. మీ యిష్టము గావించుకొనుడు. (అని కలెక్టరుతోననెను.)

క—(ఆగ్రహించి) ఆఱునెలలు కారాగారవాసము, బి తరగతి, లేక రెండువందలు జుల్మానా!

రామారావు కలెక్టరునకు సలాముచేసెను. ఒకమాఱు మరల "గాంధీకిజై" యను కేకలు వెలువడెను.

పోలీసువారు రామారావును వెలుపలికి గొనిపోయిరి. రెండవ యపరాధిని, రాజ్యలక్ష్మి. పోలీసువారు రాజ్యలక్ష్మిని బోనెక్కించిరి. కలెక్టరామెనుజూచి "నీ పేరేమి?" అని యింగ్లీషులో నడిగెను. ఆమె యందులకుఁ బ్రత్యుత్తరమీయలేదు. కలెక్టరు పోలీసుతో నీమె "కింగ్లీషు రాదేమో" అని యడిగెను.

పో—రాకేమి, ఈమెయు భర్తవలెనే ఆనర్సు చదివినది.

కలెక్టరు ఆమెవైపుజూచి యాశ్చర్యచకితుఁడయ్యెను. "నీవు నాకు సమాధానము లియ్యవా?" అని ప్రశ్నించెను. అక్కడ భాషాపరివర్తకు డుండి తెనుఁగుచేసి యామెకుఁ జెప్పెను.

రాజ్య—పరివర్తకునిజూచి "అయ్యా? నాకింగ్లీషు వచ్చును. మీరు శ్రమపడనక్కఱలే" దని కలెక్టరునుజూచి యింగ్లీషుతో నిట్లు చెప్పెను. "మీవిమర్శనమునందు న్యాయముదొరకదు. పోలీసువారు దానిని తారుమాఱుచేయుదురు. అట్టిచో మీప్రశ్నలకుఁ బ్రత్యుత్తరములిచ్చుట నిష్ఫలము. కార్యస్థానాలయములలో నంతఃపుర స్త్రీలవలె నున్న మీకు బయటజరుగుచున్న దౌర్జన్యము దెలుపవలెనని యాసించి సమాధానము లిచ్చుచున్నాను. అడుగుఁడు."

క—నీపేరు.

రాజ్య—రాజ్యలక్ష్మి.

క—నీవు కాంగ్రెస్సునకుఁ జెందిన దానవా!

రాజ్య—అవును.

క—పోలీసువారు నీయందారోపించిన యపరాధము చేసినట్లంగీకరింతువా?

రాజ్య—పోలీసువారారోపించినది యపరాధముకాదు.

క—'పికెటింగు' అపరాధములలోనిదే.

రాజ్య—కాదు. భారత శాసనసభలో హోము మెంబరుగారు శాంతమైనపికెటింగపరాధముకాదని కంఠోక్తిగాఁ జెప్పినారు కాదా!

క—పికెటింగు శాంతముతోనైన నట్లే?

రాజ్య—మాపికెటింగు శాంతయుతమే.

క—దౌర్జన్యయుతమని పోలీసువారు చెప్పినారు.

రాజ్య—ఈవిషయమే మీరు జాగ్రత్తగా వినవలెను.

క—ఏమో చెప్పుము.

రాజ్య—మద్యపాన నిషేధము ప్రభుత్వవిధానములలో నొకటి. ప్రభుత్వామోదనీయమే కదాయని మేము కల్లంగడిని పికెటింగు చేసితిమి. ఆదుకాణదారులను త్రాగుబోతులను "సోదరా, నాయనా" యని బతిమాలి యాదుర్వృత్తినుండి మాన్పితిమి? ఇందు దౌర్జన్యమేమికలదో చెప్పుడు.

క—మా పోలీసు మాటలకంటె నీవి నమ్మఁదగినవా? యేమి?

రాజ్య—మేము శాంతముగా పికెటింగు చేయుచుండగా పోలీసులు లాఠీలతో మమ్ము్మను మోదినారు. ఇక్కడ, పికెటింగు దౌర్జన్యముకూడనున్నది. కాని పికెటింగు చేసినవారు కాంగ్రెసువారు. దౌర్జన్యముచేసినవారు పోలీసువారు. ఇది దౌర్జన్యయుతమెట్లగును.

క—మీరేమియు దౌర్జన్యము చూపకుండఁ బోలీసువారు లాఠీచార్జి చేసినారనుట విశ్వాసముకాదు.

రాజ్య—అందుచేతనే పోలీసువారిచర్య యధమాధమమని లోకమెల్ల గర్హించుచున్నది. ఇంతయెందుకు? పికెటింగుకువచ్చిన పోలీసువారి

జట్టును రప్పింపుడు. అచ్చటికివచ్చిన కాంగ్రెస్సువారిచ్చటనే యున్నారు. ఇందెవ్వరికి దెబ్బలుతగిలినవో పరీక్షింపుఁడు, మాచేతులలో నాయుధములుగాని కఱ్ఱలుగాని లేవు. మేమెట్లు దౌర్జన్యము కావింతుము? ఇదిగో మీ పోలీసువారు కొట్టిన దెబ్బవలన నింకను రక్తము కాఱుచున్నది; అని (నొసటిదెబ్బనుచూపి) యీ నిలువఁబడిన వారిలో నెందఱకు జేతులు విఱిగినవో, యెంగఱకుఁ గాళ్లువిరిగినవో పరీక్షించిన తెలియును. మావలనఁ బోలీసువారికిఁ గల్గిన గాయములేవో చూడుఁడు. దేశహితార్థము పికిటింగుచేసినవారు కాంగ్రెస్సువారు. దౌర్జన్యము చేసినవారు పోలీసువారు. మీరు ధర్మసంరక్షకులయినచోఁ బోలీసువారిని దండించి కాంగ్రెస్సువారి నాదరింపవలెను. పిమ్మట మీయిష్ట" మనెను.

రాజ్యలక్ష్మి వాదమునకును, భాషా సౌష్ఠవమునకును సభవారే కాక కలెక్టరుగూడ సంతసింపకపోలేదు. కాని యతఁడేమి చేయఁగలఁడు? కలెక్టరు రాజ్యలక్ష్మితో "నీవాదమును కోర్టువారు నమ్మలేదు. నీ నేరమున కాఱునెలల కారాగారవాసము విధించితిని. నీవు కోర్టు మర్యాద నాలోచింపక యధికప్రసంగము చేసితివి. కాన యింకరెండు నెలల శిక్ష అధికము. ఎనిమిదిమాసములు. బి. తరగతి." కలెక్టరు వాచిచూచెను. నాల్గుగంటలయినది. తక్కినవారికందఱకు ఆఱునెలల శిక్షయు సి. తరగతియు నిచ్చి సభచాలించెను.

రాజ్యలక్ష్మి కలెక్టరును సంబోధించి "అయ్యా! మీ విమర్శనము న్యాయముగాలేదు. ఈ వాలంటీరులందఱు నొకవిధమగు నేరము చేయగా, నందఱకును శిక్ష యొక్కవిధముగా నుండవలదా! ఇచ్చిన నందఱకును బి తరగతి యిండు. లేనిచో నందఱకును సి తరగతియె యిండు. ఇట్టి యధర్మ విమర్శన మేదేశమందును, ఏప్రభుత్వము నం

దును. లేద " ని యింగ్లీషుతోఁ జెప్పెను. కాని యదివినకయే కలెక్టరు లేచి వెడలిపోయెను. మఱియొకమాఱు "భారతమాతకుజై" అను ధ్వనులతో భవనమంతయు నిండిపోయెను.

రాజ్యలక్ష్మితో మాట్లాడ నవకాశము కల్పింపుమని మంగమ్మ పతిచే బోలీసధికారి నడిగించెను. కాని రేపు కారాగారమునకువచ్చి నచో నవకాశ మిప్పించెదను. నేటికి కుదురదనెను.

ఖైదీల సందఱను బోలీసువారు గారాగృహమునకుఁ గొనిపోయిరి. రాజ్యలక్ష్మి యుక్తియుక్తమగు సంభాషణమును నిర్భయత్వమును మెచ్చుకొననివా రొక్కరునులేరు. నాటి విమర్శన సంగతులను గూర్చి ప్రసంగించి తీర్మానించుకొనుచుఁ బ్రజలు తమతమ నిలయముల కరిగిరి. మంగమ్మ యాశాభంగముతో భర్తతోను, ఇతర బంధుజనముల తోను ఇంటికరిగెను.

మఱునాఁ డుదయముననే మంగమ్మ భర్తతోఁ గూడి కూతును జూచుటకుఁ గారాగృహమున కరిగెను. కారాధికారి పేరిశాస్త్రిని గౌరవించి రాజ్యలక్ష్మి చెంతకు వారిని గొనిపోయెను. ఆమె తల్లిదండ్రులకు నమస్కరించి తన యపరాధములున్నచో క్షమింపుఁడని తల్లిదండ్రులను గోరెను. పేరిశాస్త్రి కూతు నాదరించి యొకటి రెండు మాటలాడి కారాధికారితో నేదియో ప్రసంగించుచుండెను. మంగమ్మ కన్నుల నుండి బాష్పము రాల నేడ్చుచు రాజ్యలక్ష్మిని కౌఁగిలించుకొని "నీవింత పనిచేయుదువని యనుకొనలేదే తల్లీ" అని పలికెను.

రాజ్య—(తల్లి కౌఁగిలి విడిపించుకొని) "తల్లీ! నీవు నా నిమిత్తము దుఃఖింపవలదు. అట్లు దుఃఖింపనని నా చేతిలో చేయివేసి యొట్టుపెట్టుకొన్నగాని నీతో మాటాడను.

మం—అట్లే! (అని చేతిలో చేయివేసి యొట్టుపెట్టుకొనెను.)

రాజ్య—అమ్మా! ఎందుల కేడ్చుచున్నావు?

మం—నా కేడ్పుకాక మఱేమి తల్లీ!

రాజ్య—నీవు విద్యావంతురాలవు. విజ్ఞానవతివి. లోకానుభవవతివి. ఇట్టిదానవు నీ వేడ్చుచున్నావన నా కాశ్చర్యము కలుగుచున్నది.

మం—లోకానుభవము చాలక యట్లనుచున్నావు. కాని నా ప్రాణమవగు నిన్ను విడిచి యెట్లుండగలను తల్లీ!

రాజ్య—నే నత్తింటనుండిన నేమిచేయుదువు?

మం—అత్తిల్లును గారాగారము నొక్కటియే?

రాజ్య—కాక మఱేమి? నీవు విపరీతదృష్టితోఁ జూచిన నేమోకాని సత్యదృష్టితోఁ జూచిన నేమియును భేదములేదు.

మం—అత్తింటనుండిన వలసినప్పుడు చూడవచ్చును.

మం——ఓపలేని దానవు. కావలసిన భక్ష్యములు పంపవచ్చును.

రాజ్య——ఎవరికిఁ గావలసినవి?

మం——నీకుఁ

రాజ్య——నా కేమియు నక్కఱలేనపుడు.

మం——నీవన్నియు లోకవిపరీతమే?

రాజ్య——ఎందుచేత?

మం——కడుపుతో నున్నదానికిఁ గావలసినన్ని భక్ష్యములు పెట్టు దురు. అట్లు పెట్టవలెనఁట.

రాజ్య——చూచితివా! తల్లీ! నీ వింకను అనాగరకతను వదలలేదు. హాతురు కడుపుతో నున్న దనఁగా, దాని కపూర్వములగు భక్ష్యవిశే షములు చేసిపెట్టుదురు. అవి తిని యామెరోగాదులకాలయమై సంశ యాస్పదమగు బ్రదుకు గాంచుచున్నది. గర్భవతులకు భక్ష్యవిశేష ములు పెట్టరాదని పెద్దపెద్ద వైద్యులు చెప్పుచుండ నవనాగరకతానతి నగు నీ వట్లందు వేల? తల్లీ! ఆ విషయమై చింతవిడువుము.

మం——రాజూ! నీ వసందర్భముగా మాటాడిన నేనుఁ జెప్పలేను. కాని గర్భవతులను బుట్టలలోఁ బెట్టి యాదరింతురు. ఆదరింపవలెను.

రాజ్య——లేనిచో,

మం——గర్భవతులకుఁ దగిన యాహారము లేకపోయిన సంతానము బలహీనమగును. పురిటాలు దుర్బలయై రోగగ్రస్తయగును.

రాజ్య——తగినపదమున కర్థమేమి? భక్ష్యములని కాదు కదా!

మం——కాదు. కాని సంతృప్తికరమైన భోజనము కావలెను.

రాజ్య——అసంతృప్తి పదమునకు నియమముండునా?

మం——ఉండ కేమి? ఆకలితీఱునట్లు భుజింపవలెను.

రాజ్య——అవును. అట్లే చేయవచ్చును.

మం—ఇష్టమైన కూరలు, పాలు, పెరుగు మొదలగు రుచికర పదార్థములు లేకున్న నాకలితీఱునట్లు భుజింపలేము. ఇవన్నియు కైదులో దొరకునా ?

రా—నీవు పొరపడుచున్నావు. ఆకలితీఱుట కవన్నియు నక్కఱ లేదు. కలియో, యంబలియో, చాలినంత యుండవలెను. అదియు మన యలవాటును బట్టియుండును. అదిమన యిష్టమువచ్చినట్లుమార్చు కొనవచ్చును. మఱియు నాహారము విషయమై నియమము చేసికొన్న దానినిబట్టియే సంతృప్తియు నుండును. గర్భవతివైన నాకు సరిగా నాహారముండదని భయపడకుము. పోనీ ? తల్లీ ! దేవకీదేవి గర్భవతియై కైదులోనుండియే పిల్లనుగాంచినది. ఏమిలోపముకల్గినది. సీతాదేవి గర్భవతియై మహారణ్యములో పండ్లు కాయలు దిని కుశలవులను గన్నది. ఏమిలోపముగల్గినది ? ఆమె కంతఃపురములలోని మధుర పదార్థము లడవిలో లభింపవుకదా ? ఒకవేళ మునులాదరించి పెట్టిరన్నను, రాజాంతఃపురములలోని భక్ష్యములవంటివి లభింపవుగదా ? తృప్తి యనునది మనస్సునుబట్టి యుండునుగాని పదార్థములనుబట్టి కాదు. అందుచేనీవు నన్నుగూర్చి భయమందక నిండుమనముతో నాశీర్వదించి పంపుము.

మం—తీర్చుకొనవలసిన నాముద్దుముచ్చటలు తీఱవుకదా !

రా—ఇంకను నీవింత యజ్ఞానాంధకారములో మునిఁగియున్నావని నేననుకొనలేదు. ముద్దుముచ్చటల కాసించువారు పామరులు. మనము కాదు. నిజముగా మనము సుఖించుటకును, ముద్దుముచ్చటలకును బుట్ట లేదు. పరమేశ్వరుఁడు విద్యావివేకాదులిచ్చుట మన సుఖముల నిమిత్తముకాదు. నిజముగా దుఃఖమయమగు నీలోకమున సందులో నస్వతంత్రమగు భారతదేశమున సుఖమెక్కడనున్నది. మనకుఁ బరమేశ్వరుడీ బలిష్ఠ శరీరమేల యిచ్చినాఁడు ? మననిమిత్తముకాదు. స్వార్థమువీడి

దేశ సేవయు సంఘ సేవయు జేయునిమిత్తము. అందులో దేశ సేవ ముఖ్యము. స్త్రీలేమి? పురుషులేమి? దేశ సేవచేసి దేశమునకు స్వాతంత్ర్యము సంపాదించి పిమ్మట దాని నభివృద్ధిలోనికిఁ గొనివచ్చి తరువాతఁ గావలసిన చిల్లరి సంస్కారణములు చేయుఁడు. మీరుచేయు సంఘ సేవ నిష్ఫలము. దేశస్వాతంత్ర్యము లేకుండ మీరెంతకాలమట్లు కష్టపడిన లాభము సుంతేనియు గలుగదు. మనకుఁ బరమలక్ష్యము దేశముకాని యితరములుకావు. దేశమునకు స్వాతంత్ర్యము సంపాదింపుఁడు. పిమ్మట మీరిప్పుడధికముగాఁ గష్టపడి తెచ్చిన సంస్కారము లప్పుడు తమంత తామే సులభముగా నెలకొనును.

కావున మన మందఱమును దేశసంసేవకుఁ గడంగవలెను. మనము విహితకృత్యముమాని యుద్యోగముల కాసించి కాకులవలె స్వోదర పోషణమునకుఁ గడంగితిమి. అట్లు మనమెంతకాలము బ్రదికిననేమి లాభము? మనచేతలు, మనతలంపులు, మనశక్తులు, మనశరీరములు, ఇవియవియనేల? మన సర్వస్వము దేశారాధనకై వినియోగించి దేశ స్వాతంత్ర్యమే పరమలక్ష్యముగా నుంచుకొని వర్తింపవలెను. సర్వకాల సర్వావస్థలయందును, మనము నీ దేశనిష్ఠతో వర్తించినచో, పోలీసుల లాఠీఘాతములుగాని, కారాగారములుగాని బ్రిటిషువారి మరఫిరంగులు గాని మనల నేమియుఁ జేయఁజాలవు. మొన్న పోలీసువారిదిగో నిక్కడ గొట్టినారు. ఇదిగో నింకను రక్తము చిందుచున్నది. కానిమ్ము నాకేమి కష్టమునచ్చినది. వలసినచో దేశసేవకై శరీరమునే యాహుతి చేయఁ దలఁచినప్పుడా శరీరములో నొకమూల చిన్న దెబ్బ దగిలినంత మాత్ర మున విచారమేల? అయ్యో చనిపోఁగలవమా! అందువేమో! అవును. చావెప్పుడు నందఱకును సన్నిహితమే. దానిని దప్పించుకొన సామాన్యముకాదు. ఏరోగము నాతనోపడి మరణింతుము. అప్పుడు మన మేమి చేయఁగలము? అట్టి నశ్వరమగు శరీరమును వృథాగా మట్టి

పాలు చేయుటకంటె నుత్తమ పురుషార్థము విషయమైన దానిని వినియో గించుట వివేకముకదా? జడ్జిగారి భార్యయైననేమి, గవర్నరుగారి కూతురైననేమి? ఏమిలాభము? ఇవన్నియు నిక్కడి భేదములు. కన్ను మూసిన నంతయు నొక్కటియే. కావున మనుష్యుడు దేశా రాధన కర్పించి జీవపుష్పములతో దేశమాత నారాధించిన వాని జన్మమే జన్మము.

> గీ. "పౌరుషజ్ఞానకీర్తులం బరంగనేని,
> వానిజీవన మొకపూట యైనచాలు,
> ఉదరపోషణ మాత్రకై యుర్విమీద,
> గాకిచిరకాలమున్న నే కార్యమగును!"

అని యొక పండితుఁడు నుడివియున్నాఁడు.

కావున, ఓతల్లీ! నాపూర్వపుణ్యము కొలఁది నాకీ దేశసేవా భాగ్య మబ్బినందుల కానందింప వలసియుండఁగా విచారింతువేల? నీవిఁకనైనను జ్ఞానపరిపక్వ స్వాంతవై వర్తింపుము. అవలీల కారాగారవాస మనుభ వించి నిన్నుఁ జూడవచ్చెదను?

రాజ్యలక్ష్మి మాటలువినగానే మంగమ్మకు మతిపోయినది. కుమారిబుజముపైనున్న యామెచేయి యామెకుఁ దెలియకుండఁగనే విడిపోయినది. ఆమెకన్నుల నీరింకిపోయినది. ఒక్కవేడినిట్టూర్పు పుచ్చెను. నిజముగాఁ దానేదియో ఘనకార్య మాచరించుచున్నట్లు భావించుకొనుచుండెడిది. కాని కూతురుమాటలు వినగానే యామె యహంభావము యథాయథలై పోయినది. రాజ్యలక్ష్మి కింత దేశభక్తియు, విజ్ఞానవైరాగ్యములు గలవని యామె యెప్పుడు ననుకొనలేదు. ఆమె కూతును మఱియొక మాఱు కౌఁగిలించుకొని ముద్దాడి "అమ్మాయీ! వెళ్లెదనని చెప్పెను. కూతురు నమస్కరించెను. తల్లి దీవించినది. పిమ్మట నామె భర్తతోఁగూడి రామారావును గూడఁ జూచి నమస్కరించిన

యతనిని దీవించివచ్చి మోటారు బండిలోఁ గూర్చుండెను. పేరిశాస్త్రి యునువచ్చి బండిలోఁ గూర్చుండెను. బండికదలెను. పేరిశాస్త్రి భార్యతో "నిన్ననీవన్న విషయము, అమ్మాయితో మాటాడితివా! ఏమన్నది" అనెను.

మం—"అమ్మయో! అదికూతురుకాదండీబాబు, అది నిజముగా లోకమాత, నాకెంతోయుపదేశము చేసినది. ఇఁకనొక్కనిమిష మది విన్నచో నాకును దానికివలెఁ గారాగృహాభిలాష కలుగకపోదు. మఱిమాటాడక వెడలివచ్చితిని. నాకత్యాశ్చర్యము కల్గినది. చిన్న పిల్లకదా! దానికిట్టి విజ్ఞానవైరాగ్యము లెట్లుకలిగెనో తెలియ"దనెను.

పే—అట్టిగొప్పగుణములు కల్గుటకుఁ గారణము పూర్వజన్మసుకృతము. అది యందఱకును లభింపదు.

మం—"ఇదివఱలోనేను విద్యావతినని గర్వించుదానను, నేడమ్మాయి చేసిన యుపదేశమువలన నిజముగా విద్యావతిని, విజ్ఞానవతిని నయితిని. ఇఁకనాకు విచారములేదు. నామనస్సున కాందోళనమునులేదు. పోనిండు, పిల్లదానిని దప్పించికొని రాలేకపోయినను సర్వదా మనస్సు నందిడియున్న దుఃఖమును దప్పించుకొని వచ్చితిని" అనెను.

కొలఁదికాలములోనే వారిల్లు చేరిరి.

## ౨౬

### పరిసమాప్తి.

మఱునాఁడు సాయంకాలము ట్రయినులో నాక్కైదీల నందఱను పోలీసు వారు బళ్లారి కారాగారమునకుఁ గొనిపోయిరి. రాజ్యలక్ష్మి రామారావులొకచోటనే యుండుటచే వారికిఁ బరస్పరదర్శనభాగ్య మబ్బుచుండెడిది. మఱికొలఁదికాల మరుగునప్పటికి రాజ్యలక్ష్మికి నొక మగశిశువు గలిగెను. ఒకయుత్తరములో రాజ్యలక్ష్మి తల్లికీయంశమును వ్రాసెను. ఆమె యత్యానందమునఁబోయి కైదులోఁ బుత్రికపతియగు కుమారును గాంచి సంతసించినది. రాజ్యలక్ష్మి కారావాస మాఱునెలలు ననుభవింపలేదు. దేశనాయకులకును ప్రభుత్వమునకును గల్గిన సంధివలన దేశభక్తులందఱును గారాగార విముక్తులగుటచే మంగమ్మ తిరిగి విశాఖపురిజేరిన కొలఁది దినములలోనే కూతురు పతి సుతులతో నింటికి వచ్చెను. దారిపొడుగునను వారి కమితగౌరవము గల్గినదని వేఱ చెప్ప నక్కఱలేదు.

పోలీసు వారెంత తప్పించినను, పేరిశాస్త్రి యెంతయత్నించినను పేరిశాస్త్రిగారిపై నేరము తప్పలేదు. అతఁడుద్యోగము వదలుకొనక తీఱినదికాదు. అందుచే నతఁడు కొంతకాలమునకు స్వస్థలమగు అయినవిల్లికిఁ గుటుంబముతో నరిగెను. శివావధానిగారి కుటుంబము తోఁటల వలెనే నూలువడికి జీవనము వెళ్లింపసాగిరి. తమయింట నుండినను నుండుమని తల్లిదండ్రు లెంతచెప్పినను వినక రాజ్యలక్ష్మి భర్తతోఁ దన యింటికేగి యత్తమామల గౌరవాదరములకుఁ బాత్రమై సంచరించెను. అంతేకాక యామె తనపుత్రునకు మామగారి పేరుపెట్టి శివరామశర్మరావని పిలువఁజొచ్చెను.

సర్వేజనా స్సుఖినోభవంతు.